దొల్లి పేదవార లుల్లమ్మగ్గల శ్రద్ధఁ బెట్టఁ గోరుచుండినట్టివారు. 90

సీ. ఆయాసపడక కంటక నర్థంబు సేతురు, వారు పాత్రజనంబుఁ దార పిలిచి
తొలుమేనఁ బెట్టినయట్టి ఘనదానధర్ములు, ధనసిద్ధి బహులయత్నమునఁ గలుగు
మనుజులు పూర్వజన్మమున నర్థుల నమ్మి, [1]నడుగ దాఁపక యిచ్చినట్టివార
లాయాసమునను విత్తాగమం బెసలెదు, జనులు మునుపటి పుట్టువునఁ గృపావి

తే. హీనులై యాచకుల నలయించి విడిచి, నిదనిలోభులు పుడిసి ధనేమెఁ దగున
రుండు ప్రాయంబునాఁ డీగఁ గడఁగి, తొంటిభవమున నీకిర్చఁ గ్రాడఁగితేఁడు.

తే. కలిగి యుండియుఁ దేవపూజలతన భోగములు భుజింపఁగ లేనిమనుష్యులు గిరీంద్ర
తనయ తొలుచేన రోగముల్ గనిని చచ్చు, నపుడు దానంబు సేసినయట్టివారు. 92

తే. అధిక సౌందర్యములు గలయట్టిజనులు
దొల్లి మాంసభోజనములు దొలఁగి యున్న
వారు రూపవిహీనులు దారు రూపు
గలిగి తొలుమేనఁ గొనటులఁ బలికినారు. 93

క. విను సౌభాగ్యసమేతుఁడు, మును నిజదారైకపరుఁడు ముందటిజన్మం
బున భార్యకుఁ బ్రీతి యొనర్పనిమనుజుఁడు సుభగతావిరహితతఁ బొందున్. 94

క. అమితజ్ఞానము విజ్ఞానముఁ గలిగియుఁ బేద యైననరుఁడు సనినజ
న్మమున వినికి గలిగియు దానము తెరువునఁ బోనివాఁడు నలినదళాక్షీ. 95

క. తగుబుద్ధి లేక సంపద, మిగులఁ గలుగువాఁడు దొంటిమేనఁ గరుణామై
విగత ప్రజ్ఞం డయ్యును, దగ దీనులఁ బ్రోచినతఁడు దళితాబ్జముఖీ. 96

సీ. మేధావి యై విద్య మిగిలి విద్యలఁ బొల్చు, నరుఁడు దొల్లి గురునకధిక
భక్తుఁడై తన దైన్యపాండిత్య మొరులకుఁ, గావించు వేడుకఁ గలుగుసుజనుఁ
డభ్యసింపంగ విద్యాయుక్తి లేకుండు, నాతఁడు దొల్లి విద్యాధికత్వ
మున గర్వి యై శిష్టజనులకు సభ భంగ, మొనరించి కుందఁ జేసినయతండు

తే. భార్యయును బిడ్డలును దాను బహుధనముల
భోగులై రోగములు లేక పొల్చువార
లమలినాచారపాత్రదానములు సత్య
కరుణలును దొంటిభవమునఁ గలిగినారు. 97

ఆ. ఆలు బిడ్డ లొంటులై లేమిఁ గుందుచుఁ, దెవులు చేతఁ బడుచు నవయుజనులు
మున్ను క్రోధలోభముల నాస్తికతఁ బర, పీడనంబు సేసి పేర్చినారు. 98

సీ. కాంత జాత్యంధుండు [2]గన్నులు సెడువాఁడు, దన మోహమెఱయుచుఁ బగిలి యొరుని
వనితఁ దొల్మేనఁ జూచినవాఁడు కర్ణరోగార్తుండు కటుకవాక్యములఁ దొల్లి
శిష్టు నొప్పించినకష్టుండు గడుపునఁ, దెవు లైనతఁడు పూర్వభవమునందు

1. గ, నడిగి తాఁకఁగ నిచ్చి. జ. నడిగి తాఁఱఁగ నిచ్చి. 2. గ. గడు సుందరుం డయి తన.

తే. పశుజనంబులు భోగైకపరతఁ దొల్లి, మానసీయుల కనవర § మీరివారు
రాజసంసితోః తన్మృతాంక § రాఘుఁ గ్రాక్ష్యదంపుబాపితుఁ జేసి § లెంకుమూవె. 107

క. వినుకన్యలోధగు లెవ్వజములు ఘీత్సేప మిఃకన్యాగతులు గొలుబా
మున మగుణ నీ నేఁ మిషి, కొనసృష్టియశత్యాలోధ § కుతిస్తు లతివా. 108

క. తమబంధులుఁ దారును నో,కృమటియు తెగటాఱువారు § కరుణారహిత
త్వమునఁ దొలుమేన నెకపగ, నమేయశరవధము సేసి § పట్టినురాత్మల్. 109

వ. అని యెఱింగించి యీశ్వరుం డీశ్వరితో ని ట్లనియె. 110

సీ. ఇంతి నాచెప్పినక § వ్యాదికర్మ ఫలజకరా నరకంబు § దప్ప దంతః
జనపాటు లెల్లను § బత నప్పి నరు లైక,యష్టంపు వాటిల్లి § నట్టి తెఱఁగు
లివి యట్లు గాకయు § నెక్కుడుగాని పాపంబుల మానుష § భవము గలుగు
[1]ని ట్లైన న ట్మైన § నేకర్మమునఫల, మైనను మానవు § లనుభవింప

ఆ. రోపి మునులు దేవ § యోనులు న త్తను,వునన తపముఫలము § లనుభవింతు
రనిన దేవి యెఱుఁగ § నయ్యెమీఁదయుఁ బెక్కు, లర్థములు కృతార్థ § నైతి ననియె

వ. అని వెండియు నద్దేవుని తో మనుజు లపరజన్మంబునం గాని కర్మఫలంబు లను
భవింప రంటిరి తప్పు సేసిననరుల నరపతు లిట్టితప్పున కిట్టిదండం బనునిరూపణం
బున దండించెదరు యట్టి కర్మంబుఫలంబు ప్పట్టువునన యనుభవించుటగా దె యనిన
గౌరికి గంగాధరుం డి ట్లనియె. 112

సీ. జనపతుల్ దమరాజ్యస్థంబున దండించి,నారు గా నొల్లక § నరులతప్పు
లకుఁ దగుదండంబు § లన వారిఁ బఱతురు, తక్కొరు లెవ్వరుఁ § దప్పు సేయ
వెఱచుట కై యట్టి § విధి మూఁడు టది పూర్వ,కర్మంబువలనన § కాని యపుడు
గల్గినతప్పునఁ § గా దన్న నా దేవి, యవనీశ దండితుఁ § డైననరున

తే. కఘము వాయునో వాయదో § యనిన నీశ్వ
రుండు నృపదండితుఁడు యమ § దండమునను
బడఁడు లేనితప్పున నరుఁ § బఱచినతనిఁ
బఱుప కున్నాతనిని యమ § బాధ వొందు. 113

వ. అని నిర్దేశించి వెండియు. 114

క. వినుతమచేసినకర్మం,బునఫల మెవ్వరికిఁ ద్రోచి § పుచ్చఁగ రా దె
ట్లును గుడువక పో దది యన,విని పార్వతి యిట్టు లనియె § విభునకుఁ గృష్ణా.115

తే. కర్మఫలములు గుడిచినఁ గాని పోవ, వంటి వానిఁ బ్రాయశ్చిత్త § మపహరించు
నందు రశ్వమేధంబున § నఖిలపాప,ములును జెడు నన(ఁ)గా విందు § భూతనాథ.116

వ. అని పలికియిది యెట్లొకో యనుటయు భవుండు. 117

1. చ. నట్లయిన నమ్మైన నాకర్మములఫల.

ఆ. అతివ కామకృతము లైనకర్మంబుల, ఫలము లనుభవింప వలయు వినుమ
కామకృతము సెడుటగలుగుఁ బ్రాయశ్చిత్త, మాచరింప సంశయంబు వలదు.

క. కావునఁ గుడువక పొలియదు, దేవాసురమునుల కైన దేవీ కర్మో
ద్భావితఫల మీయర్థము, నీ వలవఱపుము భవన్మనీషఁ దిరముగన్. 119

వ. అని చెప్పి యప్పరమేశుఁడు వెండియు, 120

క. సుకృతముల నరుఁడు నాకము, నకు జను నవి గొంచె మైన నరుఁడ యగునువా
నికి దివి కేఁగి డిగినయత, నికి మానుషవైభవములు నెఱయం గల్గున్. 121

వ. అని నిర్దేశించి యుద్దేశరూపంబున గర్మంబుల తెఱం గెఱింగించి యింక నేమి యడుగ వల తడుగు మనిన నంబిక కర్మకరణంబు జంతువశంబు గ్రహవశంబు నా రెండుదెఱంగులం జెప్పుదు రం దెయ్యది దృఢం బని యడుగుటయు మృడుం డి ట్లనియె. 122

తే. నాతి విను గ్రహచారంబు హేతువులుగ
నశుభములు శుభములు నరుఁ డాచరించు
గ్రహము సేయించునే తాన కాక చేత
కొడయుఁ డగు గాన ఫలములు గుడువ వలయు. 123

వ. అనినఁ జావనునది యేమి యని యుమ యడుగ నీశానుం డి ట్లనియె. 124

తే. నిత్యుఁ డాత్ముండు దేహ మనిత్య మతఁడు
ముదిమిఁ దెవులున వికృత మై యది వికలతఁ
బొందుటయు దానిఁ దొఱఁగి తాఁ బోవునట్టి
దశకు మరణ మన్పే రయ్యెఁ దనులతాంగి. 125

క. జీవుఁడు జీర్ణశరీరముఁ, బో విడిచి నవంబుఁ బొందఁ బుట్టను పేరం
దా వెలయం దద్దశ జీ, వావలి వర్తించు నిటు గతాగతిపర మై.

వ. అనిన విని పార్వతి శర్వునితోఁ బాలురు నచ్చుటకును వృద్ధులు పెద్దకాలంబు బ్రదుకుటకును గారణం బేమి యనుడు నతండు. 127

తే. మేను జీర్ణముగాఁ జేయుఁ గాని మరణ
మొందఁ జేయదు విను కాల మొందు నరుని
పూర్వకర్మంబు లాయువుఁ బొదలఁ జేయ
సన్నముగఁ జేయ బ్రతుకును జావుఁ గలుగు. 128

వ. అని చెప్పిన నాయు వేమిటం బెరుఁగు నెద్దానం దఱుఁగు ననిన విని యుమకు నుమాపతి యి ట్లనియె. 129

—•• శివుఁడు పార్వతికి నాయుర్వృద్ధిక్షయంబులకుఁ గారణంబులు సెప్పుట. ••—

తే. క్షమయు సత్యంబుఁ గృపయు శౌచమును గురుల
వలనిభక్తియు నాయువుపొలుపు నిచ్చు

నలఁక బొంకు క్రూరత శుచిత్వాపగమము
గురువిరోధ మాయువుఁ గడుఁ గుందఁ జేయు. 130

తే. తపమునను బ్రహ్మచర్యవ్రతమున హితమి
తాశనమున రసాయనాభ్యాసమునను
బెరుఁగు నాయు వాక్క్రియలపై నరుఁకు ప్రీతి
గలుగుటయుఁ బూర్వభవకృతకర్మఫలము. 131

క. తనలావున కధిక మగునఁ బని సేయు[1]టయుక్తమును నపథ్యము నగుభో
జనములుహరించు నాయువు, వనిత యవియుఁ బూర్వకర్మవశతన కలుగున్. 132

వ. మఱియు నొక్కవిశేషంబు సెప్పెద. 133

ఆ. సుకృతు లమరలోకసుచిరవాసులు నిట
దిగి చిరాయువులును నగుదు రితరు
లతిచిరముగ నరకగతు లయి తుది నాయు
వల్ప మగుమనుష్యు లగుట గలుగు. 134

క. నా విని భవాని పురుష,స్త్రీవిధములు రెండు గలవు త్రినయన వానిఁ
జీవుఁడు వర్తించుతెఱఁగు, నీ వేర్పడఁ జెప్పవే యనియెఁ గంసారీ. 135

వ. అనిన విని మహాదేవుండు మహీధరతనయ కిట్లనియె. 136

క. తాత్త్వికము లైనపురుష,స్త్రీత్వంబులు లేవు పార్వతీ జీవున కా
తత్త్వమున కహంకృతిఁ గర్మత్వ మొలసి భావ్యవిధమ మెయిఁ గొనుచుండున్. 137

వ. అని మఱియును. 138

ఆ. కర్మములకుఁ గర్త గాఁ డాత్మఁ డతని సత్త్వము రజస్సుఁ దమము వాతపిత్త
కఫము లెట్లు మర్త్యకాయగతము లగు, నట్ల పొందుఁ గర్తలవియ చూవె. 139

తే. సత్యశౌచదయాదులు సాత్త్వికములు
రమణి లోభసంగాదులు రాజసంబు
లనృతహింసాపరత్వభయాలసత్వ
ధైర్యహానినిద్రాదులు తామసములు. 140

క. ఇవి నానాముఖములఁ బురుషు వికారముఁ బొందఁ జేయుచుం బరఁగును హై
మవతీ కావున సర్వంబు వినుము గుణకృత్య మిట్టిబోధం బొప్పన్. 141

తే. తన్వి సాత్త్విక రాజస తామసాత్మ
లైనవారలఁ బుణ్యలోకానుభవము
మనుజభావంబు నిరయపీడనముఁ బొందు
మోక్షలక్ష్మి నిర్గుణునకు మునుఁగ మునరు. 142

వ. అని వెండియు. 143

---

1. చ. ట. యుక్కటము నపథ్యం

సీ. ఎట్టివి కర్మంబు ÷ లట్టివ నరులకు, భాశుభసంప్రాప్తు ÷ లట్లు గాక
పరవి ప్రియ యుగున మేల్ ÷ వశయుటయును గల్గుఁ, బలిభృత్యతతిఁ బటు ÷ భర్త్సనముల
నొజ్జ శిష్యులఁ దర్జ ÷ నోక్తుల వెజ్జ రో, గార్తుల నానావి ÷ ధౌషధములఁ
నలమటఁ బొందింతు ÷ రవ్విధంబుల చేత, లగ్నయు సుకృతంబు ÷ లై ఫలించు
ఆ. పని వాటియును చెప్పు ÷ నభిలేంద్రియోపేత, మగు జరాయుజంబు ÷ నండజంబు
నవిద చోటు నెఱుఁగు ÷ నుద్భిజ్జములు స్వేద, జములకదియుఁ జూప్ర ÷ సంభవించు
క. నరుఁడు జరాయుజములలోఁ, దరుణీ విను ముత్తముఁడు ప్రకృతము లేకున్నన్
పరి నతఁడు బసువ్రు గావున, వరిష్ఠ ముగునట్టివిని ÷ వలయు నయనకున్. 145
క. ఇరు దెఱుఁగు విను లమును శా, ర్వరమును దేహజము శార్వ ÷ రము తేజస్సం
స్ఫురణమునఁ జాయు ÷ ప్రతమునఁ, బరిహృతమగు దేహజంబు ÷ పర్వతపుత్త్రీ. 146
ఆ. బ్రహ్మ యాతమంబుఁ ÷ బాపుట్లై తపో, వ్యాప్తిఁ బడసె ప్రతులు ÷ నంగములును
గాన కార్యములు న ÷ కార్యంబులును వానఁ, దెలిసికొనఁగ బుద్ధి ÷ కలఁక దేఱు. 147
తే. క్రోధకామాదు లైనను ÷ గ్గుణము లెల్ల, వాయుహతి మేఘపటలంబు ÷ వాయుపగిది
ప్రతము చేఁ బాయు నరులలో ÷ సురలకరణి, ప్రతయుతులు దేజరిల్లుదు ÷ రతిశయిల్లి.
తే. ప్రతమునరునిఁ బరిజ్ఞాన ÷ యుతునిఁ జేయు, [1] వానిసుకృతమప్పుమును ÷ నూనఫలము
నిచ్చు నజ్ఞానిసత్కర్మ ÷ మెంతయైన, నఫలమగుఁ గాన ప్రతవంతుఁ ÷ డగుట వలయు.
వ. అని నిర్దేశించి సర్వేశ్వరితో సర్వజ్ఞుం డిట్లనియె. 150
సీ. స్మృతిఁ బొంది వేగ జ ÷ న్మించినఁ బూర్వదై, హికములన్నియు బుద్ధి ÷ నెలయువాఁడు
జాతిస్మరుం డనఁ ÷ జను నయ్యెఱుక [2] పెద్ద, వాఁడు గాఁగాఁ జెను ÷ వనిత వినుము
పుట్టియుండుట కల్మి ÷ బోధించు టగు నాస్తి, కుల మను జన్మంబు ÷ గలుగు తెఱఁగుఁ
జచ్చిపోయిన వారు ÷ వచ్చియు త్తనువొంది, మెలఁగుటకొక్క చోటు ÷ గలిగియుండు
తే. నట్టి తెఱఁగు వెంగలు లైన ÷ యమునిమాత
లోరులఁ జని కొనిపోయినఁ ÷ గరుణతోడ
నమ్మహాత్ముండు మగిడి పా ÷ మ్మన్న నరుగు
దెంచు టని నీ వెఱుంగు సం ÷ దియము లేదు. 151

—•• శివుఁడు పార్వతికి స్వప్నాదుల తెఱం గెఱింగించుట. ••—

వ. అని తెలిపిన గౌరి కల యనునది యేమి యెఱింగింపవే యనుట యునతండు. 152
ఆ. స్వప్నమనఁగ సుప్తజనమును మనశ్చేష్ట, [3] యునియుఁ గాంచు మన మ ÷ నాగతములఁ
గాన కలలు సూచకము ÷ లగు భావిశు, భాశుభోదయములకని యుఁ జెప్పె. 153
వ. చెప్పిన విని భవాని భవునితోడ. 154
సీ. దైవంబొ కర్మకర్తనము జనంబును, శ్నానంబొ యనిన న ÷ తండు దైవ
మోపికర్మంబు సేయుట లేమ దైవసం, కలన ఫలం బిచ్చుఁ ÷ గాని వినుము

1. గ. వాని సుకృత మనల్ప మనూనఫలము. 2. గ. పెద్ద, వాఁడు. 3. అ. యదియు...యోగి...కమఁ జెప్పె.

దేవి పూర్వకృతంబు దైవనామకమునఁ, బరఁగు నప్పటిచేఁత పౌరుషంబు
కృషివోలె నుండుఁ బౌరుషగతి వర్షస,ద్వాయువులట్లు దైవప్రకార
తే. మెఱుఁగు ఖననమథనములనెట్లు జలముఁ, జిచ్చుఁబుట్టు నమ్మాయి నరుచేష్ట దైవ
యోగమున సిద్ధిఁబొందు నుద్యోగరహితుఁ, డత్తెఱంగున దైవసమృద్ధిఁబడయు.
క. కావున నుద్యోగంబును, దైవంబును గారణములు తామరసాక్షీ
యేవిధమునఁ గర్మములఫ,లావాప్తికి దీన సంశయము వలదు సుమీ. 156
తే. అనిన నంబిక గర్భంబు నాత్మఁ డెట్లు, సొచ్చు ననవుడు నభవుఁడు సురతబీజ
రక్తదేహముల్ సూవె కారణము లాత్మ,గర్భసంవేశనమున కుఁగమలనయన.
క. మాయారహితుఁ డహంకా,రాయత్తతఁ జూవె పుట్టు వను చెఱఁ బడి నా
నాయాసంబులఁ బడు నా,జ్ఞాయుతుఁ డై యాత్మఁ డింత చర్చింపు మదిన్. 158
సీ. అని చెప్పి దైవరహస్యంబు వినిపింతు, విను మని పలికె యిట్లనియె శివుఁడు
దొల్లి మనుష్యులు దొలుమేనికర్మంబు, తెఱఁగఁగాఁ జాలుట నెల్లవారు
మేలు సేయఁగ ననిమిషలోకమున నధి,కం బగునందడి గాఁగ మనుజు
లమరు లై పేర్చిన నజుఁడు వేల్పులసంక,టము వాయుటకు నుపాయము దలంచి
తే. మానవుల కయ్యెఱుక కల్మి మాన్చి కామ,రోషముల నొలయించిన దోషకృతుల
వారు నరకాదిసమ్మర్దకారు లగుఁడు, నదియుఁ గాదని చింతించి యనువుగాంచి
క. సరిగా నా రెండెడలకు, నరులు ననుట గోరి మనముననం గానమియుం
బరలోకవిధము శాస్త్రము, వెరవునఁ గనుటయు నొనర్చెవిధి వారలకున్. 160
వ. అనినం బార్వతి పునర్జన్మంబు గలదు లే దనుసంశయంబుతోన పొట్టుపార లగు
దురు నరులు దాని తెఱంగు నిశ్చయింపవే యనుటయు నంధకారాతి యిట్లనియె:
క. కలదో లేదో యనియెడు,తలపోఁతయ కాని నిశ్చితము గాదు సురా
దులకుఁ బునర్జన్మంబున,కలిమియు లేమియును నరులు గానమి దప్పే. 162
క. కల దది యూరక కానఁగ, నలవియె శ్రుతివాక్యసమితియర్థంబులపై
నిలిచిన శ్రద్ధం గ్రమమునఁ, దెలి వొందినఁ గాక యెట్టిధీమంతులకున్. 163
వ. అనిన విని గౌరి గంగాధరున కిట్లనియె. 164
క. మృతు లైనవారలు నిరా,కృతు లై యుండుదురు వారిఁ గీనాశభట
ప్రతతి గొని చనుట యాపితృ,పతి శాసించుట వి యెట్టిభంగులు దేవా. 165
వ. అని యడిగిన నద్దేవుం డిట్లనియె. 166
సీ. తఱి యైన మనుజులఁ దనువులు విడిపించి, మాయాశరీరసమన్వితులుగ
నొనరించి దూతలు గొని పోదు రందును, ధర్మవర్తుల సుగంధంబు మృదువు
నైనమార్గమున మధ్యపువారి నిర్బాధ,సరణిఁ బాపాత్ములఁ బరుసఁదనము
మిఱికియుఁ గలపథంబున నడపింతు ర,ప్పురుసునఁ జని పితృపతికిఁ జూప
ఆ. నతఁడు పుణ్యలోకగతియును మానవ,త్వంబు ఘోరనరకవాసమును వి

ధించి పుచ్చు వారిఁ ✽ దెలిచి మన్నించి భర్జించి వరుసతోడఁ ✽ జిగురుఁబోఁడి.

వ. అని చెప్పిన నగేంద్రతనయ చంద్రశేఖరునితోడ. 168

క. నరకం బెట్టిది కల్మషకరు లెట్టి జముఁ డెట్టిభంగిఁ ✽ గాఱియఁ బెట్టున్
వరదా చెప్పు మనవుఁడు నప్పురహరుఁ డి ట్లనియె వృష్ణి✽పుంగవ ప్రీతిన్. 169

సీ. రౌరవం బనఁగ ధ✽రాస్థలి క్రింద మహారౌరవం బన ✽ నవుల దాని
కావల విను కంట✽కావనం బన నందుఁ గ్రమవృత్తిఁ బేర్చు దుః✽ఖములు గలిగి
యగ్నికుండంబు నా ✽ నట పంచకష్టంబు నాఁ గల వి ట్లున్న✽నరకతలము
లై దండుఁ బాపక్రి✽యాతారతమ్యంబు లూహించి యంతకుం✽డునుపఁ బనుచుఁ

తే. దగినయెడలఁ బాపాత్ములఁ ✽ దద్భటాలి
దహనశస్త్రబంధన✽తాడనములఁ
బఱుప వారలఁ గుక్కలుఁ ✽ గఱచుఁ గ్రిములు
దొలుచు గ్రద్దలు నొప్పించుఁ దుండనిహతి. 170

వ. మఱియును యమదూతవ్రాతంబు నానావిధవేదనలం బెట్టి దండించుచుండు. 171

ఉ. అవ్విధిఁ బాపముల్ వొలియ✽నంతకు దుఃఖము లంది కీటజ
న్మమ్ములఁ బక్షిరూపములఁ గ్ర✽మంబునఁ బొంది మృగత్వమానుష
త్వమ్ముల నోలిఁ బొందుదురు ✽ వారిను వెంతయుఁ గ్రాఁగి కల్మష
త్వమ్ము దొలంగుమాడ్కి నవ✽తామరసప్రతిమానలోచనా. 172

వ. అనిన విని పార్వతి పాపంబు లనునవి యెట్టివి యెఱింగింపవే యనుటయు నీశానుం డిట్లనియె. 173

— ✿ [illegible] పార్వతికి మానసవాచికకాయికము లను త్రివిధపాపములఁ దెల్పుట. ✿ —

సీ. వా విని ప్రియసతీ ✽ మానసవాచికకాయికంబులఁ బాత✽కంబు లందుఁ
బరధనాపేక్ష [illegible] మోహ [illegible] ద్వేషముఖములు ✽ మానసంబు
లనృతదారుణభాష✽ణాదులు వాచికములు వధంబును బంధ✽నమును నభక్ష్య
భక్షణంబును నన్య✽భామారతము మద్యపానంబు మొదలైన✽పాపకృతులు

తే. కాయికంబులు విను మధి✽కం బవేయ
పాన మది దుష్కృతంబుల✽లోన నెల్లఁ
బానమున నిందతో వచ్చుఁ ✽ బ్రాణగోడ్డ
ములును జేటులు నరకాబ్ధి ✽ మునుఁగుటలును. 174

క. లోకమున నిత్యస్నానత్యాగుల మై చెడదె సజ్జనావలి మధుపా
నాకాంక్షఁ దొఱఁగి [illegible] గాకల్లా హేమి సేయ ✽ దక్కుఁడు నరున్. 175

క. కావున నీవిధమున సుర సేవింపక యుడుగు టొప్పుఁ ✽ జెలువ సకలవ
ర్ణావళికి దాని గీర్తి శ్రీవైభవపుణ్యగతులు ✽ సేర్చికొన నగున్. 176

క. అన విని యంబిక సుకృతము లనునవి యెట్టి వని యడుగ ✽ నద్దేవికి ని

ట్లనియెం జంద్రార్ధధరుం, డనుమోదోల్లాసి యగుచు నంబుజనాభా. 177

తే. ఔపరమికాభిధానంబు నంబుజాక్షి
నిరుపకరణాఖ్యమును సోపకరణనామ
కంబు నయి లోకమున సుకృతంబు పరఁగుఁ
ద్రివిధముల వానిఁ దగ వివరింతు వినుము. 178

సీ. ఔపరమిక మనునది పాపవర్జన, మకట కానఁగ నేర రజ్ఞజనులు
యత్నంబువలదు [1]వ్యయం బేమియును లేదు, పరలోకభీతిఁ బాపముల దొఱఁగి
నంతన సుగతిసౌఖ్యం బొడఁగూడెడు, నదియు నాత్మాధీన మట్టిదాని
సుకరత్వ మెఱుఁగక చొత్తురు నరకంబు, వెరవరుల్ వ్రతమునవృద్ధయోగ

తే. మునను ధృతిఁ బ్మి నింద్రియవినిమయమున
నది దమకుఁ గలిగింతురు యమ మనంగఁ
బరఁగు నది దాన నాకంబుఁ బడయ వచ్చు
ననినఁ జెప్పంగ నేల ధర్మాభియుక్తి. 179

ఆ. నిరుపకరణమనఁగఁ బరగు శౌచంబు సత్యంబు శాంతి దాంతి యార్జవంబు
వ్రతనిరూఢి సముపవాసంబు బ్రహ్మచర్యంబుకల్మి నియమమంత్రదాని. 180

సీ. [illegible] మునసఁగా శౌచ, మిరుదెఱఁగై యుండు హృదయసుకృత
మాభ్యంతరము విను మాహారశుద్ధియు, నంగశోధనము బాహ్యంబు సత్య
మన్నది గన్నది విన్నది యున్నరూపున నుక్త మగుట యంభోజవదన
శాంతి బుద్ధీంద్రియసన్నివారణ దాంతి, కర్మేంద్రియముల రో[illegible]ప్రవృత్తి

తే. యార్జవము కుటిలుఁడు గామి యగు వ్రతంబు
మంచిపని పూని నడపుట యంచితోప
వాస మశనవిగ్రహ మనవద్య మైన
బ్రహ్మచర్యంబు కామునిబారిఁ బడమి. 181

ఆ. నాతి తీర్థసేవనంబును నియమవి, శేష మగుట దానిఁ జెప్ప వలయు
సకలనదులఁ దీర్థసంజ్ఞలు గల వబ్ధి, కరుగునట్టి విచ్చు నధికఫలము. 182

తే. వానియందును మునిపదమాననీయ, దేశములు నబ్ధిసంయోగదేశములును
దెలియ మనోజ్ఞసంగమదేశములును, బరమతీర్థంబు లగుఁ బద్మపత్త్రనయన.

క. వనధి మహాతీర్థం బం,దును సంయమివరులచేతఁ దొల్లి ప్రియమునం
గొనియాడఁబడినచోటులు, విను ముత్తమతీర్థములు విశ్వేశాభరణా. 184

క. వెలి శుచి యై మతి తీర్థం,బులు సొచ్చుట మేలు నియమములు దీర్చితగఁ
వెలలిన యెడ దేవార్చన,ములు విప్రార్చన లవశ్యమును గృత్యంబుల్. 185

క. చేరువతీర్థము కంటెను, దూరపుఁదీర్థంబు మేలు తోయజవదనా

---

1. గ. ప్రయత్న మేమియు.

శారీరాయాసము త,త్కారణ మై వేదవాక్య§గతి యి ట్లుండున్. 186

క. విను సోపకరణ మనునది, ధనధాన్యాదికసమగ్ర§తను గృహమేధుల్
గొనియూఁ దెలుఁగు దానం,బున వైదికపైతృకాది§పుణ్యక్రియలన్. 187

సీ. న్యాయార్జితం బైన§యర్థంబు వేదవి, త్తము శాంతి మొద లగు§వరగుణములు
గలవిప్రునకుఁ బుణ్య§కాలపావనదేశ,కలితంబుగా భక్తి§గలిగి యీఁగి
మేలిదానము శక్తి§మిగులుట శక్తికిఁ, దగుట దానికిఁ గడుఁ§దగమి యుత్త
మము మధ్యమము నధ§మము నగు దానివి,ధానంబు విను మిట్లు§దైవికంబుఁ

తే. బైతృకంబును లోనైన§పనులఁ దాను, వేడ్క సేయువస్తువుఁ గొను§విప్రుకోర్కి
కనుగుణం బగునదియును§నర్థి నిచ్చు,టధికతర మైనఫలమిచ్చు§నంబుజాక్షి. 188

తే. చేయు పెంతియుహోమ మైనఁ§జేసి పిదప, వగచినట్టిదానము దనుఁ బొగడికొన్న
దానవిధి నిష్ఫలంబులు§గాన రెండు, నుడుగుదాత మహాఫల§మొందఁగాంచు

వ. అనుటయు దాక్షాయణి దాతవ్యంబు లెయ్యవి సెప్పు మనిన భవుం డి ట్లనియె.

—•• శివుఁడు పార్వతికి దానఫలవిశేషంబుల నెఱిఁగించుట. ••—

సీ. అన్నంబుఁ దోయంబు§నఖిలజంతువులకుఁ, బ్రాణముల్ గాన య§త్ప్రవరవస్తు
వుల మేలు దాతవ్య§ములలోన నెల్లను, నతిథుల కవి యిచ్చు§టమరలోక
చిరమహాసౌఖ్యంబుఁ§జేయుఁ గాంచన మగ్ని, యగుట నద్దాన మ§త్యంతపావ
నము సర్వకామప్ర§దము గోవు సద్విప్రు,నకు నీఁగి తద్రోమ§నికరసంఖ్య

ఆ. వరుస నాకలోక§వాసంబు గావించు, నందుఁ గపిల నిచ్చు§నాతఁ డిరువ
దొకటతరమువారి§నూర్ధ్వలోకమునకు, ననుపఁ జాలు వికచ§వనజవదన. 191

క. విను భూమిదానకర్తకు, ననిమిషలోకమున నిలువ§నగు సౌఖ్యంబుల్
దనరుచు నుండఁగ నెఱపెం,పున భూమి గలంతకాల§మును గిరితనయా. 192

ఆ. భూమి సకల మగువి§భూతివిశేషజా,తంబు గలుగుఁ గాన§తత్ప్రదాన
మెల్లవస్తువులును§నిచ్చినయ ట్లగు, దానఁ బోనిపాప§తమము లేదు. 193

క. అతివా కన్నము నిచ్చినఁ, బితృపతి ముద మందు సురలుఁ§బ్రీతు లగుదు రం
చితగతి కర్తకు దొరకును, నతితేజశ్శ్రీయశస్స§మగు నభ్యుదమున్. 194

తే. విద్య యిచ్చుట సత్పాత్ర§విషయ మైన, సద్యయానందపదముఁ జే§యంగఁజాలుఁ
దగఁగదక్షిణ యిచ్చి పే§దలకు విద్య, యీని యోగింపటయుఁదత్స§మానకృతియ.

సీ. తిలరాశి యిచ్చినఁ§గలుగు నగ్నిష్టోమ,ఫలము వాసోదాన§ఫలము చిరత
రాయువు గోవు నీఁగి§యఖిలపీడలఁ బాపు, దాసదాసీజన§దానమహిమ
కర్మవిమోక్షంబుఁ గలిగించు దీపదా,నముఫల మాత్మాతి§విమలభావ
మంబుప్రవాహంబు§నధిగమింపఁగఁ జేతఁ, నిఖిలవ్యసనముల§నిస్తరింపఁ

ఆ. జేయుఁ దెరువు లెన్న§సేయుట సంతాన, మిచ్చు నౌషధంబు§నిచ్చు పెల్ల
తెవులుఁ బాపు సాదుఁ§దెరువరి కునికిప,ట్టొసఁగుటొసఁగుదనుసు§ఖోదయములు.

వ. అనిన విని యజ్ఞంబు తెఱం గెఱింగింపవే యని పార్వతి ప్రార్థించినం బరమే
శ్వరుం డి ట్లనియె. 197

సీ. విను మింతి వైదికంబును లౌకికంబును, నన రెండుదెఱంగుల యజ్ఞవిధులు
వర్ణయోగ్యస్తవనానాంచితస్వ,ధాన్యముల్ గొని దేవతలకుఁ దృప్తి
యగునట్లుగా బుత్త్విజులు తర్పన మొప్పఁగాఁ, గావించునది వైదికంబు దేవ
తలకు మహోత్సవంబులు సేయుటయు గీత,వాద్యనృత్తము లనవద్యములుగ

ఆ. సంఘటించుటయును సద్గంధమాల్యధూ,పప్రదీపభోజ్యభక్ష్యములు స
మాదరంబుతో నివేదించుటయును లౌకికంబు రెండు నమరగణహితములు. 198

తే. ధర్మములు దానములును సత్క్రియలును
సదృశములు గావు వినుము యజ్ఞమున కరయ
యజ్ఞకర్త లోకోత్తరుం డతని కిచ్చు
టతనిచేఁ గొను టధికపుణ్యములు చెలువ. 199

ఉ. మానస కృత్యముల్ సురసమాజ మెఱుంగఁగఁ జాలఁ గావునన్
మానస మొక్కఁడేని జన మంచిగఁ జేసిరయేని యజ్ఞముల్
దానము నాది యైనసుకృతంబులు లగ్గ ఫలింప నీమతి
ధ్యానపరత్వపూతసుకృతంబులకున్ ఫల మిచ్చు మెచ్చుమున్. 200

క. అని చెప్పిన హిమవద్గిరితనయ త్రిపురవైరితోడ దైవికవిధు లే
వినఁగని సంతోషించితి, వినిపింపుము పైతృకంబువిధము వృషాంకా. 201

సీ. అనిన నాసర్వజ్ఞుఁ డద్దేవి కిట్లను, గయ కురుక్షేత్రంబు గంగ యాది
యగుపుణ్యదేశంబు లతిఫలదంబులు, మాఘభాద్రపదాఖ్యమాసములు బ
హుళపక్ష మపరాహ్ణ ముక్కలి యమవస, [1]తేరసి నవమాద్యతిథులుఁ దుష్టిఁ
బితృదేవతల కిచ్చుఁ గుతపదౌహిత్రతి,లలు నితాంతపవిత్రములు పితృక్రి

తే. యలకు శౌచ మక్రోధ మవ్యగ్రభావ, మర్హములు శుక్లపక్ష పూర్వాహ్ణయుగ్మ
దివసజన్మదినములు నిందితము లాజ్య,ముద్గపాయసాపూపముల్ ముఖ్యకోటి.

క. శ్రోత్రియు లరోగు లవికల,గాత్రులు పాత్రములు పైతృకములకు సచ్చా
రిత్రత్వము ముఖ్యంబు స,గోత్రు మృతకశత్రునన్యకులుఁ గొన రతివా. 203

ఆ. గంధపుష్పమాల్యకాధూపదీపవ,స్త్రముల నర్చ లిచ్చి తగఁగ భోజ
నములు నిర్వహించి క్రమవృత్తిఁ బిండప్ర,దానవిధి యొనర్చు టేను మెత్తు.

వ. అని యెఱింగించిన మేనకాత్మజ మృడునితో ని ట్లనియె. 205

క. మృతిఁ బొంది పునర్జన్మము, నతిర్యగ్గుణ జంతుకోటి యప్పుడ పొందుం
బితృపూజన మని యెవ్వరి, కితవుగఁ జేయుదురు దీని నెఱిఁగింపు శివా. 206

ఆ. అనుడు నచట నున్నమునిజను లెల్లను, నగతనూజ నాత్మఁ బొగడి యభవుఁ

1. అ, బారసి నవమియుఁ బరఁగఁ దుష్టి_చ. దెరశిన నవమాద్యతిథులఁ దుష్టి.

జరయు నెఱుఁగక నలిఁ జరింత్రురు దివంబు,నందు సంతతస్వర్గసౌఖ్యానంద మొంద

వ. అనిన విని హైమవతి సుగతిదుర్గతులకుం జనువారలం జూచి వీ రిట్టివా రని
నిశ్చయింప వచ్చుట దాని నెఱింగింపు మనవుడు మృడుండు విను మని
యిట్లనియె. 218

చ. జనులకుఁ గీడు సేయక యజస్రము ధర్మరతిం జరించి స
జ్జనగురుపూజనంబులును । సత్యహితోక్తులు దీనపోషణం
బును నతిథిప్రియత్వమును । భూరిదయార్ద్రతయుం గలట్టివా
రనిమిషలోకగాము లని । యాత్మ నెఱుంగుము మేనకాత్మజా 21

చ. పరుసనిపల్కు బొంకు లగుసపల్కులు నన్యధనాభిలాషముం
బరవనితావిలోకనము । బాంధవసజ్జనవిప్రియంబు దు
శ్చరితులతోడిమైత్రియును । సంతతధర్మరతాభ్యసూయయుం
గరినిభయాన ఘోరనరకంబున కేఁగెడువారిచిహ్నముల్. 220

క. అని చెప్పిన విని హిమగిరి,తనయ వృషధ్వజునితోడ । ధర్మంబులు పె
క్కనుపమమూర్తి పరమం, బనఁ జాలెడుధర్మ మెద్ది । యన్నిటిలోనన్. 221

వ. చెప్పు మనిన నప్పరమేశ్వరుం డి ట్లనియె. 222

క. రమణీ వర్గత్రయధ,ర్మము లిచ్చు సుఖములు దుఃఖమయము లచిరముల్
గమనాగమకరములు ని,త్యమహాసౌఖ్యంబు మోక్షధర్మం బిచ్చున్. 223

సీ. కావున విను త్రివర్గంబుకంటెను మేలు,దలపోయ మోక్షంబు । దానిఁ బడయు
తెఱఁ గెఱింగించెదఁ । దెలిన గృహస్థధ,ర్మంబున నిల్చి ఋణంబు లెల్ల
బాచి వనమునకుఁ । బరమశాంతత నేఁగి, సద్గురుముఖమున । సాంఖ్యయోగ
విదుఁ డగునది పంచవింశతి జ్ఞానంబు, సాంఖ్యంబు ధర్మనిశ్చలత యోగ

తే. మానసమాచారయుక్తి మేరకాధికరణ, మస్ఖలితముగ మది నది । యలవరించి
ధ్యానపరుఁ డయి శీతోష్ణహర్షశోక,ముఖము లగువివిధద్వంద్వములఁ దొఱంగి.

ఉ. శౌచము బ్రహ్మచర్యమును । శాంతియు లఘ్వశనంబు నై యుదం
జూచుచు నంతరాత్మనెడ । సొచ్చినవిఘ్నవిశేషముల్ ధృతిం
ద్రోచుచు భక్తియుక్తిఁ గుశరుండు ప్రమోదమయుండు గాఁగఁ ద
ద్గోచరతం జరింపఁగ నకుంఠితమోక్షసుఖంబు సొప్పడున్. 225

తే. అది సదాభ్యాసకలన నత్యంతనిర్మ,లంబు నవ్యయమును నచలంబు ఘనము
నై జరావ్యాధిమరణజన్మాదిదుఃఖ,బహుళసంసారచక్రంబుఁ బాప నేర్చు. 226

వ. అని యుపదేశించి వెండియు. 227

క. విను సంసారమునకు విసు,వనిమర్త్యుఁడు శోకమోహావశగతుఁ డై మో
క్షనిరూఢిఁ బడయ నేరఁడు, మనము విరక్తముగ విసివిరమతియుక్తిగనున్. 228

వ. అట్టిదశ చింతావివర్జనంబునను భూతాస్థిరత్వపరిజ్ఞానంబునను దృష్ణారాహిత్యం

విను వివరించెద సంసృతి, యనురోగంబునకు వైద్య మది యరయంగన్. 243

శివుఁడు పార్వతికి సాంఖ్యప్రకారంబు దెలుపుట.

ఆ. జ్ఞానమున విముక్తి సాంఖ్యులు వడయుదు, రరసి చూడఁగా నిరర్థకంబు
ఘోరతరము సంసృతి శారీర క్లైనత,పంబుఁ బంచవింశభజన మూఁది. 244

సీ. ప్రకృతి యవ్యక్తనామకము గల దందు, మహదహంకారతన్మాత్రలును మ
నమునింద్రియములు భూతములు జన్యములుగా,నోలిన యిరువదినాలుగయ్యెఁ
బంచవింశకతత్త్వభావితక్షేత్ర మూ,తత్త్వసంతానంబు సత్త్వమును ర
జస్సుఁ దమస్సు నాఁజనునిజగుణములఁ,బ్రకృతి దాఁ గరణరూపములు గాఁగఁ

ఆ. గొని సృజించు లోకకోటి నయ్యవ్యక్త, మణువు నిత్య మేక మక్రియం బ
హేతుకంబు చక్షురాదుల కగ్రాహ్య, మది ప్రధాన మనఁగ నతిశయిల్లు. ?45

తే. సౌఖ్యతుష్టిప్రకాశముల్ సాత్త్వికములు
మోదభేదాదికద్వంద్వములు లతాంగి
రాజసము లప్రకాశసంజ్ఞానమోహ
ములును దంద్రయుఁ దామసములుగ నెఱుఁగు. 246

క. ధృతివిజ్ఞానశ్రద్ధలు, నతివ యసమ్మోహమును దయయు హర్షము సం
చితసత్త్వవృద్ధిఁ బరివర్ధితఁబు లగు సత్త్వ మరుగఁ దెరలుం దారున్. 247

తే. క్రోధలోభకామానృతద్రోహచింత, తాపములకు రజోభివర్ధనము వృద్ధిఁ
జేయు వానికి నెల్ల సంక్షీణభావ, మావహిల్లు రజఃక్షయ మావహిల్ల. 248

తే. సంశయంబు విషాదంబు జడత నిద్ర, విను తమస్సు వర్ధింపఁగాఁ బెనువు నొందు
నది విహీనతఁ బొందిన నవియు హీన, భావ మొందు వికస్వరపద్మనయన. 249

సీ. ఒక్కఁ డొక్కనిచే నెక్కుచుఁ దక్కుచుఁ, ద్రిగుణంబులును బ్రవర్తించు వీన
జనితంబు లగు ప్రీతిసంతాపమోహాదు, లాదవినఁ దత్తద్గుణోదయములఁ
గని యుపేక్షించుచు మనము నూనఁగనిమి; కార్యంబు ధర్మార్థకామములకు
నమరమనుష్యతిర్యగ్జననములకు, మూలముల్ సత్త్వాదు లోలి నెఱుఁగు

తే. బుద్ధి యనఁగ మహత్తత్త్వమునకు నామ
మది వివేకవిజ్ఞానచిహ్నంబు భూత
జని యహంకారమునకు లక్షణ మహంక
రణము దొలఁగుట మోక్షకారణము దేవి. 250

ఆ. అన్నియింద్రియములనడరింప మగుడఁ జే,యంగ మనసు సాలు నవియు నదియు
భూతతద్వికారములును దేహము తద,న్యుండు దానఁ బరగియుండు దేహి. 251

క. విను దేహియు దేహము వే, అనునిశ్చయదృష్టి గల్గునాతఁడు సాలఁగ
మనసు మగిడింప నది నిర్మనస్కతఁ బొనర్చి మోక్షమార్గముఁ జూపున్. 252

వ. అప్పుడు ప్రకృతిందొలంగి పంచవింశకుండు వెలుంగు నాతత్త్వంబు పరమహంసుం

దనం బరఁగుఁ దద్విజ్ఞానంబు శాంతిసాధ్యంబును బరమశాంతిప్రదంబు నైయుండు.

మ. రసగంధాదిగుణాలి లేమి నవికా[illegible] సర్వా[illegible]ం
[illegible]ప్తి సమత్వాద్యంగిని మహాత్త్వవ్యాప్తిఁ జెలఁగు ప్రభ్వ
[illegible]. దేజరిల్లు పరమాత్మాఖ్యంబు మద్యోతకం
బు నమర్త్యంబునఁ జూచు శాంతుఁ డగువాఁ డొందుం గా విమోక్షస్థితిన్. 254

వ. ఇది కపిలాదిపరమర్షి సేవితంబైన సాంఖ్యధర్మంబు యోగప్రకారంబు వివరించెద.

సీ. విను మింద్రియ[illegible] బుద్ధియు, నాత్మయు నొక్కటి యగుటఁ గాన్పు
యోగపరిజ్ఞాన మగ్గలి యగ్నిహో, త్రారాధనంబును నధికవాగ్వి
వర్జనంబును సత్త్వవర్తనంబు దానాధ్య, యనములు శౌచ[illegible]శ్యములుఁ బాప
ములుఁ బాపఁ బాపవిసర్జనకుఁ [illegible], మాచరింపఁగ యోగ్యుఁ డగు నరుండు

తే. మనసు వట్టుట [illegible] దాని
కామినము గాలగాని దక్కట్ల మచియు
వచనమును నగుచోట మృద్వాసనమునఁ
గాయమున కార్జవము భంగిఁ గలుగ నుండి. 256

క. మనమున నైదింద్రియములు, మనిచి మనం బాత్మ నల్ల నొడిఁగింపఁగ నె
ట్లైనఁ బ్రాణంబు నపానంబును వశ్యత నిలుచు యోగమున సిద్ధికినై. 257

తే. అవహితుం డయి తద్దశ ననుభవింపఁ, గా నపానము శ్రీ ప్రాణగతికి మూర్ధ
మతిన యమ్మెయి నెలవగు నవ్వెఁ డమావె, జీవుఁ డనఁ బరమాత్ముండు దానె వెలుంగు.

వ. అని వెండియు. 259

ఉ. ప్రాణు నపానునందును నపానునిఁ బ్రాణునియందు నిల్పి ని
[illegible] గోరి చిత్తము [illegible] బట్టఁగఁ బ్రాణసంయమా
క్షీణత దేహమధ్యగతిఁ జిమ్మఁగఁ దత్త్రియ మొంది మూర్ధపా
రీణతఁ గోర్కి సల్పు నపవర్గము త్యాగితుఁ డైన యోగికిన్. 260

వ. అని చెప్పి వెండియు. 261

చ. అలసతయుం విచిత్రతయు నసత్యతనాదరణంబు రోగముం
గలయును లోభమున్ భయముఁ గామముఁ గ్రోధము లౌల్యమున్ విరో
ధులు విను యోగసేవకు నదుష్టతఁ జెప్పిన యోగ మిచ్చ సి
ద్ధులు లేని మిందింట నప్రతిహతుం డయి యోగి చరించు నెల్లెడన్. 262

ఆ. నిత్యమొప్పు నిద్ర నిగ్రహించుటయును, గాలిఁ ది మీఱకుండు పుణ్యగుణవమియును
యోగి కొప్పు వలెఁ దుద యుక్తవర్తనుఁడైన సుఖద దుఃఖహారియోగ మొందు.

వ. ఇట్టివి యోగధర్మంబు వినిన నంబికా సాంఖ్యయోగశ్రవణంబునఁ బరిజ్ఞాతపర
మార్థ నైతి భవదీయసాయుజ్యంబు భక్తిశక్తి పరిచర్యం బదయము రెడింగింపవే
యని యడిగిన మృడుండు మృడాని కిట్లనియె. 264

శివుఁడు పార్వతికి సాత్మసాయుజ్యప్రాప్తిసాధనంబులు దెలుపుట.

క. విను మవిచింత్యుఁడ సురలకు, మునులకు నేనియును యోగమునఁ సాంఖ్యమునా
యొనరించినయవి యెఱుఁగఁడ, సనాతనుఁడ నవ్యయుండ ననత్యాత్ముండన్. 265
క. ఏను బ్రసన్నుఁడ నైనం, గానిది లేదర్చకులకుఁ గావున మత్ప్రీ
ధ్యానస్తుతివందనముఖ,నానాభజనముల వలయు నైష్ఠికత శివా. 266
ఆ. నాలుగాశ్రమముల నలువురు విప్రుల, కలిత పాశుపతమహావ్రతంబు
తెలుఁగు లేను దొల్లి దెలిపితి శిష్యప్ర,శిష్యసరణి నది ప్రసిద్ధ మయ్యె. 267
క. మంగళరత్నాంచితా,లింగార్చనయోగ్యతలు ఫలించుటకై భూ
తిం గావించితిఁ దల్లి,స్త్రాంగులును గపాలధరులు నై శాంతిమెయిన్. 268
తే. బ్రహ్మచర్యభిక్షాశనపరత గలిగి, జటిలయొండె ముండితయొండె సంభరించి
మనసు నాయంద తిరముగా నునిచి యొండు,వస్తువులదెస నొల్లమిపవర్తిలంగ.
క. చరియించుభక్తజనులకుఁ, బరమానందైకతానుభవ మొనఁగుదు న
వ్వైరవున మత్సాయుజ్యము, దొరకొను వారలకు వికచపతోయజవదనా. 270
వ. ఇది సాయుజ్యావాప్తిప్రకారం బని చెప్పి వెండియు. 271
క. శివలింగస్థాపనముఁ ద్రి,భువనములం బరమహితముపొంటెం గరుణన్
ధవళాక్షి చేసితిం ద,త్ప్రవిమలలింగమున నన్ను భావించు టయున్. 272
చ. కలమెయిఁ బాల నేతి నుదకంబుల నేని వరాభిషేకమం
గళము నొనర్చి భక్తిరతి గంధము మాల్యము ధూపదీపసం
కలనములున్ నివేద్యమును గాఢసమర్పణ మొందఁ జేసి లిం
గలసితమూర్తియందు ననుఁ గాంచి భజించిన ముక్తి సేకుఱున్. 273
క. అని పలికి నీవు దేవాం,గన లాదిగఁ గలత్రిలోకకాంతలకును మ్రొ
క్కనకుం బాత్రం బగుపద,వనజంబులు గల్గి యొప్పువరసతివి శివా. 274
క. చతురవు వివేకవిభవో,న్నతచిత్తవు వ్రతవిధానపనైష్ఠికతానం
యుతమతివి లౌకికజ్ఞా,నితామహిమసహజమతి వనిందిత వరయన్. 275
క. కావునఁ గాంతాధర్మము, నీవలనం దెలియ వేడ్క నెమ్మనమున నా
కావిర్భవించెఁ జెప్పం,గా వలయును దాని వికచకమలదళాక్షీ. 276
ఆ. అనిన సిగ్గుతోడనయలఁతిన వ్రాలసిన, చెన్ను మొగము వింత చెలువు దాల్ప
వాంచి యొత్తి గౌరి వరునితో నిట్లను, నేను మీకుఁ దెల్ప నెంతదాన. 277
క. ఐనను మీ రడిగిన మ,న్మానసబోధంబుకొలఁది మగువల తెఱఁగుల్
పూని వినిపింప కుంటుట, దావ తగదు గాన చెప్పెదను సర్వజ్ఞా. 278
క. అని పలికి మఱియు నిట్లను, నను నెవ్వఁడు బాయ కుండు నదు లెల్లను న
వ్వనితలతోడ సమాలో,చన యొనరించి మఱి చెప్పఁ జను నిత్తెఱఁగున్. 279
వ. అని విన్నవించి గంగ యమున గోదావరి కౌశికి కావేరి కృష్ణవేణి పెన్న (నర్మద

బాహుద దేవ తము) మొదలైననదులు మున్న తనతోడన వచ్చియున్న నన్నా
తొలఁగఁజేసి యీశానుం డిట్లనియె నెట్లు సెప్పుద మనిన గంగాదేవి నీ కంటెనే
పెంపుఁగుదురు నీ వాకొంగిన తెఱంగున నంగనాధర్మం బెఱింగించి పవిత్రితునిం
జేయు మేము భవదీయవాగమృతంబు వీనుల నినిచెద మనుటయుఁ బార్వతి ప్ర
సన్నచిత్తయై వల్లభువదనంబునం జూడ్కి నిలిపి. 280

క. దేవా నీకు ప్రసాద, శ్రీ వచ్చినయట్టుల సుందరీవిధము భవ
ద్భావంబునకుఁ బ్రియంబుగ, సేవాధర్మంబుఁ దెలియఁ జెప్పెద ననియెన్. 281

తే. అనినవిని సురల్ మునులు ప్రియంబుఁబొంది, రమరగంధర్వసిద్ధసాధ్యాంగనాజ
నంబు వినువేడ్కవచ్చి యున్నలినవదన, వెనుకదెసనుండె దేవకీతనయ యవుడు.

వ. అని చెప్పి యప్పురుషోత్తముఁడు వీనులు వికసిల్లు చుండ నారదుం డిట్లనియె. 283

పార్వతి శివునకుఁ బతివ్రతాధర్మంబుల తెఱఁ గెఱింగించుట.

క. వనితలుఁ బురుషులుఁ బ్రియమున, దను వినుతింపంగ శైలతనయ సమాక
ర్ణనకౌతుకి యగునీశా, నునితో మృదురీతి నిట్లను గమలేశా. 284

సీ. ఋతుమతి గాక మున్నద్దతయుఁ గల్గినయింటి
కన్య తత్పరిణయకరణమునకు
నొడయులు పితృ తల్లియును దండ్రియును దండ్రి
తోఁబుట్టినతఁడు మాతులుఁడు నొడ
లుండును యోగ్యవరునిఁ జూచి వారిలో
నెవ్వరైనను బ్రీతి నిచ్చువారు
పతి యంతనుండియుఁ బ్రభువు దానికి నట్లు
గావున నాతండ దైవ మనుచు

తే. నతనిమతమునఁ దేవతాపితృసమర్చ, నములు నతిథిపూజనముఁ బూన్కి సమాచ
రించుచును బతిహితము వాటించి నడపు, నతి పతివ్రత యిహపరసౌఖ్యమహిత.

వ. పతిద్వేషయుం బయినయొక్కనిదర్శనం బవధరింపుము. 286

సీ. బ్రాహ్మణుఁ డొకనికి భార్య లిద్దఱు గల, రం దొకభామిని యతనిహితము
నడపెడునవధాన మెడలి యాతఁడు పంప, కయ్యుఁ దాన సురపితృకార్యపరత
నడచుఁ దక్కటియింతి నాథుఁ బాటించుచుఁ, దన్మతంబునఁ జేయు ధర్మవిధులు
వారు ముప్పురు విధివశమున నొక్కట, మృతిఁ బొందిరా పతివ్రత వరుండు

తే. ననివసుగతికిఁ జనెఁ బెఱవనిత యముఁడు
నీకుఁ బోలేదు మరలుము నీశరీర
మునకె యని యాఁగె నది శోకమున నబ్బా
ప్పైనఁ గన్గొని యతఁడు దయార్ద్రుఁ డగుచు. 287

క. పతిమతము గానిధర్మము, నతివ నడపుటొప్ప దింక నైనను బతికిన్

హితము లగువానిఁ జేసిన, నతనిఁ గలయు దనివఁ జనియె నదియును మరలన్.

వ. కావునం బతికి ననువ్రత యగుట గృహిణికి ధర్మం బని పలికి వెండియు. 289

క. లలన యిలు వాఁకి నాథుఁడు, వలచినచవివంటకములు వండి యిడి తనుం
గలయఁ దలంచిన మెయికొని, యెలమిఁ గైసేసి హృదయ మీ వలయు శివా.

తే. వనులయెడ మాఱు వలుకక యనవధానఁ, గైనపతిఁదలఁపించి ధర్మార్థకలిత
కృతులు నడపుచు సవతి గర్వించను బోక, తంబు లేకొక్కఁడైయున్కి నగవుపతికి.

క. సవతాలికిఁ బతి వలచిన, నవ్వుఁ గా కని యతనియిచ్చకనురూపముగాఁ
దివిరి నడచుసతి దైవము, శివ యది దగు నెల్లజనముచే మ్రొక్కఁ గొనన్.

క. తనచేతికి నిచ్చినవ, స్తునికాయము నిల్లురువునచొప్పున మగుడం
గొన వచ్చు భార్య పతి దె, మ్మనినప్పుడ యిచ్చుటొప్పు నకపటవృత్తిన్. 293

క. పతి దనకు నేమి యిచ్చిన, నతిముదమునఁ బొంద వలయు నాత్మజుఁ డైనన్
మతిఁ గొంకక యేకాంత, స్థితి నేకాసనత నున్కి సెట్టు ప్రమదకున్. 294

క. ధని యధనుఁడు రూపసి యొ, ప్పనివాఁడు వివేకి మూఢభావుఁ డరోగుం
డనుగతరోగుఁ డనక యం, గన పతిఁ బాటింప వలయుఁ గామధ్వంసీ. 295

క. బలి భిక్షము గడప కెడ, వ్వలయును దేవపితృపూజనంబులకాలం
బులఁ బతి శుభ మందుటఁ ద, త్ఫలంబుగాఁ గోరు టొప్పిదము సతికి శివా.

క. గతి బతియచువ్వొ భార్యకు, నతనిఁ గడచినట్టిసత్పరాయణము కృపా
యుత కలదే కావునఁ దా, నతనికి భక్త యగు టిచ్చునఖిలశుభంబుల్. 297

వ. అని చెప్పి యప్పరమేశ్వరునకుం బార్వతి భార్యలయధర్మంబుల వివరించు
నది యై యిట్లనియె. 298

పార్వతి శివునకుఁ బతివ్రత కనర్హంబు లగుధర్మంబులఁ దెలుపుట

సీ. పరమేశ యాసురి పైశాచి రాక్షసి
యనుపేళ్లు గల వధర్మాంగనలకు
వ్యభిచారతత్పరత్వంబు వారికి నెల్లఁ
గల దసురాంశజ క్రౌర్యనిరత
దనయిచ్చఁ బాలియించు ధనధాన్యములు చల
హృదయ భోగపరాత్మ యీర్ష్యగలదు
పైశాచి క్రోధన భర్తృపుత్రులయందు
నిఃస్నేహ గృహకార్యనిపుణ గాదు

తే. కలహశీల రాక్షసి సుఖకంబు లేదు, బొంకు వల్కు నెప్పుడు నిద్రవోవు వీత
లజ్జ యిందఱు నాథులకులంబువారి, దురిత మొందించి పోదురు నరకమునకు. 299

ఆ. ఎఱుక గలిగి పిదపనేనియుఁ బతిభక్తి, గలిగి ధర్మమోపి చలిపి శాంతి
గలిగి యున్న మున్నుగలపాపములు వాసి, పురుషుతోడ దివికిఁ బోవఁగండ్రు.

ఆ. అట్లు గాన పతులయం దతిహితమయంబు, సందుఁ జింత దక్క యనుమరణము
సేసిపోని సుగతి సిద్ధించు బలిపమే. తంబు గాఁగ నిశ్చితంబిసులకు. 301
క. ద్విజభామినికి సహగమను, ప్రజఁ గాంచినపిదప నయ్యసత్యము శోకో
ద్విజితయు బలిథకతయు నై, త్యజించి యనుమరణనియతిఁ దగుట మహేశా.
క. అని చెప్పి గౌరి పతికి, ట్లను నా దగువానిలమున సకలేశ్వర నిన్
వినిపించితి నేఁ గొన్నిట, జనముల నీతిప్తి నాకు నెంపును కరుణన్. 303
క. అని సిగ్గునఁ జెన్నగునా, నన మించుక వాంచి యొత్తు నగతనయ శివుం
డును మునులును మునిపత్నులు, వినుతించిరి మధురవాక్యవిభవం బెసఁగన్.
క. సురగంధర్వఖచరకి, న్నరకింపురుషోరగాదినారీజనముల్
పరమప్రీతిని బొగడిరి, పరమేశ్వరి నెలుఁగు లడరఁ బంకజనాభా. 305
క. అని చెప్పి నారదుం డి, ట్లను గోవిందునితోడ నప్పుడు ప్రియ మా
ననమునఁ బొడలఁగ బార్వతిఁ, గనుఁగొని పర్వేశ్వరుండు గౌరవ మొప్పన్.
క. నాసంవాదము శుచి, నైమైష్ఠికజనుల కెవ్వఁ డాదర మెసఁగం
గా నలినాక్షీ చెప్పును, వానికి నిత్యామరత్వవైభవ మొదవున్. 307
క. మనసంవాదం బెవ్వరు, వినిరి నియతి సజ్జనులకు విభవముఁ దేజం
బును గీర్తియు నాయువు శ్రీ,యును నారోగ్యంబుఁ గల్గు నుత్పలనయనా. 308
క. అని నిర్దేశించి శివుండు, సనియె శివయుఁ గొలువుతోన చనె నిర్దేశకుం
జని రన వశమే యద్భుత, మనిరూప్యం బప్రతర్క్య మది శ్రీరమణా. 309
క. అని పలికి నారదుండును నా, విని నకవినయద్భుతంబు వినిపించితి నీ
కనియెం గృష్ణుని సభ్యుల,మనంబు లానందపూరమగ్నము లయ్యెన్. 310
వ. అని యిట్లు భీష్ముం డుమామహేశ్వరసంవాదం బను పుణ్యకథ సెప్పిన ధర్మ
తనయుండు సోదరసహితంబుగాఁ బ్రమోదరసభరితుం డై. 311

భీష్ముఁడు ధర్మజునకుఁ బరప్రాప్తిహేతుభూతం బగుజపవిశేషంబు దెలుపుట.

సీ. అతనికిఁ బ్రణమిల్లి యనఘ పరప్రాప్తి, యెద్దాన సమకూరు నెఱుఁగఁ జెప్పు
మనిన నతండు నారాయణధ్యానవృ, జాస్తుతితత్కథాశ్రవణనిరతి
యమ్మెలు గావించు నధిప విద్వజ్జన, సంరక్షణము కల్మషములఁ బాపు
వేయొక్కటఁ దొల్లి విద్వాంసు నొకరుని, మునిచ్చని తలవరుల్ వొడఁ జూచి
తే. యితఁడు మావాఁడు మీరిది యేటి కాగ, డంబు సేసెద రని మోక్షణంబు సేసి
యాసుకృతమున బ్రాహ్మణుఁ డైజనించెఁ, దగఁగ వర్చింపు మీవు విప్రద్విజ్జనముల.
వ. అనిన విని యుధిష్ఠిరుండు వారి ద్రవ్యవ్యాధిశోకంబులకు శాంతి సంపాదింపం
జాలుజపం బెయ్యది సెప్పవే యనుటయు ననిమిషనదీనందనుండు బ్రహ్మవిష్ణు
మహేశ్వరులను వినాయకవిశాఖవహ్నివాయుచంద్రాదిత్యులను శక్రవరుణ
యమకుబేరులను సురభిని సముద్రంబులను గంగాదిమహానదులను మరుదశ్వి

వసురుద్రాదిదేవతలను బితృదేవతలను వాలఖిల్యాదిసిద్ధులను వేదవ్యాసవాల్మీకి నారదాగస్త్యగౌతమకశ్యపాత్రికణ్వాదిమహామునులను రంభాద్యప్సరఃస్త్రీలను ధర్మతపస్సత్యములను నహోరాత్రంబులను దారాగ్రహంబులను నశ్విన్యాది తారకంబులను మాససంవత్సరంబులను వైనతేయకాద్రవేయులను గాశీక్షేత్ర కురుక్షేత్రాదిపుణ్యక్షేత్రంబులను నైమిశారణ్య దండకారణ్యాదిపుణ్యారణ్యంబులను మేరుహిమవత్కైలాసాది ప్రఖ్యాతశైలంబులను దిగ్గజభోగిభూములను బుణ్యభూరుహంబులను భూసురులను జక్రవర్తులను రాజులను బరమభక్తిం దలంచి కీర్తించి నమస్కరించి యీసమూహం బంతయు నన్ను రక్షించి నాకు నాయురారోగ్యైశ్వర్యాభివృద్ధిపరమానందంబు లభినందనపూర్వకంబుగా నిచ్చుఁగావుత మని యిచ్చఁ గోరి నమో నమో భగవతే వాసుదేవాయ నమః పురుషోత్తమాయ నమ స్సర్వలోకగురవే నమ స్సర్వలోకపిత్రే నమ స్సర్వలోకపితామహాయ నమ స్సర్వలోక ప్రపితామహాయ నమ స్సర్వలోక ప్రధానాయ నమ స్సర్వలోకేశ్వరాయ నమ స్సర్వలోకవిశిష్టాయ నమ స్సర్వలోకసుఖ ప్రదాయ నమ స్సర్వలోకకర్త్రే నమ స్సర్వలోకభర్త్రే నమ స్సర్వలోకహర్త్రే నమ స్సర్వలోకనిధయే నమ స్సర్వలోకనిధానాయ నమ స్సర్వలోకహితాయ నమ స్సర్వలోకహితకరాయ నమ స్సర్వలోకోద్భవాయ నమ స్సర్వలోకోద్భవకరాయ నమో విష్ణవే ప్రభవిష్ణవే యని పఠించుట మహాజపంబు. 313

క. పాపంబులును భయంబులు, నాపదలుం బాయు నిమ్మహాజపమున ధా
త్రీపాలోత్తమ శుభములు, ప్రాపించును ధర్మతత్పరత సిద్ధించున్. 314

వ. అని యిట్లు గంగాపుత్త్రుం డజాతశత్రునకు సర్వసిద్ధికరం బయినయిమ్మహాజపం బుపదేశించె నని చెప్పి తదనంతరసత్కథ లాకర్ణింపు మని పలికి జనమేజయునకు వైశంపాయనుం డిట్లనియె. 315

తే. మనుజనాథ యశేషధర్మములు సర్వ
పావనములు శాంతనవుఁడు బహువిధములఁ
జెప్ప నిమ్మెయి విని యుధిష్ఠిరుఁడు భక్తి
నమ్మహాత్మని నిట్లని యడిగె మఱియు. 316

చ. అతఁ డొకరుండు లోకముల కన్నిటికిన్ మహనీయమైనదై
వతముఁ బరాయణంబు ననువైభవ మెవ్వని కొప్పు నర్చన
స్తుతిరతి నెవ్వనిం గొలిచి శోభన మొందు జనంబు మేలు నా
నతిశయ మొంది నీకు మత మైచను నెయ్యది ధర్మకోటిలోన్. 317

తే. జపములం దెల్ల నుత్తమజపము నాఁగ, నంచితం బయి తన్ను జపించుజంతు
వునకు జన్మసంసారబాధనము లోపి, పాపు నెయ్యది యొఱఁగింపు పరమబోధ.

వ. అని యడిగిన నాభూపతికి భీష్ముం డిట్లనియె. 319

భీష్ముఁడు ధర్మజునకు విష్ణుసహస్రనామస్తోత్రాఖ్యానం బవశ్యానుష్ఠేయం బని చెప్పుట.

సీ. అఖిలజగత్ప్రభు నగుదేవదేవు ననంతుని పురుషోత్తమాభిధాను
నంచితనామసహస్రకంబున సంస్తుతించుచు సంగతోత్థితమనస్కుఁ
డై యజమానుఁ డవ్యయుఁ డైనయాతని, నర్చించుచును దృఢధ్యాననిరతుఁ
డగుచు నమస్కృతి నాచరించుచు ననాద్యంతు విష్ణు నధ్యక్షు నెల్ల
తే. లోకములకు బ్రహ్మణ్యుఁ ద్రిలోకకీర్తి,వర్ధనుని సర్వధర్మజ్ఞు వరదు లోక
నాథు భూతభవోద్భవు నమ్మి భక్తిఁ, గొలిచి సర్వదుఃఖంబులఁ దొలఁగఁద్రోచు.
తే. ప్రస్తుతులఁ బుండరీకాక్షుఁ బరమభక్తిఁ, దలఁచి యర్చించుటయు నామశతంబు సర్వ
ధర్మములకును సమధికతమము నైన, ధర్మ మింత యెఱుంగుము ధర్మతనయ.
సీ. పరమతేజంబును బరమపదంబును, బరమైన బ్రహ్మంబుఁ బరపరాయ
ణముఁ బవిత్రంబులు నాఁ దగువానికి, నెల్లఁ బవిత్రంబు నెల్లమంగ
ళంబులకును మంగళంబును నెల్లదేవతలకుఁ బరమదైవతము భూత
సమితికి నవ్యయజనకుండు నగునట్టి,వాఁ డెవ్వఁ డెవ్వానివలనఁ దోఁచు
తే. నాదియుగమునాగమయుగసంక్షయవేళ, నడఁగు నెవ్వానియందుఁ జరాచరములు
విశ్వలోకప్రధానుఁ డవ్విష్ణు వేయు,భవ్యనామంబులును బాపభయహరములు.
తే. భూరిగుణయోగవిఖ్యాతములును ఋషిస
మాజపరిగీతములును నై మహిమఁ దనరు
నమ్మహాత్మునినామంబు లధికతరవి
భూతిఁ జెప్పెదను విను భూపవర్య. 323
వ. అని పలికి విశ్వంబు విష్ణుండు వషట్కారుండు భూతభవ్యభవత్ప్రభుం డనునవి మొద
లై రథాంగపాణి యక్షోభ్యుండు సర్వప్రహరణాయుధుం డనియెడునవి తుదగాఁ
గలసహస్రనామంబు లుపన్యసించి. 324
ఆ. కీర్తనీయుఁ డైనకేశవుదివ్యనా,మంబు లివి భవద్ధితంబు గోరి
తరతరంబ కీర్తితంబు లయ్యె నశేష,భంగి వేయుఁ గురునృపాలవర్య. 325

భీష్ముఁడు ధర్మజునకు విష్ణునామప్రభావంబు దెలుపుట.

సీ. విష్ణునామంబులు వేయును నిత్యంబు, వినినఁ బఠించినమనుజుఁ డిహము
నందుఁ బరమ్మున నశుభంబు నొందక, యత్యంతసుఖముల ననుభవించు
విప్రుండు వేదాంతవిదుఁ డగు రాజు విజయము నొందు వైశ్యుఁ డతులధనంబు
వడయు శూద్రుండు సుఖభాగిత వెలయు ధ,ర్మార్థకామప్రజార్థిజనులు
తే. గాంతు రయ్యైతెఱంగు లేకాంతభక్తి, శౌచి యై విని కీర్తించి సారయశము
నచలలక్ష్మియు వంశవిఖ్యాతియు మేలి, పెంపుసొంపునుగలిగి శోభిల్లునరుఁడు 326
సీ. పురుషోత్తమునినామములు వేయుఁ గీర్తించు, నాతఁ డొక్కఁడ శుభచయంబుఁ బొందఁ

డగణితవీర్యమునఁ దేజమునఁ గాంతిని బల,రూపగుణంబుల ÷ రూఢి నెక్కు
రోగబంధాపహాస్తులకుఁ బరనమాత్ర, నస్వాయుఃకారితము ÷ లడఁగు వాసు
దేవాశ్రయుఁడు వాసుదేవపరాయణుం,డును నగుమర్త్యుఁ డవ్విష్ణునామ

ఆ. కములు లుపన్యసించి ÷ కల్మషంబుల నెల్లఁ, దొలఁగి దుర్గతులకుఁ ÷ దొలఁగి జన్మ
మరణములకు రోగజరలకు నందని,పరమ మైన బ్రహ్మపదము నొందు. 327

క. స్మృతిసౌఖ్యక్షాంతిశ్రీ,ధృతికీర్తులు గలుగు దుర్మతియుఁ గ్రోధము లు
ద్ధతియును మాత్సర్యము లే, వతిపుణ్యాత విష్ణుభక్తు ÷ లైనజనులకున్. 328

సీ. చంద్రార్కనక్షత్రసహిత మైననభంబు
సచరాచరోర్వియు ÷ జలనిధులును
సురదైత్యగంధర్వగరుడయక్షోరగ
వ్రజములు హరివశవర్తనములు
బుద్ధియు నింద్రియములును మనంబు స
త్త్వంబును బలముఁ దేజంబు ధృతియు
క్షేత్రంబుఁ దద్గతక్షేత్రజవస్తువు
లరయఁగా వాసుదేవాత్మకంబు

తే. లాగమాదికాచారమయంబు ధర్మ
మచ్యుతుండు తత్ప్రభువు సాంఖ్యమును యోగ
తంత్రమును శిల్పవేదశాస్త్రములుఁ గర్మ
ములు జనార్దనువలన నుద్భవించె. 329

ఆ. విష్ణుఁ డొక్కరుండ ÷ విను మహాభూతంబు, లక్కభూతతతులు ÷ పెక్కు గలవు
నరిఁ ద్రిలోకములను ÷ బరఁగి విశ్వంబు భూ,తాత్ముఁ డమ్మహాత్ముఁ డనుభవించు.

ఆ. వ్యాససంప్రణీత ÷ మైనయీవిష్ణుస్త,వంబు సకలశోభనంబులును సు
ఖములుఁ గోరుపురుషుఁ ÷ డమలినబుద్ధిఁ బ,ఠింపవలయు భక్తిపెంపుతోడ. 331

క. అజు విశ్వాధీశ్వరు స,ర్వజగత్ప్రభవాప్యయప్రవర్తనకరు నం
బుజలోచను నెవ్వారలు, భజింతురు పరాభవమునఁ ÷ బడ రప్పుణ్యుల్. 332

క. కావున విష్ణునివేల్పుగ, [1]నీవేయుఁ బఠింపు నీకు ÷ నెప్పుడు నాయు
శ్శ్రీవిభవారోగ్యంబులు, భూవర సిద్ధించుఁ బరమబోధముఁ గలుగున్. 333

క. అని యిట్లుపదేశించిన, విని మోదము నెమ్మనమున ÷ వెల్లిగొనఁగఁ బాం
డునియగ్రసుతుఁడు గాంగే,యుని కభివందన మొనర్చి ÷ యుచితవినయుఁడై. 334

వ. పూజానమస్కారంబులకు నెవ్వరు భాజనంబు లెవ్వారికిఁ బెట్ట నేసినం బేటు
వాటిల్లు నెవ్వారలు సంతోషించిన శుభంబులు సొప్పడుం జెప్పవే యనిన
నతం డతని కిట్లనియె. 335

1. క. చ. జ. 'నీవేయుఁ బఠింపునీవు ÷ నిచ్చలు'.

బ్రాహ్మణపూజానమస్కారంబులు పరమోత్కృష్టంబు లని చెప్పుట.

సీ. పూజానమస్కారక్రియలకుఁ బాత్రములు బ్రా
హ్మణులు వారలకుఁ గీ డాచరించి
వానవుంగాను జెడు వారిసంతతియును
నఖిలశుభంబులు నావహిల్లు
ధర్మసేతువు లోకధారకం బఖిలశా
స్త్రప్రవర్తకము విప్రవ్రజంబు
తపమును వాక్కును ధనము విప్రుల కొక్క
కుడుపుమాత్రన పాపకోటిఁ బాయు
తే. రమ్మహాత్ములు సొప్పరు లఖిలమార్గములకు విను దేవతలు దేవతలకు బాలుఁ
డట్టిఁ డన లేదు పూజకు నర్హు లనిన, నధిప వృద్ధులఁ బ్రాజ్ఞుల నడుగ నేల.

వ. అనిన విని యజాతశత్రుండు బ్రాహ్మణులఁ బూజించుటవలన విశిష్టం బయిన శుభం బెయ్యది దృష్టం బయ్యె వారలయందు వర్ణనీయం బగు వర్తనం బేమి గానంబని యీ విట్లు వారలం గొనియాడ దెఱింగింపవే యనుటయు నాపగాపుత్త్రుండు పవనార్జునసంవాదం బనునితిహాసంబు విను మది భవత్ప్రశ్నంబునకు నదుత్తరం బై యుండు నని పల్కి యజ్జనపతి కిట్లనియె. 337

పవనకార్తవీర్యార్జునసంవాదంబు భీష్ముండు ధర్మజునకుం జెప్పుట.

సీ. అధిపసహస్రబాహార్జునుఁ డేనుదీవులు నేలి యద్భుతబలపరాక్ర
మములఁ దనర్చి మత్సమును లెవ్వరును నెందు, లే రని యత్యవలేపయుక్తి
నాడిన నొకభూత మాకాశమున నుండి, యెఱుఁగక పలికెద వెల్లవారి
కధికులు గారె ధరామరు లనవుడు, నతఁడు వారలు రాజు నాశ్రయించి
తే. నడపికొందురు మనుగడ పుడమి జేని,కంటె నెల్లక్కుడై రట్లుఁ గాక యేను
మనుతుఁగూర్చినఁ జెఱుతు నట్లగినసమస్త,భూతములవన్న వెఱచియా భూతమరిగె.

వ. అట్టియెడం బవనుండు గగనంబున నుండి త న్నెఱింగించికొని యన్నరపతితోడ.

సీ. భూదేవశక్తిని కాద రాజులు ప్రజారక్ష యొనర్చుట బ్రాహ్మణులకు
నధికులు గలరె యయ్యహల్యాకై యింద్రుండు, గౌతముఁ డలిగిన గాసిఁ బడఁడె
కుంభసంభవు చేత సంభోధి యడఁగదె, యనలుండు భృగుశాపహతుఁడు గాఁడె
యన విని మఱుమాట యాడక యున్న యర్జునునకుఁ బవనుఁ డిట్లనియె మఱియు
తే. నాంగిరసవంశసంభవుం డగు నుచథ్యుఁ
గోరి నిజపుత్త్రి సోముఁడు గారవమున
నిచ్చె నాదంపతులు దమ యిచ్చ వనము
నందు వసియించి మునిహృదయంబు లలర. 340

వ. వర్తించునెడ నొక్కనాఁ డమ్ముని యమునానదీస్నానంబునకుం జనుటయు మున్న

యశ్వనితం గామించి వేచి తిరుగువరుణుండు. 341

క. ఎత్తికొని పోయి తనపురి, నత్తామరసాక్షి నునిచె । నమ్మునికడకున్
మెత్తన చని నారదముని, యత్తెఱం గెఱిఁగింప నాతఁ । డాలి నెలోడన్. 342

తే. తాన దిక్పతి దన కిట్లు । దగునె యొరుల, భార్యఁ గొని పోవ నీ వేఁగి । పలుకు మిట్లు
యనినఁ జని నారదుండు సెప్పినను వినఁడు, తయ్యొ గామాంధుఁడై నత్రిస్థి విభుఁడు.

వ. విడువ కున్న నమ్ముని యుచథ్యుకడకు మగిడి వచ్చి. 344

సీ. ఇంతిఁ దా విడువనియంతియు కాదు నా, బెడతల వట్టి రోషించె వరుణుఁ
డని చెప్పుటయు నల్గి । యతఁడు సర్వజలంబుఁ, ద్రావిన వరుణాపురంబు ధూళి
మయ మైన భయ మంది యమ్మానినిఁ గొనివచ్చి, యొప్పించి ప్రణమిల్లి యెప్ప వాపి
కొని మునికృప గాంచి । చనియె నాదిక్పతి, ధరణీశ రాజులో । ధరణిసురులో

ఆ. యెక్కు డనిన వినియు । నక్కిల్లు వసి యున్న, యతనితోడ [illegible]కులసుర
సమితి కోడి వచ్చి । శరణు సొచ్చిన నగస్త్యుండు విజయలక్ష్మి నొసంగుటయును.

వ. గంగాతీరంబున నగ్రతువు లానరించు గీర్వాణులం బూర్వగీర్వాణులు గాసి చేసిన వసిష్ఠునికడకు వారలు వలియం బాఱుదేరం గోపించిన యుత్తాపసోత్తముని రోషానలజ్వాలలు [1]సాకారంబు లయి యాదైత్యలోకంబు నేర్చుటయుం జెప్పి యక్కుంభసంభవుండును వసిష్ఠుండును శ్రేష్ఠు లగుట రాజుల కోడఁ బాటు గాదో కదే యనినను బలుక కున్న యన్నరపతితోడం బవమానుండు మఱియు నిట్లనియె. 346

—•• పవమానుఁడు కార్తవీర్యార్జునునకు నత్రిప్రభృతులమహిమ సెప్పుట. ••—

సీ. ఒకతఱి దేవతలకు దైత్యులకు మహారణ మయ్యె నప్పోర । రాహునస్త్ర
సమితిచే నర్కచంద్రులు సొలసిన, వెలుఁగడంగుటఁ దమస్సు మొలసి వెగడు
పడిన యద్ద్విజుల । వడి నంటఁ దాఁకి య,య్యసురలు నొప్పింప । నత్రికడకుఁ
బాఱి మమ్ముం గావు । పరమదయాత్మక, యనుడు నతండు చంద్రార్కతనువు

ఆ. లతఁతములు నేసి । యసురసైన్యము రూపుమాపి నిజకటాక్షమాత్రమునన
యతని నృపులకంటె నధికుఁడందము హీనుఁడందమా నిజంబు సుధిప చెపుము.

సీ. అనిన నూరక యున్న నయ్యర్జునుతోడ సదాగతి యిట్లను । ధరణినాథ
సురపతి యాశ్వినుల్ । సోమపానంబున, కర్హులు గారన్న । నాశ్రయంబు
వాటించి వారికై । భార్గవచ్యవనుండు, దనమంత్రముల బల్మి । స[illegible]లకు
నెగ్గు సేయంగ నయ్యింద్రుండు వోటున, వ్రేటున నాతని । గీటడంచు

తే. బుద్ధి నొకశైలమును వజ్రమును రయమునఁ
గొని మహోగ్రతఁ గవియ నమ్మునివరుండు
జలము సల్లిన శైలవజ్రములుఁ దాను

1. క. గ. ట. సాయకాకారంబులై.

[1]మునుఁగఁబడి యబ్బలారాతి ✽ మూర్ఛవోయె. 348

వ. ఒక్కింతసేపునకుం దెలిసె నంతకు నమ్మునివరుండు మదుం డను వాని శతయోజన
దీర్ఘరసనాస్త్రదంతుని సృజించి పంచిన. 349

ఆ. వాఁడు సురగణంబు ✽ వానవ్రుఁ గబళింప, వారు శరణుశరణు ✽ వరముసీంద్ర
యనిన వారిఁ గాచె ✽ నమ్ముని వారిచ్చె, రవ్వడు సోమపాన ✽ మశ్వినులకు. 350

క. నీ వాచ్యవనుండును భా, ర్గవవరునరి గాఁడె యెట్లుఁ ✽ దెలుప కుడుగు దే
వావనియు నొక్కమాటయు; నావిభుఁ డాడండ దాని ✽ కలయక మఱియున్. 351

వ. వాయుదేవుం డస్సురదేవులనిశరణం జేసి యతనిచే టోర్వనివాఁ డై. 352

సీ. అకట దత్తాత్రేయు ✽ నకు భక్తి శుశ్రూష, సేసి కాదె యిష్ట ✽ శిష్టబలప
రాక్రమంబుల నొంది ✽ రాజుల క్కెల్లను, నెక్కుడై తాకృత ✽ మేల మఱవ
విను మిలా లోకంద వే ✽ యనిమిషాదిసమస్త, భూతంబులును వృద్ధిఁ ✽ బొందు టవని
దివిజులకృపన యీక్షే తెఱఁ గెల్లజనములు, నెఱిఁగినపని శాంతిఁ ✽ గొఱలి విప్ర

తే. కులము దైవస్వరూపం బగుట మనంబు, నందుదృఢముఁగ నిల్పి ✽ దాశ్రయమున
వెలయువాఁడవై సను మేలు ✽ వినుమునాదు, బుద్ధియనవుసుసరిఁడు ప్ర ✽ బోధములసి.

క. నీపనుపు సేసి బ్రతికెద, నేవు పవ్మాస్మృతియు విడిచి ✽ యెల్లవలన నే
లాపాదింపుచు విప్రుల, శ్రీపాదము లాశ్రయించి ✽ చెందెద శాంతిన్. 354

ఆ. అనిన నంతసిల్లి ✽ యనిలుఁ డాస్పవు బుద్ధి, గలిగి బ్రదుకు మనుచుఁ ✽ గారవించి
వీడుకొల్పి చనియె ✽ విప్రులపెంపిట్టి, దని యెఱుంగు కురుకులా ✽ గ్రగణ్య 355

— భీష్ముఁడు ధర్మజునకుఁ గృష్ణుప్రభావం బుపన్యసించుట. —

వ. అనుటయు నవ్విభుండు బ్రాహ్మణమహానుభావం బింకను విన వేఁడుం జెప్పవే యనుటయు నప్పుడమిఱేనికి భీష్ముండు దనకు నింద్రియంబులును వాఙ్మనసంబులును నపుడు దుర్బలంబు లగుట యెఱింగించి యినుండు దక్షిణాయనంబు తుది సేరుచు వచ్చె దేహాన్యాసంబు తడవు లేదు దోఁచుచున్నది కృష్ణుండు నీకు విప్రజనవిశేషంబు వివరించువాఁ డని పలికి యిట్లనియె. 356

తే. ఏను గృష్ణు నెఱుంగుదు ✽ మానవేంద్ర, యెత్తెఁ గ్రీడావరాహమై ✽ యుద్ధరిత్రి
నిది యొకండును జెప్పఁగా ✽ నేల కృష్ణు, లీలఁ గాదె భూమ్యాదిభూ ✽ తాలి గలిగె.

వ. కృష్ణుండు. 358

తే. బొద్దుతామరయం దొక్క ✽ పురుషుఁ డుద్భ, వించునట్లుగఁ [2]జేసితద్ద్విరచనాని
భమున నఖిలచరాచర ✽ ప్రభవ మయ్యె, నరయ సామాన్య మే కృష్ణు ✽ పరమలీల.

క. విను మెత్తఱి ధర్మంబులు, దనుజులచే బాధఁ బొందుఁ ✽ దత్సమయమునన్
జనియించి యద్దురాత్ములఁ, దునుమం గృష్ణుండు ధర్మ ✽ ధుర్యులఁ గాచున్. 360

క. తాలియునుం దాన దిశా, పాలురునుం దాన విశ్వ ✽ పతియును గురుభూ

1. క. మునిఁగిపడి. 2. జ. జే. సె. దద్విరచనావిభవము నఖిల.

పాలవర తాన కృష్ణుండు, కాలము దిక్కులును దాన కలఁ డఖిలములన్. 361

ఆ. అరయఁ గృష్ణుఁ డధ్వరాత్మకుఁ డఖిలాగ, [1]మోక్షమంత్రతంత్రముక్తి సరణిఁ
బ్రస్తుతించి మేలు వడయుదు రధ్వర,కర్తలైన జనులు కౌరవేంద్ర. 362

క. చయనంబుల ఋగ్వేదా, బయమహితసువర్ణనాముఁ డగుకృష్ణుగుణో
దయము వినుతించు యజ్ఞ,క్రియానిరతు లైనసురలు ప్రీతిం బొందన్. 363

క. విను ఋగ్వేదము కృష్ణుని, వినుతించుట యాదె యఖిలవేదంబులుఁ ద
జ్జనితవిలాసంబులు వే,దనిరూపితవస్తువు నసఁ దాన కుమారా. 364

తే. అగ్నులును యజమానుఁడు నాహుతులును
యాగఫలరూపమును గృష్ణుఁ డని యెఱుంగు
మినశశాంకతారకముల నెసఁగుతేజ
ములును గృష్ణమయంబుల భూపవర్య. 365

క. పరమజ్యోతి యనఁగ ని,ర్జరామరపదం బనంగ సత్యం బన భూ
వర యమృత మనఁగ దేవకి,వరసుతుఁడు వెలుంగు వేదవర్గముతుదలన్. 366

క. అని యిట్లుపదేశించిన, విని మోదము నొంది పాండవవిభునగ్రసుతుం
డనిమిషతటినీసుతునకు, వినతుం డై నెమ్మనమున వేడ్కదలిర్పన్. 367

—•• కృష్ణుఁడు ధర్మరాజునకు బ్రాహ్మణప్రభావంబు సెప్పుట ••—

వ. కృష్ణునకుఁ బ్రణమిల్లి దేవా భూదేవమాహాత్మ్యంబు విన వలతు నాన తీయవే
యని వినయసంభృతుం డగుచుఁ బ్రార్థించిన నప్పార్థివునిమీఁదఁ గరుణామృతమ
యం బగునాలోకనం బొలయ నద్దేవుం డాదరభరితుం డై యి ట్లనియె. 368

క. ననుఁ బ్రద్యుమ్నుం డివ్విధ,మున నడిగిన వాని కేను ముద మందుచు నా
తనిహితము గోరి కుంతీ,తనయాగ్రజ యున్నరూప తగ ని ట్లంటిన్. 369

సీ. వర్గత్రయము నపవర్గంబు సాధింప, నమరపితృప్రీతు లాచరింప
నైహికసుఖము లుపార్జింప వలసిన,వారికి విప్రుల చేరుగడలు
దివిజుల కైననాయువు శ్రీయుఁ గీర్తియుఁ, దనరుట తత్ప్రసాదమునఁ జూవె
యలిగి భస్మము సేయ వలచి పెంపొనఁగంగ, నవనీసురులు శక్తు లట్టు లగుట

తే. వారిఁ గోపింపఁ జేయక వారలకుఁ బ్రి
యంబు సేయుచు వారు ప్రహర్ష మొందఁ
దనకుఁ గలభంగి నిచ్చువర్తింతు రెందు
భువనములయందుఁ బెంపును బొగడుఁ బడయు. 370

—•• దుర్వాసుఁడు కృష్ణునిమనశ్శుద్ధి పరీక్షించి యనుగ్రహించిన ప్రకారము ••—

వ. నాకనినయాశ్చర్యంబు సెప్పెద నాకర్ణింపుము స్వతంత్రప్రవర్తనుం డగుదుర్వా
సుండు మనమందిరంబునకు వచ్చి మందహాసంబు సేయుచుఁ గోపించుచు సుము

1. క. చ. జ. మోక్షమంత్రతతులభక్తియుక్తి.

ఖుండగుచు విముఖత్వంబు నొందకుండం గుడుచు నొల్లనయ్యె: పెక్కండ్రకుంగావిం చినకూడుగూరడా గొక్కంటికి భుజియించి సెజ్జ నుండు మభూమి శయనిం చుచు నందేసిం బోవ్రుడు మఱలి వచ్చుచుఁ బ్రవసించు నుండి యొక్కనాఁడు కృష్ణా నాకుం బాయసంబు మేనిపైఁ బూసి పట్టులుఁ బెట్టింపవే యనఁ దత్తనంబ కావించినం గొంతి సిడిచి కొంతి దనయొడలం బూయుమని నిం బూసితి నచ్చేరువ నున్నరుక్మిణిం జూచి కొంత యుక్కాంతమేనం బూసి పూసి దర్భరూపంబుగా రథంబున నప్పొలఁతిం బూన్చి రథారోహణంబు సేసి వీథికి వెడలి యమ్ముద్ది యను ములుకోలం బొడుచుచు రథంబు నడపింప నాకుం గోపంబు నీర్ష్యయు నించుకయు జనియింప కుండ నేనుం జూచుచుం దోడన నడచితి నప్పుడు యాదవు లాశ్చర్యకోపభయాయత్తచిత్తులై యనేకప్రకారంబులందమలోఁ బలు కుచుం జేయునది లేక కలంకుల వచ్చుచుండ. 371

ఆ. రథము దిగిచి డస్సి ఇ రమణి మేదినిమీఁద, మ్రొగ్గతిలఁగఁ బడిన ఇ డిగ్గ నుఱికి దానిమీఁద ధూళి ఇ దాఁ జల్లి వెసఁ బాఱె, నమ్మునీశ్వరుండు ఇ యామ్యదిశకు.

క. పాఱిన నాతని వెనుకన, పాఱితి సంప్రార్థనా ప్రభాషణములతోఁ దేఱి మరలి యమ్ముని మిముఁ, గాఱియ వెట్టితిఁ గదే యకట యనుచు దయన్

వ. నన్నుం గనుంగొని నీవు కోపంబు జయించితివి నీకు వరం బిచ్చెదఁ గైకొనుము.

ఆ. ఎల్లవారుఁ దమకు ఇ నెంత గూర్తురు నీకు, నంత గూర్చి నిన్ను ఇ ననుసరించు వారుగాత లోకఇవంద్యుండవై యెందు, మాఱు లేక యతులఇమహిమమనుము.

వ. అని నిర్దేశించి మఱియు నిట్లనియె. 376

క. నాయంగంబుల నెల్లం, బాయస మతిభక్తిఁ బూసి ఇ పాదతలమునం బూయవు గావునఁ గలుగు న,పాయం బఱికాల నీకు ఇ నవిలంఘ్యాంబై. 377

క. విను పరమపదప్రాప్తికి, ననుగుణమై యుండుఁ గాన ఇ యదియును నశుభం బన రాదు నీవు బ్రాహ్మణ, జనములయెడ నడవు మిట్టిచందమ యెవుడున్. 378

వ. అని పలికి రథవహనపరిశ్రాంత యగుమీఁతల్లిం జూచి నీవు సౌందర్యసౌభాగ్యం బుల నప్రతిమాన వై మాననీయత్వంబునం గృష్ణునిషోడశసహస్రాంతఃపుర కాంతలకంటె నెక్కుడగు మని దీవన యిచ్చి యమ్ముని యంతర్హితుం డయ్యె.

ఆ. రుక్మిణియును నేను ఇ రుచిరసంపద నప్పు, డతిశయిల్లువస్త్రఇదంగకములఁ జూచికొనుచు మిగులఁఇజోద్యమందుచుఁ బ్రియు, మెుడఁద నెలకొనంగఇనింటికరిగి.

ఆ. అందు వస్తుచయము ఇ మునుపటికంటెను, బహుళమును మనోజ్ఞఇభంగికంబు నగుటఁ జూచి యద్భుతాయత్తచిత్తుల, మైతి మిట్టివార ఇ లవనిసురులు. 381

క. కావున వారికి భక్తుఁడ, వై వెలయు కుమార యనిన ఇ నతఁ డట్టిడ వై తా వెలసె నీవు నట్టిడ, వై వెలయుఁగ వలయుఁ గారఇవాన్వయముఖ్యా. 382

వ. అని చెప్పినం బ్రముదితహృదయుండగుచు సర్వధర్మనందనుండు మాధవుతో దుర్వాసునకు శర్వాణీసంభవుం డని విందు శర్వానిమహిమ వినవలతుం జెప్పవే యనిన నప్పురుషోత్తముండు భరితాదరుండై. 383

—•• కృష్ణుండు ధర్మజునకు శివునిమహిమ చెప్పుట ••—

ఆ. అనుగవలదు దాని నడిగితి నీవు న, న్నధిప నామనము ప్రియంబుఁ బొంద
శివునిఁ దలఁచి మ్రొక్కి శివదివ్యమహిమ చె, ప్పెదని శాంతవిమలహృదయకమల.

వ. ఏకాగ్రచిత్తుండవై యాకర్ణింపు మని ధర్మజున కిట్లనియె. 385

క. శతరుద్రీయము సేయఁగ, దతిభక్తిని శివుని మనమునందు నిలిపి యం
చితమునఁ బఠించు సులభం, బతనికి సర్వంబు నిందు నందు నరేంద్రా. 386

వ. అని వెండియు. 387

సీ. అమరు మహాదేవుఁ డనుపేరు శివునకు, నప్పరమునకు మీఁ దరయ లేదు
తల్లోకవద్భక్తుల ధర్మవిరుద్ధవృ, జాతుల నెల్లను సమయఁ జేయు
దేవతల్ మునులు నశేషప్రయత్నంబునఁ, గావింపు దక్షయాగమున శివుని
మఱచిన నయ్యజ్ఞ మఱవఱలై పోదె, భగనేత్రనాశ మాదిగ ననేక

తే. భంగములు రావె వారి కాప్రభువుచేత, శరణు వేఁడినఁ గావఁడే కరుణనట్టి
వారి నీశుపెంపే మన వచ్చు మఱియు, వినుము తద్దివ్యలీలలు మనుజనాథ.

సీ. ప్రబలదైత్యులు పురత్రయనాయకులు జగ, త్త్రయము నప్రతిమప్రతాపలీల
బాధింప దివిజులు ఫాలలోచనుఁ గాంచి, కావుము కృప దేవదేవ మమ్ముఁ
బసువుల మగువారిఁ బసుపతి వైననీ, వనుచు మహాక్రోశ మాచరింప
నప్పురంబులు మూఁటి నస్త్రమొక్కటన భ, స్మముగాఁగఁ జేసి యసమమార్గణంబు

తే. వంకమున నిడ నది బాలుఁ డైన నీతఁ
డెవ్వఁ డని నూవ వెఱఁగంది యెల్లసురలు
వినుతి సేయు బ్రాహ్మణమూర్తి వెలుఁగునతని
కిడియె [1]దుర్వాసుఁ డనునామ మీశ్వరుండు. 389

తే. అతఁడు నూవెమాఱుంటికి నరుగుదెంచి, యంత సేసినాఁ డనవుడు నచ్చెరువును
భక్తియును మదిఁ బిరిగొనఁ బాండునగ్ర, సుతుఁడు నిభృతిమై దేవకీసుతునితోడ.

క. శివముఖ్యనామములు ప్ర, స్తవనకృతిం భోగమోక్షదము లగు నని విం
దు విమలబోధ యెఱింగింపవె వాని నిరుక్తి ననినఁ బరమప్రీతిన్. 391

వ. అతం డిట్లనియె. 392

క. శివదేవు ముట్టఁ గొల్వఁగ, నవనీశ్వర యతనిపేళ్లయర్థ మెఱిఁగి సం
స్తవనకృతిఁ గూర్ప నాకై, న విధాతకు నైన నరిది నామదిఁ జూడన్. 393

వ. అయినను. 394

---

1. చ. దుర్వాసనామ మాయీశ్వరుండు.

క. నీ విట్లు సహస్ర నతిశ్రీ, నా కృష్ణ నా యెఱిఁగింపఁ ద్రిగ్గఁగఁ జెప్పిన
ద్దేవాదిదేవువరనా, మావలి విను మచలమైన యవధానముతోన్. 395
ఆ. అగ్నివాయువాసవాదిత్యవసుమరు, దాదిదేవతామయాత్ముఁ డైన
శివునిమహిమఁ బ్రీతిఁ జెప్పుట వినుట న, ర్వార్థసాధనంబు లగు నృపాల.

—కృష్ణుండు ధర్మజునకు శివనామనిర్వచనంబు సెప్పుట.—

క. వినుము నరేంద్ర మహత్త్వం, బున నుండను నీశ్వరత్వమునను నఖిలమహా
మునిజనములును మహేశ్వరుఁ, డని కొనియాడ వారుఁ దొప్పునప్రతిముండై.
సీ. ఉగ్రత్వమునఁ బ్రతాపోన్నతి రుద్రనా, మముఁ దాల్చె దేవసంఘమున కెల్ల
మహతి నాఁ బొలుపారుమహనీయదేవత, గావున విను మహాదేవుఁ డయ్యె
నఖిలసత్కర్మఫలాకారశుభములు, సేయువేడుకకల్మి శివుఁ డనంగఁ
జనియె సుస్థిరతేజమున వెలుఁ గొందుట, నంచితస్థాణునామాఖ్యఁ బరఁగె
తే. జంగమస్థావరాత్మకసకలభూత
రూపబహుళత నొందుట బహురూపనామ
ధేయుఁ డై యొప్పె ధూమ్రపుఁజాయజటల
వలన ధూర్జటి యనుపేర వఱలె వాఁడు. 398
ఆ. వినుము విశ్వే లనఁగఁ జను దేవతలు దన, యందు పొడమి రట్టు లగుట విశ్వ
రూపనామకమునఁ దీపితుం డయ్యె నా, త్రిపురమర్దనుండు నృపవరేణ్య. 399
సీ. బహునేత్రములు మేనఁ బ్రజ్వరిల్లుట సర్వ, తశ్చక్షురాహ్వయోదాత్తకీర్తిఁ
బరఁగు భూతము లెల్లఁ బశువులు దాఁ బతి, గావునఁ బశుపతి నా వెలుంగు
విమలస్థుఁ డై యునికి వృషవాహనుఁడు మృత్యు, వనఁ జనుఁ బ్రాణపాలాఖ్యసమత
నొంది వహించు వేదోక్తాభిధానముల్, మఱియుఁ బెక్కులు వానిమహిమ వేద
ఆ. వేత్త లైనవారు వివరించి యన్యోన్య, బోధకత్వమునఁ బ్రభూతసౌఖ్యు
లగుచు సంతతము శివారామతాసరూ, పాత్ము లై చరింతు రధిపముఖ్య. 400
క. ఈనామనిర్వచనములు, మానవుఁడు పఠించినను సమాహితమతి యై
వీనుల నించిన సౌఖ్యము, నానందము నిందు నందు నతనికిఁ గల్గున్. 401
వ. అని చెప్పి మఱియును. 402
క. వ్యాసమహాముని లోకహి, తాసక్తిని శివునివిషయ మై సత్యముగాఁ
జేసె నుపస్థాన మొకటి, యా సమధికపుణ్యవాక్ప్రయము విను మధిపా. 403
సీ. సర్వజగన్నిత్యసాక్షి లోకైకశు, భావహమూర్తి నిరామయుండు
బ్రథమభూతములకుఁ బ్రథమతమంబు ను, దాత్తంబు నయినభూతంబు శివుఁడు
దనముఖంబున నగ్ని జనియించెఁ దను సభ, క్తికసమారాధనసుకృతుల నియతిఁ
బాటించువారికి భవనాశనంబు గా, వించువేడుక మది నించువాఁడు

తే. విశదచతురాత్మకత్వవిస్ఫురితి వహించి, కరుణఁ దత్తత్పదస్థిరాకలనకల్యా
లగుసపర్యారతులకు నైశ్వర్యవిధంబు, నీశ్యపదవుల నొసఁగుమహేశ్వరుండు. 404

తే. ఈయుపస్థాన మచలితహృదయవృత్తి
నరుఁడు శివలింగ సన్నిధానమున వాఙ్ని
రూఢముగఁ జేసి యాయురారోగ్యసకల
కామ్యవైభవైశ్వర్యముల్ గలిగి నెగడు. 405

భీష్ముఁడు ధర్మజునకు ధర్మసూక్ష్మప్రకారంబు చెప్పుట.

వ. అనిన విని యత్యంతసంతోషంబు నొంది కుంతీతనయాగ్రజుండు శాంతనవుతో ధర్మంబులు బహుప్రకారంబులు గలవు పరమానుష్ఠేయం బగు ప్రకారం బెయ్యది దాని నెఱింగింపవే యనుటయు నజ్జనపతికి జాహ్నవీనందనుం డిట్లనియె. 406

ఆ. ధర్మములకు సంజ్ఞ తద్వేదు లగుమహాత్ములు దగంగఁ జెప్పుదురు నరేంద్ర
వినుము కాలపాకమున నది యన్యథాత్వంబు గలిగి యవిశదత్వ మొందు. 407

వ. ఎట్లంటేని. 408

క. అనఘ యధర్మము ధర్మం, బనుమతిఁ బుట్టించుఁ దృణసమావృతమై ప్ర
చ్ఛన్నితలముచందమునఁ దోఁ, చినసూక్ష్మంబోలె సూక్ష్మచిత్తత లేమిన్. 409

క. తప్పక కాన్పఁగ లేమిం, జెప్పెడువారలును దద్విశేషము దప్పం
జెప్పఁగ ధర్మంబు తెరువు, దప్పి నది క్రియాపరులకు దైన్యము దెచ్చున్. 410

వ. కావున ధర్మంబుసూక్ష్మప్రకారంబు. 411

క. శ్రుతముఁ బరిత్యాగముఁ గల, మతిమంతుల నడుగు లోభమదమోహసమా
వృతబుద్ధులు గానినమం, చితచరితులవలనఁ దెలియు శీలనిరూఢా. 412

క. కామార్థంబులు మోహో, ద్దామతకృత్యంబు లని యెదంగని ధర్మ
స్తోమమునఁ దగులుజనముల, చే మేలుగ నెఱిఁగికొనుము సిద్ధవివేకా. 413

తే. అనఘ యుచితస్వాధ్యాయమునను యజ్ఞ
మునసమాచారమున నిష్ఠ పొనుఁగుపడక
యుండు నెవ్వారలకు వార లోపి నడపు
నదియ కనుము ధర్మమునూక్ష్మపదవి గాఁగ.

క. అన విని యుధిష్ఠిరుఁడు నా, మన మిప్పుడు మీరు సెప్పినమాటల సందే
హానిరూఢ మయ్యె ధర్మము, గనికొన వలయుటకు బహుముఖత్వము కల్మిన్. 415

క. పారంబు లేనిధర్మా, చారంబున మునుఁగుమావృశకుబ్రులకుం
దీరం బిట్టిది యని తెలి, వార భవాదృశుల తగుదు రర్మిలిఁ జెప్పన్. 416

తే. ఆగమోక్తవిధంబుఁ బ్రత్యక్షమును స, మాచరణముఁ బ్రసన్నవ్యాకులములు
ధర్మసూక్ష్మత యిమ్మాటఁ దథ్య మిట్టి, దనఁగ రానియట్లున్నది యనఘచరిత.

వ. అనిన నాపగేయుండు కౌంతేయాగ్రజుతో నిట్లనియె. 418
క. ఇవి మూఁడు దెఱంగులు ధ, ర్మసూక్ష్మత నిశ్చయింప । ముఖ్యపదంబుల్
దివిరికొని యివియ చూచుట, యవనీశ్వర పూర్వమునులయందుఁ గలుగుటన్.
క. అనుమానింపకు మంధుఁ, డను నిశ్చయాత్ముండును జడుండును బోలెన్
జననాథ యేను బల్కెద, విని సుకరముగ నూఁదు మింక । వేయును నేలా. 420
క. విమలాత్మ యహింసయు సౌ, నమును సత్యముఁ గ్రోధవర్జనంబును విను ము
త్తమధర్మ రాశి యిది ధ, ర్మమునవరమసీమ దీని । మఱవుము మదికిన్. 421
తే. బ్రాహ్మణారాధనము సద్వ్రతప్రయుక్తమును, దక్క మొండువిచారముల్ । ధర్మపుత్త్ర
యనిన మానస మానంద । మంద నాతఁ, డతని । తిభక్తి వందనం । బాచరించి.
వ. ఎవ్వరు ధర్మంబు నెపి సనూయ సేయుదు రెవ్వరు దాని నుపాసింతు రెఱింగింపు
వారి వారి పొందుగతులను విన వలతుం జెప్పు మనిన నప్పౌరవోత్తమునకు న
ప్పురుషసత్తముఁ డిట్లనియె. 423
సీ. వినుము రజస్తమో । వికృతులఁ బొలిసి, మానసంబులు గల । మానవులకుఁ
గలుగు ధర్మద్వేష । కలనంబు వారలు, నరక వాసార్హులు । ధరణినాథ
సత్త్వపరాత్ములు । సతతంబు ధర్మము, పాసింతు రూర్ధ్వలో । కాధివాస
మునకు వారు సక్తులు । మునుము పుట్టిన, సుతుఁడు ధర్మము పద్మ । జునకు దాని
తే. పాకసంపద సుమతు లు । పార్జితగ ను, పాసనము సేయుదురు తియ్య । పంటిపరువ
మాదరించి తిదుపచార । మాచరింతు, రెరవు గలయట్టి జనముల । విధము దోఁప.
వ. అనిన నంగాంతేయాగ్రజుండు శాంతనవుతోడ సాధులు నసాధులునన నెట్టివారు
సెప్పు మనుటయు నమ్మహాత్ముం డిట్లనియె. 425

— భీష్ముండు ధర్మజునకు సాధ్వసాధుజనుల నిరూపించి చెప్పుట. —

సీ. తమయంత నెఱుఁగరు । ధర్మంబు నను పదే, శమునను గాన రు । సాధుజనులు
ధర్మబోధం బిద్వి । ధంబులు రెంటను, గలిగెడువారు సా । ధులు తదీయ
చరితంబు విను విను । వరు మలమూత్రంబు, లర్హంబు గానిచో । నధిప యతిథి
భోజనశిష్టాన్న । భోజులు దెరు విచ్చి, తగినవారలకుఁ బ్ర । దక్షిణముగ
తే. నరుగుదురు నడపుదురు న । త్యార్జవములు
శరణు సొచ్చినఁ గాతురు । సురతగుప్తి
పరులు నిజదారతృప్తులు । గురువినీతు
లమలహృదయులు సంతోష । మారఁ గలరు. 426
వ. అని వెండియు. 427
తే. సాధు లింద్రియవిభ్రాంతి । సంహరింతు
రఘము దెలిసి ప్రాయశ్చిత్త । మాచరింతు
రప్రకాశంబుగా ధర్మ । మాచరింతు

రఖిలభూతదయాళుత్వ § మారఁ గెరు. 428

వ. అనిన విని యజాతశత్రుండు శంతనపుత్త్రుతో సప్రయత్నులకు నర్థంబు సిద్ధిం
చుట గలుగు ధర్మపరులును నీతివిదులు నైనబలవంతులుబహుమార్గంబు లగునదు
పాయంబుల నర్థంబు లాకాంక్షింప సిద్ధింప కుండెడుఁ గొందఱకు సిద్ధించియు నవి
భోగంబుల కుపయోగ్యంబులు గా కుండు శతులు పెద్ద లేకయుం గొన్నిచిత్తంబు
లందు విద్య లలవడు శతుతు లయ్యును నిర్విద్యు లగుటయునుం గలుగుఁ దెవుళ్ల
నోసియుం బోట్లం బడియును గొందఱు సావరు పూరివుకక దాఁకి బలాధికులు
నచ్చుట చూచెద మిట్లు గాఁ గతం బేమి యెఱింగింపవే యనుటయు నమ్మహీపతి
కమ్మహాత్ముం డి ట్లనియె. 429

శుభాశుభంబులు పూర్వజన్మకృతపుణ్యపాపంబులచేఁ గల్గు నని చెప్పుట.

క. మొలవం జెట్టనియట్టిది, మొలచునె తొలుమేనిదానకర్మముల నానార్థం
బులు సిద్ధించుఁ బ్రయత్నం,బులు లేకయు నింత నిజము § భూపవరేణ్యా. 430

తే. అలఘుతపములు దొలుమేనఁ § గలిగెనేని
వెదకికొని వచ్చు నన్నరు § విపులభోగ
ములు పురాకృతవృద్ధసేవల ఫలించు
బుద్ధికలిమియు విద్యలఁ § బొలుచుటయును. 431

క. తొలుమేన నహింసారుచి, గలిగిన దీర్ఘాయు వొందుఁ § గారణభూతం
బులు భూవర యివి యీగుణ,ములు లేమియు కీడులకును § మూలం బరయన్.

వ. కావున. 433

తే. వినుము దానంబుఁ దపమును § వృద్ధసేవ
నము నహింసయు నియతకృత్యములు సర్వ
జనుల కిమ్మహాగుణములు § మనమునందు
దృఢముగా నిల్పి నడవుము § ధీరవర్య. 434

వ. అని యుపదేశించి యాపగానందనుండు వెండియుఁ బాండవాగ్రజున కి ట్లనియె.

సీ. ఎప్పుడు ధర్మంబుపైనెడ నాదరము గల,వానికిఁ గాలంబు § దాన యిచ్చు
ధర్మతత్త్వప్రబోధముఁ బరిస్ఫుటము గాఁ, గావున సుస్థిరభావశుద్ధి
సహితతపస్స్వీకస్నానదానజపంబు,లను దేవతాపూజలను నమోఘ
కాలుఁ డై వర్తింపఁగా ధర్మయోగంబు, నమకూరు ధర్మంబు § సాధనత్వ

తే. మొంది చేయించికొని చెప్పఁ § బొందు నిర్మ
లాత్మకంబు సంసారపారాత్మకంబు
సత్య మజరామరము బోధనిత్య మచ్యు
తము పరానంద మగునప్పదంబు నసఘ. 436

వ. అని నిర్దేశించి మఱియును, 437

తే. కనుఁగొలుంగు వేదవ్యాసమునివరుండు
నధిప కృష్ణుండు నీకుఁ బరాయణంబు
చింత దిగఁద్రావి పాలింపు శాంతవృత్తిఁ
బ్రజల సర్వంబునందును విజయి వగుము. 438

క. అని యిట్లుపదేశించిన, యనిమిషతటినీతనూజునతులవచనముల్
విని మోమలరఁగఁ బులకలు, తనువున జాదుకొన నొప్పె ధర్మజుఁ డధిపా. 439

సీ. అపుడు వీక్షించి సత్యవతీసుతుండు శాం, తనునందనునితోడ ధర్మజుండు
దెలివొందె భవదుపదేశామృతంబున, ననుజులుఁ గృష్ణుండు నాప్తసకల
రాజన్యులును ధృతరాష్ట్రుండుఁ దానును, దగ నిన్నుపాసించి దయకుఁ బాత్ర
మయ్యె వీడ్కొలుపు మీయవనీశుఁ దటితోడఁ, గ్రమ్మఱ నితఁడు నీకడకు వచ్చు

ఆ. వాఁడు గాక యనిన వాత్సల్యమున నార్ద్రి, మైనచూడ్కి సమ్మదాత్ముఁ డతనిఁ
జూచి పురికిఁ జనుము శుభపరంపరలకు, భాజనంబ వగుము రాజముఖ్య. 440

—✿ భీష్ముండు ధర్మజు నాదరించి కరిపురంబునకుఁ బంపుట. ✿—

వ. అని యనుజ్ఞ సేసి వెండియు. 441

సీ. నీబుద్ధి ధర్మైకనిష్ఠ గావుత మ, సమగ్రదక్షిణబహుయజ్ఞములు య
యాతిచందమున శ్రద్ధాన్వితంబుగఁ జేయు, రాజధర్మంబుగఁ బ్రకృతిరంజ
నము నాచరింపు చుట్టములును జెలులును, బండితవృత్తులుఁ బతికులము
లెట్లట్ల నిన్నాశ్రయించి సుఖంచువా, రరుగ నియుత్తరాయణము వచ్చు

తే. టరసికొని యుండి నాకడ కరుగుదెమ్ము
పొమ్ము తల్లియుఁ దమ్ములు భూవరుండు
నీవు సుఖులరై యుండుఁడు నృపవరేణ్య
యనుడు నానంద మొంది ధర్మాత్మజుండు. 442

వ. అట్లు సేయువాఁడ నని సవినయంబుగాఁ బలికి దేవవ్రతునకు దండప్రణామం
బాచరించి యిట్లు వీడుకొని.

క. మును పనుపఁగఁ గృష్ణాదులుఁ, జను దేరఁగఁ దోడఁ బురికిఁ జని యెదురుదితులై
జను లెదురుకొనఁగఁ బుణ్యాం, గనలును విప్రులును వచ్చి కని దీవనతోన్. 444

క. సేవలు వల్లఁగ మహిమో, ద్భాసితుఁడై యిట్లు వోయి ధర్మజుఁడు నిజా
వాసంబు సొచ్చి గాంధా, రీసంభావన మొనర్చి ప్రియము దలిర్పన్. 445

ఆ. తల్లి కెఱఁగి ముదము ద్రౌపది కొనరించి, సకలపౌరజనుల జానపదుల
నెలమి నొలయ వీడుకొలిపి భూసురులకు, దానవిధుల సమ్మదం బొనర్చి. 446

వ. పిదప దైవతములకు సమగ్రధనంబు లొసంగి ధృతరాష్ట్రునిం బ్రభూతపూజా
కరణంబునం బరితుష్టునిం జేసి.

తే. తమ్ములును గృష్ణుఁడును బ్రమోదమునఁ దేల

సమ్మహీశ్వరుఁ డపుడు రాజ్యాభిషేక
మంగళము నొందినట్లు నెమ్మదిఁ దలంచి
గట్టి యైనయూఱట పెంపుఁ ✽ గాంచి పొలిచె. 448

వ. అట్లు శోభిల్లి వారల నుచితప్రకారసమాచరణంబులకుం జన నియోగించి య
భ్యంతరమందిరంబున కరిగెన ట్లజాతశత్రుండు [1]సమ్యగంగీకృతసామ్రాజ్యుండయి
జనసంపూజ్యం బగుచరితంబున సంప్రవర్తిల్లుచుండఁ బంచాశద్వాసరానంతరంబ
వాసరపతి యుత్తరాయణగతుం డగుటయు. 449

ధర్మజుఁడు కృష్ణాదులఁ దోడ్కొని భీష్మునియొద్దకుం బోవుట.

సీ. అక్కౌరవేశ్వరుం ✽ డప్పుడు గదలి గాం,ధారిని ధృతరాష్ట్రధరణివిభుని
గొంతిని మున్నిడుకొని కృష్ణుఁ దమ్ములఁ, దనతమ్ములను విదురుని యుయుత్సు
సంజయులను గృపాచార్యధౌమ్యుల మంత్ర,కోవిదు లగుయాజకులను దోడఁ
గొని వస్త్రచందనాగురుపుష్పఫలఘృత,కుండముల్ పట్టించుకొని యనేక

తే. రత్నములుఁ గాంచనంబుఁ దో ✽ రాఁగ నగ్ని
యంచితంబుగఁ దా సంఘటించి యోగ్య
జనసమానీతముగఁ జేసి ✽ సకలపరిజ
నంబుఁ గొల్వ మహావిభవంబు మెఱయ. 450

వ. చని భీష్మునివీరశయనస్థానంబున కనతిదూరంబునం దేరు డిగ్గినం గృష్ణాదులును
రథావతరణంబులు సేసిరి తానును వారును బారాశర్యనారదదేవలప్రభృతిపరమ
సంయమిసముపాస్యమానుం డగుసమ్మాననీయుం జేర నరిగి మునిజనంబులకు విన
తుం డయి తదభినందితుం డగుచు నాధర్మనందనుం డయ్యమరనదీనందనునకు నభి
వందనం బాచరించి సమీచీనధ్యానతత్పరుం డైనయద్దేవవ్రతు నుద్దేశించి 451

తే. అనఘ వచ్చితి ధర్మనందనుఁడఁ బ్రణతి, యాచరించెద నావలు ✽ కవధరింప
నవసరం బేనివిను సమయంబు వార్చి, యగ్ని మొదలుగఁ దేఁ దగునట్టివాని 452

సీ. తెచ్చితి ఋత్విజుల్ ✽ వచ్చిరి మఱియు నీ,తనయుఁడు ధృతరాష్ట్రుఁ డును సమస్త
బంధులుఁ గలమహీపతులు విప్రులుఁ బౌర,జనులు నేతెంచిరి ✽ సదయదృష్టి నయ
వీరిఁ జూడుము కను ✽ విచ్చి నాపుడు నమ్మ,హాత్ముఁ డందఱఁ జూచి ✽ యానృపాలు
కేలు దెమల్చుచు ✽ మేలు సేసితి దైవ,యోగంబు గాదె నీ ✽ వొదవు టరయ

ఆ. మనుజనాథ [2]మాఘమాసంబుశుక్లప,క్షంబు నామనమున ✽ సంప్రమోద
మావహిల్లఁ జేసె ✽ నని యభినందించి, యతని కధికహర్ష ✽ మావహించె. 453

వ. తదనంతరంబ ధృతరాష్ట్రునితో ని ట్లనియె. 454

తే. వేదశాస్త్రపరిజ్ఞానవృద్ధసేవ,నములు గలిగి యశేషధర్మములు నెఱిఁగి

---

1. గ. సమ్యగ్భంగీకృత. 2. జ. పుణ్యమాసంబు.

వ్యాసమునిపతి దేవరహస్య మర్థిఁ, జెప్ప విని నిమ్మ శంకల నొప్పి తనకు. 455
క. కావున భవితవ్యములకు, నీ వడలఁగ వలదు పాండునృపపుత్త్రులు స
ద్భావమునఁ జూడ నీ ప్పున, భూవర తగ నీవు గన్న పుత్త్రులు గారే. 456
క. పేరిం బరిపాలింపుము, వీరలను బ్రేమఁ జిత్తవృత్తి ముదమునం
గూరంగ ధర్మసుతుని కైఁ, గారుణ్యము గలిగి పనులు గడుపుము నెమ్మిన్. 457
తే. ఏ నెఱుంగుదు నితఁడు నీ యెడఁ బ్రియంబు
భక్తియును గల్గి యక్రూరభావుఁ డగుట
నీవు వత్సలత్వమున నీ ప్రకృతిఁ బంచి
పనులు గొనుము కౌరవకులభారధుర్య. 458
క. విను నీ తనయులు దుర్యోధనాదు లవినీతిపరు లధర్మజ్ఞులు క్రో
ధను లతిలుబ్ధులు వారల, మనమున నిడి వగవ వలదు మనుజాధీశా. 459
వ. అని పలికి కృష్ణు నాలోకించి. 460

—..భీష్ముఁడు శరీరంబు విడుచుటకు శ్రీకృష్ణునను జ్ఞ గొనుట...—

తే. దేవదేవ జీవాత్మక దేవవంద్య, శంఖచక్రగదాపద్మచారుహస్త
వాసుదేవ త్రివిక్రమ వరద పరమపురుష ప్రణతి యొనర్చెదఁ గరుణఁ జూడు.
వ. అనుచు నమస్కరించి. 462
ఆ. బలము నీవ నాకు భక్తుండ నీయెడ, నాలు బిడ్డ లేని యట్టివాఁడఁ
గావు నన్ను నధిక కారుణ్యమున నిమ్ము, నుజ్ఞఁ గమలదళమనోజ్ఞనయన. 463
వ. అని వెండియు. 464
సీ. మాధవ పాండుకుమారవర్గమునకు, గతి నీవ రక్షింపు కరుణ మెఱయ
దుర్బుద్ధి యైనయా దుర్యోధనుని తోడఁ, గృష్ణుఁ డెక్కడ నుండు గెలుపు గలుగు
నక్కడ కంటి నే బెక్కుమాఱులు నట్లు, సెప్పఁగా నా పంపు సేయ కతఁడు
దమవారి నెల్లను దమయించి తానును, నమసె నిన్నెఱుంగుదు నమితమహిమ
తే. నరుఁడు నారాయణుఁడు ననుపరమమునులు
జగము రక్షించుటకుఁ గేలి జన్మ మొంది
సంచరించెద రని పరాశరసుతుండు
నారదుండును జెప్పిరి నాకుఁ దొల్లి. 465
వ. అనిన విని వాసుదేవుండు దేవవ్రతువదనం బత్యాదరంబున నాలోకించి. 466
ఆ. కి శోకప్డు లేదు కృతపుణ్యుఁడవు తండ్రి, వలని భక్తి పెంపు గలవు దానఁ
గాదె బంటుఁబోలె గాంగేయ మృత్యువు, నీవశమున నిలిచె నిర్భరముగ. 467

— భీష్ముఁడు శరీరంబు విడిచి నాకలోకగతుం డగుట. —

వ. నీకు నే ననుజ్ఞ యిచ్చితి వసువులం బొందు మనినం బరమానందంబునం బొంది
పాండునందనులను ధృతరాష్ట్రునిం దక్కటివారలనుం గనుంగొని మిగాచేత

ననుజ్ఞాతుండవ గదా యని పలికి యాదఱం గౌఁగిలించుకొని యానృశంస్యంబును సత్యంబును నిత్యంబులుగాఁ బాటించి బ్రతుకుఁ డని చెప్పి తాను దొల్లి రాజుల గెల్చి తెచ్చినధనంబులు విప్రజనంబుల కిచ్చి ధర్మతనయుం జూచి యెల్లబ్రాహ్మణులునుం బాజపేయులు ఋత్విజులు నాచార్యులు వృద్ధులు విశేషించి పూజింప వలయువా రని నిర్దేశించి యూరకుండి ధారణానుక్రమంబున సమాహితాత్ముం డయి వాయువుల సన్నిరుద్ధంబు సేసిన నవి యూర్ధ్వగతిం గైకొనియె నమ్మహాత్ముని యవయవంబులం బ్రాణంబులు వాసికొనుచు వచ్చునయ్యైదోట్లు శల్యరహితంబు లగుచుండె నట్లగుటం గాంచి కృష్ణాదు లగునఖిలజనంబులు నాశ్చర్యభరితాంతఃకరణు లగుచుఁ గీర్తించి రానంయమచతురునిచే సర్వాయతనసన్నిరుద్ధం బై యాత్మ మూర్ధంబు భేదించి మహోల్కాకారంబున నాకసంబున కెగసి కొంతదవ్వరిగి యంత నంతర్హితం బయ్యె నప్పుడు పుష్పవృష్టి గురిసె. దేవదుందుభులు మొరసె నంబరంబున సిద్ధులు సాధ్యులుం బొగడుచుం బ్రమోదంబు నొందిరిట్లు దేవవ్రతుండు దివంబునకుం జనుటయు. 468

—పరలోకగతుం డైనభీష్మునకు నగ్ని సంస్కారంబు సేయుట.—

సీ. ధర్మపుత్త్రుండును దమ్ములు విదురయు,యుత్సులు నగురుకాష్ఠోత్కరంబుఁ
జందనదారుసంచయమును గొని సమ,స్థలి నమందితచితి యలఘుభంగి
విరచించి రయ్యుధిష్ఠిరుఁడును ధృతరాష్ట్రుఁ,డును నమ్మరున్నదీతనయుపుణ్య
గాత్త్రంబు సుస్నానకలితంబు విహితాను,లేపంబుఁ బుష్పదామోపశోభి
తే. తంబు నుత్తమక్షౌమావృతంబు నుజ్జ్వ,లాభరణభూషితంబుఁ గా నధికభక్తిఁ
జేసి రప్పుడు సామంబు సెలఁగ హోమ,మాచరించిరి యాజకు లగ్ని యలర.

క. కనకములు మణులు భూసుర,జనసంఘంబున కజాతశత్రుఁడు శ్రద్ధా
వినయప్రీతియుతంబుగ,ననేకములు వేడ్కఁ నొసఁగె నవహితమతియై. 470

వ. తదనంతరంబ.

క. తలదిక్కుఁ గవలుఁ బాదం,బులదెస ధృతరాష్ట్రపాండుభూపాగ్రతనూ
జులుఁ బట్టి యధికవిభవో,జ్జ్వల మగుపాడెపయి నిడిరి శవరత్నంబున్. 472

వ. అమ్మెయి నన్నలువురును వహించిరి భీమసేనార్జునులు ధవళచామరంబు లిడిరి యుయుత్సుం డుత్తమచ్ఛత్త్రంబు పట్టె వృద్ధ లగుకౌరవస్త్రీలాలవట్టంబులు పట్టిరి ధౌమ్యుండు క్రియాకలాపంబు నడపె నట్లు సావ సేర్చి దేవవ్రతుని దేహంబు శ్రౌతాగ్ని కాహుతి సేసి బహుకుండంబు లెత్తిఘృతంబు ప్రయోగించి ప్రజ్వలింపఁ జేసి రివ్విధంబునం బితృమేధంబు విభవమహితంబును విధివిహితంబునుం గా ననుష్ఠించి యక్కౌరవు లపసవ్యంబుగాఁ దిరిగి కృష్ణద్వైపాయన నారద దేవలప్రభృతు లనుగమింప భాగీరథికిం జని నవ్యభరత

భార్యాసమేతంబుగా నగ్గాంగేయునకుఁ దిలోదకప్రదానంబు లాచరించి రట్టి
సమయంబున. 473

—❀ పుత్త్రశోకాతుర యైన గంగాదేవి కృష్ణాదులం గనుంగొని దుఃఖించుట. ❀—

సీ. ఉదకంబులందుండి ♦ యుత్థిత యై శోక, విహ్వలత్వంబున ♦ వికలగమన
యగుచు నెమ్మోముపై ♦ నశ్రులు గ్రమ్మంగాఁ, జనుదెంచి కౌరవసమితి యెదుర
నిలిచి భాగీరథి ♦ యలఘుండు దనకొడు, కిలఁ బరికింపంగా ♦ నెట్టిభంగి
వాఁ డయ్యెఁ జరితంబు ♦ పొసఁగిమి మీరెల్ల, నెఱుఁగుదు రైనను ♦ నేను గొంత
తే. సెప్ప వినుఁడు కృపప్రశస్తశీలుఁ డతుల, బుద్ధి రాజవృత్తాఢ్యుఁడు భూరికృపుఁడు
కార్యసంవేది పితృభక్తిఘనుఁడు దార్య, సమ్మతుండు విద్యాపరిశ్రమఘనుండు. 474
తే. కాశిరాజకన్యకలకుఁ ♦ గాఁ జెనంగి, వానిచే గాసి యైరి భూవరులు పలువు
రంబకై పూని వానిమహాబలంబు, జామదగ్న్యుండుఁ దెరలుపఁ జాలఁ డరిగె. 475
వ. అని విలాపంబు సేసి వెండియు. 476
తే. అంతవాఁడు శిఖండిచే ♦ నట్టు లగుట
గనియుఁ బెక్కులు పఱియలు ♦ గాక యునికి
కతనఁ జేసి వజ్రమయంబు ♦ గాఁగ నోపు
నని తలంచెద నాడెంద ♦ మన్నలార. 477
వ. అని వగచిన గంగాదేవికి దేవకీనందనుం డిట్లనియె. 478

—❀ పుత్త్రమరణశోకార్త యగు గంగను కృష్ణద్వైపాయనుం దూఱడించుట. —

తే. నీవు శోకంబు దక్కుము ♦ నీసుతుండు, పరమగతి నొందె శాపసంప్రాప్తిఁ జేసి
వసువు మర్త్యుఁడై వర్తించె ♦ ననఘవృత్తి, భావ్యుఁ డాతఁడు వగ వేల ♦ దేవి నీకు.
చ. అతని శిఖండి యేల యమరాధిపుఁడున్ సమయింపఁ జాలునే
యతఁడు నిజేచ్ఛఁ జేసి పరుసంచితదివ్యశరంబు లంగసం
గతములు సేసి పన్నుగ సుఖస్థితి మృత్యువు మాన్చి యుండి కీ
ర్త్యతిశయ మొంది తా వలచినప్పుడు పోయె విషాద మేటికిన్. 480
వ. అని యూఱడిల్లం బలికిన కృష్ణద్వైపాయనమునివరుండును బరమాదరణీయతత్పర
వచనంబుల జాహ్నవీదేవికి నానందం బాపాదించె నవ్వనంతరంబ యాత్మీయసలిల
సాంగత్యంబు నొందున మందాకినిచేతం గృష్ణాదులు నందఱు జనపతులును నను
జ్ఞాతులు నాశీర్వాదప్రీతులు నై మునులునుం దోడ నడవ నది వెడలి రని యిట్లు
భీష్మనిర్యాణవృత్తాంతంబు వైశంపాయనుండు జనమేజయునకుం జెప్పిన నప్పుడమితేఁ
డిత్తెఱంగున నత్తాతకు జలాంజలివిధానం బాచరించి చరితార్థుం డైనయప్పార్థివ
ముఖ్యుండు మఱి యెట్టిచందంబున వర్తించె మునీంద్రా యెఱింగింపవే యని
యడుగుటయు. 481
చ. కరుణదివ్యచిత్త పరిశాంతమహాత్త్వవిధానవిత్త ని

ర్వికృతవిలాసహృద్య శ్రుతిశ్రీవిస్తరవిస్ఫురద్వైకవేద్య పా
పకబహుభవ్యనామ పరిశ్రవర్ధనసంతతయదూరధామ వి
శ్వకలితతోషణా సుభగసాత్యవతేయవచోవిభూషణా. 482

క. [1]సత్సేవ్యచరణ శమధన, వాత్సల్యాభరణ ధర్మపథతత్త్వోద్ధరణా
హృత్సంగతభక్తికదురితోత్సారణధుర్యదృఙ్మయూఖవిసరణా. 483

మాలిని. స్మయవిరహితపూజ్యా ! మంత్రగీతాధిరాజ్యా
నయనహిమగుసూర్యా ! నైష్ఠికక్షేమధుర్యా
దయితభువనరక్షా ! [2]దాంతిసంపద్యతాక్షా
నియమనికటవర్తీ ! నిష్కళానందమూర్తీ. 484

గద్యము. ఇది శ్రీమదుభయకవిమిత్ర కొమ్మనామాత్యపుత్ర బుధారాధనవిరాజి
తిక్కనసోమయాజిప్రణీతంబైన శ్రీమహాభారతంబున యానుశాసనికపర్వంబు
నందు సర్వంబును బంచమాశ్వాసము. 485

శ్రీమదాంధ్రమహాభారతమునందలి

యానుశాసనికపర్వము సమాప్తము.



1. క. సత్సేవ్యాచరణ సముద్యాత్సల్యా. 2. గ. దాంతిసంవిత్సమక్షా - జ. దాంతి సంపత్సమక్షా
ట. దాంతి సిద్ధ్యర్ప్రమోక్షా.



హరిహరనాథాయ నమః.

# శ్రీమదాంధ్రమహాభారతము

## అశ్వమేధపర్వము, ప్రథమాశ్వాసము



నామక పార్వత్యభి
ధానక మాధుర్యధుర్యసతతశ్లేషో
పానీతనిరంతరసాం
ద్రానందప్లావితాత్మ హరిహరనాథా. 1

### శోకమగ్నుం డగుధర్మజునిఁ గృష్ణాదులు ప్రబోధించుట.

వ. దేవా వైశంపాయనుండు జనమేజయున కిట్లనియె నట్లమరనదీనందనున కుదక
కర్మం బాచరించి ధర్మనందనుండు ధృతరాష్ట్రపురస్సరంబుగ భాగీరథి యుత్తరించి
తత్తీరదేశంబున. 2

ఉ. ఉమ్మలికంబునం బొగులుచున్నల్లములోఁ బొరి లోచనంబులం
గ్రమ్మఁగ నశ్రువారి ధృతిఁ గారవ మేద మహోగ్ర బాణపా
తమ్మున మ్రొగ్గునేనుఁగువిధమ్మున నేలకు వ్రాలఁ బట్టె వే
గమ్మ వృకోదరుండు మఱి రక్షకు స్మరువంపున నమ్మహీశ్వరున్. 3

ఆ. పట్టి యతఁడు దనదుపైచీర యాస్తరణంబు సేసి భూస్థలంబునందుఁ
బెట్టె మానవములు పెద్దయు నలఁదురి, యర్జునాదిసోదరాలి పొదివె. 4

వ. కృష్ణుం డుచితవచనంబుల నాభూపాలుం బ్రబోధించె నప్పుడు ధృతరాష్ట్రుండు
గదిసి కూర్చుండి యక్కురుపతితోడ. 5

సీ. క్షత్త్రధర్మంబునఁ గైకొంటి మేదిని, యుమ్మలికింపక తమ్మ వత్స
యనుజవర్గము నీవు ననుభవింపుము శోక, కాలంబు గా దిది యేల వగవ
వని పల్కి విదురహితాలాపములు దన, వినకుండుటయు సుయోధనునికీడు
నద్దుష్టబుద్ధిఁ జా ననుసరింపఁగ ధర్మ, కొందలినకతమున నింత పుట్టె

ఆ. తనయుఁ దెలియ నాడి యతనకు గాంధారికి, వగలు మిగులఁ బొగులఁ వలయుటయును
నగ్గడించి మమ్ము నొంటివగ్గులఁ గనుం,గొనుము వంత దీర్పు మనుజనాథ. 6

వ. అనిన విని యూరకున్నం గని శౌరి యక్కురవపతితో బంధువులఁ శోకంబు నొం
దిన మృతకోటికిం బరితాపంబు వాటిల్లు నట్లుం గాక భవదీయజ్ఞాతులు సమరం
బున ననివర్తులై యూర్ధ్వలోక వర్తులైరి వారికి శోకింపం బని యేమి శోకిం
చిన వారలు మగిడి వత్తురే యని పలికి వెండియు. 7

క. విన వలయువాని నెల్లను, జననాయక వింటి వీవు శాంతనవునిచే
వనట యుడుగు మిఁక దుర్మతి, యునుబోలెను వగచు చుండు టుచితమె నీకున్.

వ. వ్యాసనారదాదులును నిన్ను బోధించిరి వారివాక్యంబు లూహింపుము. 9

చ. అతులితదక్షిణాన్వితమహాధ్వరకర్తవు గమ్ము దేవతా
పితృనివహంబులం గరము ప్రీతియు భక్తియు నుల్లసిల్ల న
ర్చితములు సేయు మర్థిఁ బ్రజఁ జేకొని రక్షఁ ఘటింపు బంధుసు
స్థితు లొనరింపు మెప్డు నతిథిప్రజపూజ లొనర్పు భూవరా. 10

వ. అనిన విని ధర్మనందనుండు సాత్త్వవతేయు మొగంబు గనుంగొని దేవా భవదీయ
దయాప్రేమంబులు నాపై నెప్పుడు నత్యంతగాఢంబులై యుండు నన్నుఁ బెక్కు
భంగుల రక్షించితి రిటమీఁద వనంబున కరుగ ననుజ్ఞ యిచ్చుట నాకుం బ్రియం
బగు నయినను బితామహాకర్ణులం జంపినక్రూరకర్మునకు శాంతి యెట్లు
గలుగు నమ్మహాకల్మషం బేమిటం బాయు నయ్యనుష్ఠానంబు విధియింపుం డని
పలుకుటయు నాధర్మధుర్యునకుఁ బారాశర్యుం డిట్లనియె. 11

సీ. నిష్ఠించి యిబ్బంగి నీ కేమి సెప్పిన, వాక్యంబు లెల్లను వఱదఁ గలసి
పోయెనే నీ దగుబుద్ధి యిం తొప్పదో, కాక మర్త్యుఁడు గాఁడు కర్త యీశ్వ
రుని నియోగమున మేలును గీడు నొనరించుఁ, గాన నీమదిఁ బాపకర్మశంక
గలిగెనేనియును యాగముల దానంబుల, నది వాపికొన రాదె యశ్వమేధ

తే. మధికదక్షిణాన్వితముగ ననఘ చేయు
మంతతో భవదీయచిత్తానుతాప
మంతయును బాయు రఘురాముననట్లుఁ బూరు
భరతులును బోలె దానతత్పరుఁడ వగుము. 12

చ. అన విని యమ్మునీశ్వరున కానృపుఁ డిట్లను నశ్వమేధయా
గనిరతి భూమిపాలు గతకల్మషుఁ జేయఁగఁ జాలు నాఁగ ము
న్నను వెస వింటి సజ్జనమనోజ్ఞవచోమహనీయ నీవు సె
ప్పినవలు కూఁది యాక్రతువు ప్రీతి నొనర్చెద నెల్లభంగులన్. 13

వ. అని పలికి మునీంద్రా యొక్క విన్నపం బవధానంబుతో నవధరింపు మశ్వమేధం
బధికదక్షిణాన్వితంబు గావలయు ననుట దెల్లంబుగా మీరు నాన తిచ్చితిరి నా

కర్థంబు లేదు కార్యంబున మృతులైన నరపతులసుతులు శిశువులును శోకా
క్రాంతులునుం గావున వారలవలన ధనాహరణం బత్యంతాకరణీయంబును దుర్ల
భంబును నైనది దొల్లి దుర్యోధనుండు మాతోడియీసునంజేసి పెక్కండ్రు
రాజులను ముక్కడిమూఁకలనుం గూడఁ బెట్టి ధనంబు వ్యయపెట్టి భూమియు
బండారంబునుం బాడుచేసె నివ్విధంబున నిర్ధనత్వంబు వాటిల్లె ధనార్జనంబునకు
నొండొక తెరవు దొరకొన దిట్టిది కర్తవ్యం బని యెఱుంగ కున్నవాఁడ మంత్రుల
రై నాకుఁ గార్యం బెఱింగింప వలయు నని ప్రార్థించిన నమ్మహాత్ముం డమ్మహీపతిం
బరమాదరంబున నాలోకించి కొండొక విచారించి. 14

సీ. అనఘ మరుత్తుండు యజ్ఞంబు సేసి మ,హాధనరాసుల నవనిసురుల
కిచ్చె వా రవి గొను నెక్కుడై యుండుటఁ, ద్రవ్యితండంబులు దమగృహముల
నిడికొని పెంధన మెల్లను నిధియుఁ గా, ని మ్మైననెలవున నిడుచు నుండి
యుండఱు నేకవాక్యత దీని నెవ్వరు, గనినను నిది వారిధనమ యనిరి
ఆ. మానవేంద్ర యమ్మహానిధానముఁ దెచ్చి, వలసినట్లు నీవు వ్యయము సేయు
మనిన ధర్మతనయుఁ డతఁ డెట్లువార్జించె, నంత కాంచనము మహాత్మ చెపుమ.
క. అనుటయు నాసత్యవతీ,తనయుండు మరుత్తుపుణ్యతరచరితంబుల్
వినఁ గోరుట మే లెంతయు, వినిపించెద నీవు లలర వినుము నరేంద్రా. 16
వ. అని పలికి యిట్లనియెఁ గృతయుగంబున దండనీతిప్రవర్తకుం డగుమనువునకుఁ బ్ర
జాని యనుతనయుం డుదయించె నతనికి క్షుతుం డుద్భవించె నాతనికి నిక్ష్వా
కుండు ప్రభవించె నాభూపతికి నూర్వురు సుతు లుదయించి రం దగ్రజుం డగు
వింశునకు వివింశుం డుదయించె నవ్వివింశునకుం బదియేవురు గొడుకులు పుట్టిరి
వారిలోనం బెద్దవాఁ డగుఖనీనేత్రుం డధికబలశౌర్యంబులను నకార్యపరుండును
నై సోదరులం గలిసికొని నడవక పదునలువురం జెఱిచి సామ్రాజ్యంబుఁ గైకొని
యుండి.
సీ. మంత్రివిద్వేషంబు మాన్యపరాభవం,బును బ్రజాపీడనంబులును గలిగి
యొక్కలీఁ డగుటయు ముప్పిరి మంత్రు,లాతనిఁ బాపి యతనినందనుని రాజ్య
మునకుఁ బట్టము గట్టికొని రక్కుమారుండు,దమయయ్య చేటు చిత్తమునఁ దలఁచి
సచివప్రభృతు లగుసర్వజనంబుల,యాత్మల ననురాగ మావహిల్ల
తే. సత్యమును వాడియును నొప్ప నిత్యధర్మ,పరత వర్తిల్లె నమ్మహీశ్వరుఁడు సతత
దానతత్పరుఁ డై కలధనము లెల్ల, విప్రులకు నిచ్చి దారిద్ర్యవికలుఁ డయ్యె. 18
క. దానఁ గడు డస్సె నాతని, సేన యరాతు లది యెఱిఁగి చెచ్చెర బలసం
తానముతోడం బైకొని, యానరపతిఁ జెఱిచి రాతఁ డాప్తులుఁ దానున్. 19
క. [1]వనమునకు నేఁగె సంయమి,జనములు నచ్చెరువు నొందుచందంబున న

1. చ. వనమునకు నేఁగి... చందంబున నా, గ్రనియతి శోభిల్లం దప.

జనవిభుఁడు నియతి నట తప, మొనరించి మహాప్రభావ మొంది కడంకన్. 20

క. అమలమతిఁ గరముఁ గ్రోలఁగ, నమరిచి మానితతపోమయాధికశక్తిన్
ధమనక్రియ యొనరించిన, నమితగుణా చెప్పఁ జిట్ట లయ్యెను దానన్. 21

వ. ఆకర్ణింపుము. 22

క. భటతురగసామజరథో, ద్భటసేనాసముదయములు బహుళరుచినము
త్కటకాంచనరాసులు నచ్చటఁ బొడమెం జూడ నక్కజం బగుభంగిన్. 23

వ. ఇట్లు బలంబును ధనంబునుం గల్గుటయును. 24

క. ఆనరపతి రయమున రిపు,భూనాథులమీఁద నడచి పోరుల వారిన్
సేనాయుతముగఁ జంపియుఁ, గానలకుం దోలియును బ్రకాశత నొందెన్. 25

క. కరథమనంబున నాతఁడు, కరంధముఁ డనంగ బరఁగి గౌరవమునవి
స్ఫురణము విభవము శౌర్యముఁ, గరుణయు ధైర్యంబు వెలయఁగానిలయేలెన్.

తే. శమము దమమును సత్యశౌచములుఁ గలిగి, యజనశీలత నశ్వమేధాధ్వరంబు
లంగిరసుఁ డుపదర్శకుండై నయింపఁ, బెక్కొనర్చెలోకములు సంప్రీతిఁబొగడ.

వేదవ్యాసమునీంద్రుండు ధర్మజునకు మరుత్తుని చరితంబు సెప్పుట.

క. అతనిమనుమఁడు మరుత్తుం, డతులయశుఁడు విష్ణునిభుఁ డనఁ దగు నాగా
యుతబలుఁడు ధర్మతత్త్వస్థితివిదుఁడు సమిద్ధబాహుతేజుం డధిపా. 28

ఉ. అమ్మనుజేశ్వరుండు విభవాతిశయంబు వెలుంగ నశ్వమే
ధమ్మొనరించుచుండి వివిధస్ఫురితాలయముల్ ప్రదీప్తభాం
డమ్ములఁ సత్పదార్థములు లిడం దగుతక్కును గల్గుసిద్ధపా
త్రమ్ములసంఖ్యముల్ పసిఁడిఁ బ్రస్తుతి కెక్క ఘటించె భూవరా. 29

వ. అట్లు నమకట్టి యతండు. 30

చ. హిమగిరిసానుదేశమున నెక్కుడువైభవ ముల్లసిల్ల య
జ్ఞము దగఁ జేసి భూమిసురసంఘము లెల్లను దృప్తిఁ బొంద హే
మ మొసఁగెఁ గుప్పఁగూరలు సమగ్రకుతూహలుఁడై కనత్సువ
ర్ణమయగృహక్రియోపకరణప్రకరంబులు నిచ్చె భక్తితోన్. 31

వ. అని చెప్పి యిది మరుత్తునియాభిజాత్యంబును దదీయవిత్తవిశేషంబును నెఱింగించుట యవ్విత్తం బతనికి దొరకొనిన తెఱంగును నెఱింగించెదఁ దదంచితక్రతుక్రియాప్రకారంబును జెప్పెద వినుమట్లు కరంధముఁ డనం బరఁగి మనువంశదీపకుండై పేర్చినయాభూపతి నిజతపఃప్రభావంబునను మహానుభావుం డగు నంగిరసుండు దన కుపద్రష్ట యయి యనేకాశ్వమేధంబులు సేయించుటం జేసి యావహిల్లినమాహాత్మ్యంబునను మహీపతు లెల్లఁ గొలువఁ బూజ్యసామ్రాజ్యం బనుభవించి తనవలచినయప్పుడు తనువుతోడ నయూర్ధ్వలోకంబునకుం జనియె నమ్మనుజపతితనయుం డవిక్షిన్నామధేయుండు ధరాభారధౌరేయుండై యతనిన

పోలి ప్రజలం బాలించె. 32

చ. అరిగినసుతుండు నూవె మనుజాధిపసత్తము యమ్మరుత్తుఁ డా
వలి దశతంత్రిపిష్టపుఁ గృపారతుఁ డార్యుఁడు ధరణీపతివి
శ్రుతమతి దానశీలుఁ డన రూఢికి నెక్కె తదీయరాజ్యసు
స్థితి వెలుఁ గొందె వాసవుని. గేరికిఁ జేకొనఁ డీసు పెంపునన్. 33

క. వాసవుఁ డను నవ్విభుఁ డెడ, నీసు గలిగి తన్ను మిగులఁ గాని నని తచ్చిం
తాసక్తుం డై మంత్రిని, వాసముననుఁ బనిచెఁ బూరువంశ ప్రవరా. 34

వ. చని యతనితోడ. 35

సీ. అనఘ మరుత్తుండు నిను వరింపఁ దలంచుఁ, దనయజ్ఞమున కుపద్రష్ట గాఁగ
నమరాధిపతి యగు నట్టి నాకును జేసి, యుపదర్శనం బింక నొక్కమర్త్య
నకుఁ జేత నీపెంపునకు హాని గాదె నన్, విడిచి యాతని యజ్ఞవిధులు నడపుఁ
డాతనిఁ దొఱఁగి మఱదాప్తత మెఱయు పై, గ్రక్కడంగ నేటికి నను నతని

తే. పలుకులకు నవ్వియాబృహస్పతి మహాత్మ, యెఱుఁగనే నివన్న నన్ను నీ వింత సెప్ప
నేల సర్వలోకములకు నధీశుఁ డైన, నీగురుండ వారు నాశించునే మహేంద్ర. 36

వ. అని వెండియు. 37

ఆ. అగ్నిసల్లనైన నబ్జమిత్త్రుఁడు మైల, పడ్డ నుర్వి వారలఁ బడిన మేరు
నగము సంచలించిన నను బొంకు వారయునే, నాదుపలుకు నెమ్మి నమ్ము. 38

క. అన విని ప్రమదంబునఁ దే, లినచిత్తముతోడ సముదలీలం జనియెం
దనమందిరంబునకు సుర, లనురాగముఁ బొంద నింద్రుఁ డమలచరిత్రా. 39

సీ. అది యంతయును విని యమ్మరుత్తుఁడు త్రిద, శాచార్యుకడ కేఁగి యతనితోడ
నీకు నెఱింగించి నీపంపున నయేను, సంభారముల నెల్ల సంఘటించి
యజ్ఞాచరణమున కమరి యున్నాఁడ నీ, వుపదర్శనంబు సేయుటకు రమ్ము
నావుడు నింద్రుండు నకుఁ దనయాగము, నకు మున్న వరియించినాఁడు నాకు

తే. నెట్లు రావచ్చు నని యెనా యింద్రమంత్రి, యట్లు పలికిన మాతాత్యక నఘనీదు
తండ్రి సంప్రీతితో నుపద్రష్ట యయ్యె, నట్ల కృపసేయు మని పల్కె నవ్విభుండు.

చ. విని ధిషణుండు మర్త్యులకు విన్నను వొప్పఁ గ్రతుప్రయోగముల్
మనము దలిర్పఁగా నడపి మర్త్యునియాగమునొజ్జఁ గాఁగఁ జా
ల నిది నిజంబ యింక ననుఁ బలావ మొనర్పక పొమ్ము వేఱ యొ
క్కని నుపదర్శనంబునకుఁ గైకొను మారసి నీవు నావుడున్. 41

వ. అజ్జనపతి లజ్జితుండై మగిడి వచ్చి యెదుర నారదుం గని వినయం బెసంగ
వినతుండై నిలిచిన నమ్మునియతనిం గనుంగొని యెట వోయి వచ్చి తేల
విన్ను డై యున్నవాఁడవు నీ తెఱం గెఱింగింపు మెవ్విధంబున నైన నీ విషాదంబు
మాన్చెద ననుటయు నమ్మనుజవరుండు మదీయాధ్వరంబునకు నాంగిరసు నుపా

ధ్యాయుం గావరియింపం బోయితి సద్దేవగురుండు నన్ను దూషించి పరిత్యజించె
నింక నేటి బ్రదుకని పలికిన నప్పరమసంయమి యప్పుడమిఱేనితో బృహస్పతి ని
న్నొల్లకున్న నేమి యంగిరసుని పిన్నకొడుకు సంవర్తుం డాధిమణుచేత ధిక్కరింపం
బడి సకలంబును విడిచి వెడలి వైరాగ్యంబు మెఱువ దిగంబరుం డయి తిరుగు
చున్నవాఁ డతని పాలికి నరుగు మమ్మహాత్ముండు భవన్మఖంబునకు నుపదర్శనం బా
చరించు ననవుడు సంతసిల్లి యాభూవరుం డి ట్లనియె. 42

క. మునివర బ్రదికితి సంవర్తుని నెచ్చటఁ గాంతు నెవ్వరుసునం దగ నా
డిన నతఁడు గ్రోవు సేయుక, ననుఁ గైకొను నెఱుఁగఁ జెప్పవె నాకుం గరుణన్. 43

వ. అని ప్రార్థించిన యప్పార్థివోత్తమునకు నత్తపోధనసత్తముం డి ట్లనియె. 44

సీ. భూపాల యతఁడు కాశీపురిఁ బాయక, వర్తించు నున్మత్తవర్తనమున
నతని నెఱింగెడునట్టి యుపాయంబు, వినుము పురద్వారమున శవంబు
నిడికొని నీవుండు మే తెంచి చూచి నివర్తించువాని సంవర్తుఁ గాఁగ
నెఱుఁగుము మరలి యయ్యెడఁ గంగ వెనుకనె పొమ్ము నిశ్చలభక్తిపూర్వకముగ

ఆ. నెచట నైన నీకు నేకాంత మొదవిన, శరణు సొరుము వినయభరితవృత్తి
నాదుగుఱుతు సెప్పి నా రెవ్వరనినను, జెంద నారదుండు సెప్పె ననుము. 45

మరుత్తుఁడు సంవర్తుని దనయజ్ఞమున కుపద్రష్టగా వరియించుట.

సీ. ఇప్పుడు నారదుం డెందుం డున్నవాఁ డని, యడిగినయట్టి యతఁడు నాకు
ని న్నెఱిఁగించి యగ్నిప్రవేశము సేసె, ననుము శంకింపక యనుడు నమ్మ
హీపతి వారాణసీపురంబున కేఁగి, దిక్కుమాలినపీనుఁ గొక్కచోటఁ
బడి యున్నఁ గని దానిఁ బట్టించికొని పురద్వారప్రదేశంబు సేర నరిగి

తే. యచల నక్కుణపము నిడియుంతనంత, చేచికొని యుండఁగా నొక్కవెఱ్ఱివాఁడు
వచ్చి శవముఁ గనుంగొని వాటువడ్డ, వసరమునుబోలెఁ గ్రమ్మఱి పోవుటయును.

వ. వాని సంవర్తుం గా నెఱింగి యజ్ఞపతి యతని పజ్జన చనం జన నతండు మరలి
చూచి పైఁ ధూళి చల్లియు నుమిసియు వేదుఱుచందంబు భావింప నాభూ
వల్లభుండు. 47

క. వినయముతోఁ గేల్ మొగుచుచు, ననుగమనం బునుగ కరుగ నాతండును ని
ర్జన మగుప్రదేశమునకుం, జని యొక వటవిటపినీడఁ జదికిలఁ బడియెన్. 48

వ. డప్పి భావించుకొని యమ్మహాత్ముం డట్లు గూర్చుండుటయు. 49

సీ. ఆరాజు సేరి సాష్టాంగప్రణామంబు, సేసి నిల్చిన ననుఁ జెప్పి నిన్ను
ననఘ పుత్తెంచిన యతని పేరెఱిఁగింపు, నిజమైన సిద్ధించు నీమనోర
థంబు బొంకగు నేని తలయేను వ్రయ్యలై, పడు నని యమ్ముని పలుకుటయును
నారదుఁ డెఱిఁగించె నాకు మిమ్మని నిజ, మాడిన సంవర్తుఁ డాతఁ డెచట

తే. నేమి తెలుఁగుడ నన్నువాఁ ♦ డెఱుఁగ వలయు.
దేవ మనుజు మీ తెఱఁ గెల్లఁ జెప్పి ♦ నన్ను
నిందఁ బుత్తెంచె నిప్పుడ యగ్నియొప్పనిధర్మ
పరుఁడు వాఁడఁ జొచ్చె నని చెప్పె ♦ నరవరుండు. 50

వ. చెప్పిన నప్పరమమునిని యప్పావకునిఁ జేనియాననం బాలోకించి. 51

క. ననుఁ గానఁగ నీవచ్చిన,పని యెయ్యది యనిన నాన్నృపతి నాయజ్ఞం
బునకుఁ గృప మీర లుపద్రష్టనముం జేయంగ వలయు ♦ సంయమినాథా. 52

వ. ఏను మరుత్తుండ ననువాఁడ భవదీయజనకుం డుపాధ్యాయుండుగాఁ గ్రతుకర్తనైనకరంధమునిపౌత్రుండ ననుటయు నావర్తుండు సంప్రీతి నాతనితో నీవు నీకార్యంబు నాకుం జెప్పితి నా తెఱంగు వినుము మాయన్న యగు బృహస్పతి దనతపోబలంబున నన్ను నవమానించిన మదీయగృహధనాదివస్తువు లెల్లను విడిచి యిట్లు దిగంబరుండనై ననబోఁటికీనుంగు నీ కుపద్రష్టయైన నయ్యెడు పెంపునుం గలదె యమ్మహాత్ము నీవు వరియింపు మట్లు గాక యేన కావలయు ననుతలంపు గలదేని. 53

ఆ. అన్న నాకు మాన్యుఁ ♦ డాతండు వనువంగ, నాచరింతు నీదుయాగమునకు
నౌజ్జ్వలతనము వేగ ♦ మూర్ఖ్వీశ యగ్గురుఁ, గని యనుజ్ఞ వడయు ♦ మనిన విభుఁడు.

సీ. ఆతని కడకు ము ♦ న్నరిగితిఁ గృప పుట్టఁ, బలికితి నతఁడు నాకవలుకు నరకు
గొనక యమర్త్యయాగజనము ననుష్ఠించు, నేను మర్త్యునియొజ్జ ♦ నేల యగుదు
ననిరొ నాతోడియాగసున వాసవుఁడుగురు, నుడిపినకతమునఁ ♦ గడఁగి గురుఁడు
నను ధిక్కరించె నింక ♦ కనఘ యండే మని, పోదు మీమాహాత్మ్య ♦ మునను వాస

ఆ. వుని నతిక్రమింతు ♦ నని నమ్మి యున్నాఁడ, గైకొనంగ వలయుఁ ♦ గరుణ వెలయ
ననిన మునియు నట్ల ♦ యయ్యెడఁ గా కని, పలికె మఱియు నానృపాలుతోడ.

వ. ఏను నీయధ్వరంబున కుపద్రష్టనంబు నేయుచుండ నద్దివస్పతియు బృహస్పతియుఁ బ్రద్వేషించి రోషంబు వాటింతురు దానికి నులికి నీవు నంచలించిన మదీయశాపంబునం గీడువచ్చు నింత దలంచి సుస్థిరనిశ్చయుండవు గావలయు విచారించుకొమ్మనిన నమ్మహానీయుతో నమ్మహీనాథుండు. 56

—✤ సంవర్తుండు మరుత్తుని యజ్ఞమున కుపద్రష్ట యగుట. ✤—

సీ. నీకృప గాంచితి ♦ నాకు నిం కొండువి,చారంబు లేటికి ♦ సంయమీంద్ర
యా దివస్పతియు బృహస్పతియును నేల, పశుపతి విద్వేష్యపరతఁ గలఁచె

---

"తే. అయ్యెడుం గాక యిప్పుడు నీ ♦ కనుచు నీవు, నంచలించినయప్పుడ ♦ శాప మిత్తు
నీకుఁ గీడును బాటిల్లు ♦ నింత దలఁచి, సుస్థిరుండవు గావలె ♦ నుజనవర్య."

ఈపద్యము ౫౬వ పద్యమునకుఁ దర్వాత ముద్రితగ్రంథములో నున్నది. వ్రాతప్రతులందుఁ గాపట్టదు. ప్రక్షిప్తం బని తోఁచెడిని.

నేనియుఁ గలుఁగుదు ననే యని పలికి విరా,నంగతి వాసిన § సరసిజాక్ష
చంద్రతారాకులాచలములు గలయంత. కాలంబుఁ బుణ్యలోకములు లేక
తే. పోవు నని శపథము శుద్ధభావవృత్తిఁ
బలుకుటయు మెచ్చి యమ్మునిపతి మహేంద్రు
గంటె నిను ధనవంతునిఁ § గా నొనర్చి
క్రతువు నడపుదు నని చెప్పి § ప్రమద మెసఁగ 57

వ. మఱియు నిట్లను నెత్తెఱంగున నేను ధనవంతునిఁ జేయుదు నంటేని వినుము హిమవంతంబు నుత్తరభాగంబున ముంజవంతం బను పర్వతంబు గలదందు శివుండు శివాసహాయుండై సురసిద్ధగరుడగంధర్వావనమ ప్రభూతజాలంబు సేవింప విహరించు చుండు. 58

క. మరణజరారోగము ల,[1]గ్గిరి యేసిరువులకు లే వక్షయబహులతా
రువులుఁ గుసుమఫలంబులు, గర మొప్పుచు నుండు నెల్లకాలము లందున్. 59

తే. ఆనగంబు పార్శ్వంబుల § నరుణకిరణ, రుచి వితానంబు ననుకరింపుచు వెలుంగు
శుద్ధకాంచనమయశిలాస్థగాలవాలు, కా § ప్రభాజాల మాశ్చర్యకారి యగుచు. 60

వ. మన మయ్యెడకుం బోయి. 61

సీ. శ్రీకంఠు రుద్రుని § శివుఁ బూషదంతఘ్ను, హరునిఁ గపర్ది శంకరుని నంత
కాంతకు వరదుని § నాదిదేవుని ద్రిలో,చను సహస్రాక్షుని § శాంతమూర్తిఁ
[2]జీరవాసుని ధన్వి § సిద్ధు దండధరు మృ,గవ్యాధు సుష్ణిషిఁ § గనకబాహుఁ
బశుపతి వృషు భూతపతి మాతృభక్తుని, నజు నగ్నివక్త్రుని § నభవు భవుని
ఆ. భక్తిఁ బ్రస్తుతించి § ప్రణతులఁ దేల్చి త,త్కరుణ వడసి పసిఁడి § త్రవ్వితండ
ములు నృపాల పెక్కు § మోవులు దెత్తము, రమ్ము భారవహులఁ § దెమ్ము వాల. 62

క. అని పలికి యమ్మహాత్ముఁడు, గొని పోవఁగఁ బోయి శివుఁ § గుంఠితకరుణం
గనక మసంఖ్యము మోవులు, గొని వచ్చె నతండు మంచుకొండ యిరువులకున్. 63

వ. ఇట్లు మహాధనవంతుండై మరుత్తుండు సువర్ణమయంబులుగా యజ్ఞవాటంబును భాండప్రముఖసకలక్రియాసాధనంబులును శయ్యాసనాదులుం గావించుకొని తత్ప్రదేశంబున నతిమానుషం బగువిభవం బెసంగ యజనంబున కుపక్రమించుటయు బృహస్పతి యంతయు నెఱింగి యంగంబు కృశంబై వెలఁబారునట్టి వగం బొందిన సంక్రందనుండు సూచి యవ్వాచస్పతి కిట్లనియె. 64

ఆ. తెలివు వొందియున్నదియె నీ దుచిత్తంబు, సురల బ్రదుకు తెరువు § లరసి నడపు
చున్నవాఁడవే సవనోత్సాహమున వారు, నీకుఁ బ్రియ మొనర్చి § నేర్చి మంత్రె.

వ. అనుటయు నాచార్యుండు సర్వంబు సంపన్నంబయ్యె నని నమిషపతి యతనితోడ.

క. నీ మొండలు డస్సి వెలువెల, నై యున్నది నీకు నిట్టియధికవ్యథ గావుం

1. క. గ. చ. జ. గ్గిరియం దెయ్యెడలఁ 2. క. గ. జ. ట. ‘చీరవాసుని ధన్వి ♦ బిసదంతు సిద్ధు మృగ.

డిన మహాద్దారుణాకృష్టిని, నినుఁ గాల్తుఁగ మఱుఁగు మిప్పటికిఁ దిరుగకుమీ. 78

చ. అనుటయు క్షితి నగ్ని యమరాధిపుపాలికిఁ బోయి యే మరు
త్తునిఁ గని వచ్చి నీ దగు క్రతుక్రియకున్ గురు యాజకుండు గాఁ
గొను మని చెప్పితిన్ విని యతండతినిశ్చయుఁడై నయవిభుం
డనిమిషమంత్రికిన్ వెఱతు నాతనితమ్మునిఁ గోరి తెచ్చితిన్. 79

వ. ఈయోగీశ్వరుండు మదీయాధ్వరంబునకు యాజకుం డను పలుకు పలికి సంవర్తుం జూపె నే నంత నింక వక పురుహూతునకుం బ్రియంబు బొనరించిన నీకుం బుణ్యలోకంబులు సిద్ధించు నట్లు సేసిన మే లని తఱిమి చెప్పినను నప్పుడమిఱేఁ డొడంబడండు. 80

చ. అన విని యింద్రుఁ డిట్లనియె నగ్నికి నిమ్మెయి పోయి చెప్పు మ
జ్జనపతితోడ నాపలుకు సమ్మతిఁ జేయక తక్కెనేని నేఁ
బనిచెద వజ్రమున్ జనుమి పాలికి నన్మరునాథు వేగ మే
యనుచుట కింతయొల్లదమె యాతనికిన్ మనయాజ్ఞ యారయున్. 81

వ. అని పలుకుటయుఁ బావకుండు పాకశాసను నాలోకించి. 82

సీ. ఇంక వచ్చిన దారుణనేత్రదగ్ధుఁ గా వింతుఁ జుమ్మీ యని విపులకోప
మూర్తియై పలికె సంవర్తుండు గావున, వెఱతు నే నట వోవ వేఱొకండు
పోవుఁ గాక నవుడు దేవేంద్రుఁ డన్యుల, నీవు దహింతు గా కేవిధమున
నొరులు నిన్ను దహింతురో వెదమాట యిట్లాడెదే యనుటయు నగ్ని వలుకు

ఆ. మూఁడులోకములును వాఁడిమగంటిమి, నేలుచున్నవాని నెట్లు వృత్రుఁ
డాక్రమించె నిన్ను నదియును గాక పర్జన్య మఱియు వినుము బ్రహ్మబలము. 83

సీ. నర్యాతి క్రతువున నయ్యశ్వినుల సోమ. పానంబు నీ కొసఁగఁబాటు గాక
పాయంగఁ బెట్టిన భార్గవచ్యవనుండు, వారికిఁ గా సురవర్గసహిత
ముగ నిన్ను బాధితుం డగఁ జేసె నిజమంత్రబలమున దానికి వలిగి వజ్ర
మెత్తెఱఁ గొని యమ్మునీశ్వరు [1]సాధింపఁ, గడఁగిన నగుచు బెట్టడఁచెఁ గాదె

తే. యతఁడు పుడిసెఁడునీర నయ్యప్పు డతనిఁ, దెచ్చి సోమ మాశ్వినులకుఁ గలుగఁ జేసె
తరయ నెందును బ్రహ్మబలాతిశయముఁ, గడచినట్టిబలంబులుఁ గలవె యనఘ.

క. అనవుడు బ్రహ్మబలము గడు, ఘన మగు నెఱుఁగుదు మరుత్తుఁ గాఱియఁ బెట్టం
జనదే నా కని శక్రుఁడు, పనిచెను గంధర్వలోకపతి ధృతరాష్ట్రున్. 85

వ. పనుచు నప్పు డతని కిట్లనియె. 86

తే. నీవు వోయి మరుత్తునిఁ నెమ్మిఁ గాంచి, గురుని నీకు యాజకుఁడుగఁ గొనఁగవలయు
నట్ల చేయక యున్న వృత్రారి క్రోధదీప్తుఁ డై కులిశంబుఁ బుత్తెంచు ననుము.

వ. ఈమాట సంవర్తునిసన్నిధిని యాడు మని పలికిన నాధృతరాష్ట్రుం డియ్యకొని

---

1. గ. ప్రహరింప.

చని సంవర్తసహితుండై యున్నమరుత్తుసింగని తాను గంధర్వుండనియును ననిమిషపతిపంపున వచ్చితి ననియునుం జెప్పి యప్పుడమిఱేనితో మఱియు నిట్లనియె. 88

చ. వినుము మదీయబుద్ధి నృపశేఖర యాజకుఁ గాఁగ నీమఖం
బునకు బృహస్పతిం గొనుము పూర్వదిశాపతి సవ్విధంబు ప్రీ
తి నొసఁగు నట్లు సేయ నవధీరణ సేసితయేని వజ్రముం
బనుచు నతండు నీపయి సభాసదులున్ వినఁ జాటి చెప్పితిన్. 89

సీ. అనిన మరుత్తుఁ డయ్యమరగురుండు నా, యాగంబు నడపుట కాత్మ రోసి
రాకున్న సంవర్తుఁ బ్రార్థించి తెచ్చితి, నింక నట్టులు సేయ నెట్లు వచ్చు
ననఘ మిత్రద్రోహ మధికపాపముగాదె, యిది నీవెఱుంగుదయ్యింద్రుఁ డెఱుఁగు
సిద్ధసాధ్యాదిప్రసిద్ధులు నెఱుఁగుదు, రిమ్మాట గురునకు ననియ్యకోల
తే. యనుడు గంధర్వుఁ డది విననయ్యె వజ్ర
ఘోరనాదంబు నీ కోర్వఁ గొలఁది యగునో
కాదో నీవ యెఱుంగుదు మేదినీశ
యనుటయును నృపుఁ డాలించి విని భయమున. 90

వ. సంవర్తున కెఱింగించి. 91

క. కులిశము వచ్చుచు నున్నది, యలుకొందెదు నామనంబు ననఘచరిత స
భ్యులు సంత్రాసము నొందిరి, తలకొని రక్షింప వలయు దయ మమ్మెల్లన్. 92

వ. అనిన విని యమ్మహాయోగీశ్వరుండు. 93

సీ. ఇంద్రుని దెస భయం బించుకేనియు వల, దతఁడు నన్నెఱుఁగఁడే యధిపవినుము
సంస్తంభవిద్యాప్రశస్తవైభవమున, వజ్రంబు నతఁడు నవ్వాసవాది
దైవతంబులయాయుధంబులు నా చేతఁ, బ్రతిహతిం బొందు దుష్పవనచండ
వృష్టిప్రముఖమహావికృతులబాధింతు, ననుడు మ్రోయుచు నిదె యరుగుదెంచె
ఆ. భిదుర మెవ్విధమున భీతి దొఱంగుదు, ననియె నృపతి యాతఁ డల్ల నగుచు
దాని నరకుఁగొనకు తగువర మనుగు నా, తపము పేర్మి నిత్తు ధరణినాథ. 94

చ. అనిన మరుత్తుఁ డిట్లనియె నాతనితో భయ మెల్లఁ బాసి నే
నిను వర మర్థి వేఁడెద మునీశ విరోధము దక్కి యధ్వరం
బున కిట వచ్చి దైవతనికాయము నిజోచితహవ్యభాగముం
గొనియెడునట్లు గాఁగ మునికుంజర చిత్తమునం దలంపవే. 95

క. తమభాగంబులు దక్కన, యమరులునుం బ్రీతిఁ గొనఁగ యాగంబు ప్రయో
గము సుప్రణీతమయి లో, కమనోజ్ఞము గాఁగ వలయుఁ గారుణ్యనిధీ. 96

క. అనుటయును మదాహ్వానం, బున నింద్రుఁడు సోమపానమున కేతెంచుం
జనుదెంతు రతనితోఁ దక్కినయమరులుఁ దొడఁగు యజ్ఞకృతికి నరేంద్రా. 97

ద్విజులకు భక్తియు శక్తియును వేడుకయున్ వినయంబు నొప్ప సం
భజనపరాత్ముఁ డై యొసఁగె బౌరవవంశపయోధిచంద్రమా. 105

తే. అంతఁ బోవక హేమమయత్వమహిత, యజ్ఞవాటభాండాదిపదార్థములును
బ్రాహ్మణావళి కిచ్చె నప్పాట నతఁడు, హిమగిరిప్రాంతమునఁ గ్రతువెలమిఁ జేసి.

వ. సంవర్తునిచేత ననుజ్ఞాతుం డై నిజపురంబునకు నరుగుదెంచి వార్ధివేష్టితవసుంధరావలయంబుం బుణ్యపరత వెలయం బాలించి బ్రాహ్మణులుఁ దమయోపినంతయుం బసిండి ద్రవ్యాతండంబులు దెచ్చుకొని తక్కినదానినచ్చట నొక్కెడనిధిగా నిక్షేపించి దీనిం గాలాంతరంబున నెవ్వరేనిం గని రిదియక్కినవారిధనంబ యని రమ్మహాకాంచనసంచయంబు గొని వచ్చి విచ్చలవిడి నశ్వమేధయాగంబున సకలదేవతలం దృప్తులం జేయు మనియె నట్లు వేదవ్యాసమునీశ్వరుండు సెప్పినవచనంబుల వినియును బంధువిషయశోకంబునం గ్రమ్మఱం దెలివి నొందియు నొందక ధూమంబు వొదవినయనలంబునుంబోలె నున్న పాండవాగ్రజుం గనుంగొని కమలనాభుండు. 107

తే. వంక యైనతలం పెల్ల వసుమతీశ, యరయ మృత్యుపదం బగు నార్జవాన్వి
తంబు బ్రహ్మపదం బింత తథ్య మేల, యీఱతాఱతలంపుల బీఱువాఱ 108

క. కర్మానుష్ఠానంబును, నిర్మలముగ నడపఁబడదు నీచే విను మో
ధర్మతనూభవ వగయును, నిర్మూలము సేయ విధి మనీష కలిమియే. 109

వ. వగ [1]నిర్మూలము సేయుమి యెట్లం టేని నీ వంతశ్శత్రుల నెఱుంగవు గాదె కావున నేతద్విషయం బైనయొక్క యితిహాసంబు గల దాకర్ణింపుము. 110

—శ్రీకృష్ణుఁడు ధర్మరాజునకు మనస్తాపోపశమంబు సేయుట—

సీ. అవని యెల్లను వృత్రుఁ డాక్రమించి తదీయ, గుణ మగుగంధంబు గొనిన వజ్రి
వానిపై వజ్రంబు వైవఁ గ్రమంబున, నంబుతేజఃపవనాంబరముల
యందుఁ బ్రవేశించి యందులరసరూప,సంస్పర్శశబ్దముల్ చండవిక్ర
మం డై నయతఁడు సముద్ధతిఁ గొనఁ గొనఁ, గోడ్తోడనమ్మహేంద్రుండు కులిశ

ఆ. నిహతి వెలువరింప నిర్భరవేగుఁ డై, యతనిలోను సొచ్చె నసుర దాన
మూర్ఛవోయె దివిజముఖ్యుండు బోధితుఁ, జేసె మంత్రవిధి వసిష్ఠుఁ డతని. 111

వ. ఇట్లు వసిష్ఠప్రయుక్తమంత్రశక్తిం బ్రబుద్ధుం డైనవృద్ధశ్రవుండు శరీరాంతర్గతుం డై నవృత్రు నదృశ్యం బైనవజ్రంబున వధియించె నవ్వాసవుం డీధర్మరహస్యంబు తెలుంగు మునుల కెఱింగించె మునులు నాకుం జెప్పిరి మానవేశ్వర దీని నీవు దెలిసికొను మని పలికి యప్పాండవాగ్రజునితో నప్పుండరీకాక్షుండు వెండియు నిట్లనియె. 112

సీ. శారీరమును మానసంబును నా రెండు,దెఱఁగు లై వ్యాధి వర్తించు నందు

1. గ. నిర్మూలముసేయుము దెట్లం టేని.

వినువాతమును బిత్తమును శ్లేష్మమును సమత్వంబుఁ బొందినయప్పుడు స్వస్థుఁ డగు న
రుం డవి మూఁడు నొక్కొకండైన వికృతి నొందినశరీరవ్యాధి యనఁగఁ బరఁగు
సత్త్వరజస్తమస్సుమతసుస్థితి విషమత మనోవ్యాధి యాఖ్యాతయునకు
ఆ. నొంటి దోఁచు బెప్పు నొదవ దన్యోన్యసంజనకజన్యభావసత్తఁ జేసి
వికృతికాల మొక్కట నొకటి దోఁచు నది వాతాదులందు గుణములందు నధిప.
వ. ఇది సూక్ష్మకర్మానుష్ఠానప్రకారంబు దీని నీ వెఱవరింపవు గావునం గర్మానుష్ఠానం
బును నిర్మలంబుగా నడపంబడ దంటి నని పలికి మఱియును. 114
క. వాతాదులందు గుణములు, నీ తెరువునఁ దక్కువగుట యెక్కుడగుట నీ
[1]చేతఃప్రశక్తిఁ దోఁచి నృపా తెలియుఁగ వలయు సమత్వపరశాంతికినై. 115
సీ. అమ్మెయి గాక వాతాదులు సత్త్వముఖ్యములును దివిచినఁ గలఁగు దేని
నది నీస్వభావ మే మనఁ గల దంకను, జెప్పెద నవధాన మొప్ప వినుము
సభ కేకవస్త్ర రజస్వలఁ బాంచాలిఁ, గొని రాక మఱవు కాననములోన
నిషమలు గుడుచుట నెడ్డఁ బెట్టుకు జటాసురసైంధవాదులకమరితకృతులు
తే. దలఁచుకుము మాత్స్యపురమున దైన్యపడుట, బుద్ధి సేయకు భీష్మాదియుద్ధతంత్ర
మారయంగ యుద్ధంబు గాదందుఁ బుట్టు,కీడు మే లేమియును జిత్తగింపకుండు.
వ. దాని నెట్లు యుద్ధంబు గా దనియె దం టేని నది మిథ్యాయుద్ధంబు సత్యయుద్ధం
బాకర్ణింపుము. 117
ఉ. అమ్మెయి బంధుమిత్త్రలసహాయతకల్మి ప్రయోజనంబు లే
దమ్మహనీయయుద్ధమున నాత్మయ తోడు మనంబు శత్త్రుఁ డీ
వమ్మెయి నైన శాంతి ఘటియింపుము లోపగఁ దీప్పు మందు శాం
తమ్మ చుమీ మనోవిజయతన్ వెలుగొందుము శాంతబుద్ధివై. 118
తే. అంతరంగ బగునిక్కయ్య మధిప గెలువ, కిట్ల యేటికిఁ బోయెదో యెఱుఁగ దీని
నీవ కనిగొని సద్బుద్ధినిశ్చయప్ర, వీణుఁడవు గమ్ము మాటలు వేయు నేల. 119
వ. అని చెప్పి కౌంతేయాగ్రజునితోఁ గృష్ణుండు వెండియు నిట్లను రెండక్షరంబులు
మృత్యువు మూఁడక్షరంబులు బ్రహ్మం బవి యెయ్యవి యం టేని వినుము మమ
యనునవియును నమమ యనునవియును నై యుండు భూతంబులచేతం గానంబడక
యాబ్రహ్మమృత్యువులు పోరుచుండు. 120
క. తత్త్వమనశ్వర మశరీ,రత్వంబునఁ బరఁగు భూతరాశి నియతనా
శిత్వంబు హింసకత్వము, తాత్త్వికమై లేదు దేహదళనమున నృపా. 121
క. శరధిపరివేష్టితక్షితిఁ, బరిపాలించినను దానిపై దృఢమమతం
బొరయక వర్తించిన న,ప్పురుషుని దురితంబు లెట్లు పొందఁగ నేర్చున్. 122
క. వనమున వన్యాహారం,బున వర్తించినఁ బదార్థములపై మమతన్

1. గ. చేతః ప్రసక్తిఁ దోఁచి నృపా తెలియఁగ నగు సుమతీ.

మనమున విడువక యుంచిన న, మ్మనుజుండు మృత్యుముఖగతుం డగు మనుజాధీశా. 123

క. కలిపగఱ గెలువు గెలుపే, యిల ఘనుఁడగు నిజపరాజయము సభ్యంతరశ
త్రులఁ దద్విజయము మోక్షము, సలలితముపరిజ్ఞానం బొంట సమ్మే లగునే. 124

క. విను మంతశ్శత్రులలో, ఘనుఁడు కాముం డగుటను నిరాకారుం డగుట
ర్తనము విడిచి మర్త్యుండనయ, జనసమానంబులును సామ్యహితమలు గదా. 125

వ. ఇవ్విషయంబునం గామగీత లను వాక్యంబులు గలవు వాని నాకర్ణింపుము
కాముండు లోకంబు నుద్దేశించి యిట్లనియె. 126

క. అనపాయుం డగునెవ్వం, డను నను బాధింపఁ జాలఁడు ప్రయత్నమునా
ధన మగునె వేదవేద్యుం, డను నన్ బరిగణింప నామోక్షము విహితికి నై.  127

క. [1]ధృతి నెవ్వఁడు నన్నుం బ్రతిహతుఁ జేయఁగఁ జూచు [2]భావ మగుడు నతని కే
నతిఁ దడి యెఱుఁగఁడు గాన విహతి బొంకై పోవఁగా జయము లేకుండున్.

క. ననుఁ దపమునఁ బ్రహరించెద, నని యెవ్వఁడు దొడఁగు నతని కాతపముఫలం
బునఁ దనఁ గోరిక నై యే, జనియించుం జెలఁగా వశకము యెవ్వనికిన్. 129

క. నను మోక్షమూఁది చెఱిచెద, నని యెవ్వఁడు దలఁచు వానికయుం దే మోక్షా
ర్థనమై యునికి నవధ్యుఁడ, ననాతనుఁడఁ ద్రోవ నొకఁడుఁ జాలఁడు నన్నున్. 130

క. అని యివ్విధమునఁ గాముఁడు, దనుఁ జెలఁగ రామిఁ జెప్పఁ దలఁపొందిన జె
ప్పినభంగి నెదను దోఁచెను, విను మవధానమునఁ బాండవేయప్రవరా. 131

చ. పనివడి పూఁచి పట్టుమి సుబంధురధైర్యము నిర్వహింతు నే
ననుమతి సొప్పు కుండుట సమగ్రతపంబునతత్ఫలేచ్ఛ లే
కునికి విమోక్షతృష్ణ భర మొందమి కాము నడంచుఁ గాన యి
య్యుపవులు లేమి సువ్వె యనపాయతి గా నతఁ డాడె భూవరా. 132

క. విను పెక్కు లేల కోరిక, మనమునఁ జొరనీక యున్న మదియుం గాముం
డనవద్య యశ్వమేధం, బొనరింపుము గోర కుండు మొక్కటియు మదిన్. 133

ఆ. అశ్వమేధమఖము సనం దట్ల యనఘ యు,లోలుపత్వగుణవిశాలబుద్ధి
శాలి వై ఫలాభిసంధి లేక కామము, ధర్మ్యఁ గాఁ బొనర్పు ధర్మతనయ. 134

క. చచ్చినబంధులఁ గొని రా, వచ్చునె తలఁపకుము నీవు వారిం గ్రతువుల్
విచ్చలవిడిఁ జేయుము విను, మెచ్చు జగంబు నమకూరు మీఁదసుగతియున్.

వ. అని యిట్లు కృష్ణుండు సెప్పెఁ బారాశర్యుండు బోధించె దేవస్థానుండు నారదుం
డును హితవచనంబు లుపదేశించిరి భీమాదులు నలువురును ద్రౌపదియును దగిన
మాటలు సెప్పిరి శాస్త్రచక్షుర్మహితు లైనమహీసురులు యోగ్యవచనంబు
లుపన్యసించి రివ్విధంబున నందఱవాక్యంబులు నాకర్ణించి శోకంబు విడిచి
యాధూ కాంతుండు ధరణీపాలనాధ్వరకరణంబుల కియ్యకొని యనుచిత్వనివృత్తి

1. గ. ధృతి నెయి యెవ్వఁడు ననుఁ బ్రతి. 2. భావ మగుడు.

కై గంగాతీరంబునఁ గొన్నిదినంబులు నిలుచువాఁ డయి మునివర్గంబునకుఁ బ్రద క్షిణంబును బ్రణామంబునుం జేసి. 136

క. మీకారుణ్యంబున నా, శోకం బంతయును వాసె సుమనస్కుల సు
శ్లోకాత్ములార కలిగెఁ, నాకున్ విచ్చేయుఁ డింక నను మఱవకుఁడీ. 137

— వ్యాసనారదాదిమునులు ధర్మజు వీడ్కొని స్వస్థానములకుఁ బోవుట. —

వ. అని పలికి విశేషించి వేదవ్యాసమునివరుపాదంబుల కెఱఁగి భవత్ప్రసాదంబునం గందువ గనినకతమ్మున మిమ్ముం బురస్కరించుకొని పోయి చేకొనం గలవాఁడ నప్పటికి సన్నిధి సేయవలయు నప్పెన్నిధికి నాశ్రయంబైన హిమగిరి మహీధరంబులలోన నెల్లను బరమైశ్వర్యసిద్ధి యని సవినయంబుగాఁ బ్రార్థించి నాపైఁ బెక్కులు కల్యాణకరణకల్యంబు లగుమాట లాడితిరి మహాభాగ్యవంతులకుఁ గాక యిట్టివారికారుణ్యంబు దొరకొనునె మీకరుణను నన్ను భాగ్యవంతుం డని తెలిపెదు నని [1]బహుప్రకారంబులం బ్రస్తుతి సేసె నట్లామంత్రితులై యమ్మహాత్ము లందఱుఁ గృష్ణాజ్ఞానామంత్రణంబు గైకొని యంతర్ధానంబు సేసిరి పదంపడి భీష్మునకుం బరలోకక్రియలు ధృతరాష్ట్రసహితుం డై యాచరించి కర్ణప్రభృతికురుప్రకరంబునకు నూర్ధ్వలోకసాంద్రసౌఖ్యసిద్ధ్యర్థంబుగా నానావిధదానవిధులు నిర్వర్తించి కృతకృత్యుండై కతిపయదినంబుల కచ్చోటు గదలి పాండవాగ్రజుండు పాండునృపాగ్రజు నగ్రేసరుం గావించుకొని కరినగరంబున కరిగి యతనిం బూజించి తదనుజ్ఞాశోభితుం డగుచుఁ గృష్ణుండును భీమాద్యనుజులును మోదంబు నొంద జనులు నభినందింపఁ [2]బెంపారి వసుంధరాపరిపాలనధురంధరుం డయ్యె నని చెప్పిన విని జనమేజయుండు వైశంపాయనున కి ట్లనియె 138

— ధర్మజుఁడు ధరణిఁ బాలించునపుడు కృష్ణార్జునుల వర్తించువిధము —

తే. ఇవ్విధంబున ధర్మజుం డెలమి ధరణి, పాలనము సేయఁగాఁ గృష్ణపార్థు లెట్టి
తెఱఁగువారలై యెచట వర్తించి రెఱుఁగఁ, జెప్పవే నాకు సజ్జనసేవనీయ. 139

వ. అని యడిగిన వైశంపాయనుం డి ట్లనియె. 140

సీ. ధర్మజుం డివ్విధి ధరణిఁ బాలింపంగ, ననఘ యింద్రప్రస్థమున వసించి
కృష్ణుండుఁ గ్రీడియుఁ గ్రీడావరత సరి, త్కాననపర్వతసాను దేశ
ములఁ జరించుచు విప్రపూజలఁ బుణ్యక, థాశ్రవణముల సత్కావ్యగోష్ఠిఁ
బ్రొద్దు వుచ్చుచుఁ దమపూర్వవృత్తము లైన, సమరతంత్రప్రముఖములఁ జెప్పి
తే. కొనుచునుండుదు రాత్మీయతనయు నరుఁడు, దలఁచివగచినశోకంబు దలఁగునట్టి
వాక్యసంతతి నావృష్ణివరుఁడు దేర్చు, సముచితోక్తుల ధర్మజుశాంతి వొగడు.
క. [3]విను మయకృతసభఁ గ్రొత్తగఁ, గని యచ్చో నొక్కయెడ సకౌతుకనానా

1. క. మాన్యకృతప్రస్తుతి సేసె. 2. ట. పృథివిం బాలించె నని చెప్పిన 3. జ. విను మామయుసభ.

జనపరివృతు లై యుండుదు, రనూనవిభవమునఁ బ్రమదమ్ము మీఱఁగ వారల్. 142
వ. ఒక్కనాఁ డప్పుండరీకాక్షుండు గాండీవితో ని ట్లనియె. 143
సీ. సమరంబు ధర్మవిజయపరికీర్త్యంబుగాఁ జేసి భూమి నిష్కంటకముగఁ
బాలించుచున్నాఁడు ప్రజ ప్రీతి నొందంగ, విప్రజనంబులు వివిధసుఖము
లనుభవించుచుఁ దన్ను వినుతింప నెగడెను, శాంతియు సమతయు సకలజనముఁ
గొనియాడు సిద్ధులు మునులు సేవింతురు, ధర్మనందనుఁ డిట్లుదాత్తుఁ డగునె
తే. యతని కున్నతి గావించి రనిలజుండుఁ గవలు నంతయు నీచేతి గాండివంబు
లీల గల్గి మహాధర్మశాలి సత్యనిత్యుఁ డమ్మహీపతి కృతకృత్యుఁ డయ్యె. 144
వ. అని యగ్గించి యతనియాననం బాలోకించి. 145
ఉ. నీవలనన్ మహాత్మ విను నిర్భరచిత్తుఁడ నైతిఁ జూడఁగాఁ
బోవుతలంపు పుట్టెడుఁ బ్రభూతగుణున్ బలదేవు వత్సలన్
దేవకి నార్ద్రచిత్తు వసుదేవుని మద్గతరాగసాంద్రస
ద్భావుల సర్వయాదవులఁ బార్థ ననుం దగ నన్పు పుచ్చవే. 146
క. ద్వారకకుఁ బోయి వచ్చెదఁ, గౌరవపతి కిత్తెఱంగు [1]కార్యజ్ఞానో
దారుఁడ వగునీ వౌచి, త్యార్థము గాఁగఁ జెప్పు మగుసమయమునన్. 147
తే. అవ్విభుఁడు పోయి వత్తుగా కనక పోను
మేనుఁ బ్రాణంబుఁ దనయులు మిత్రగణము
బంధులును నర్థచయము నప్పార్థివేంద్రు
సొమ్ము తదనువర్తనము ప్రశస్తమ్ము నాకు. 148
వ. కావున. 149
క. మనము కరినగరమునకుం, జని పుణ్యాత్ముని నజాతశత్రుని నెలవుం
గని తగునవసరమున నిప్పని విజ్ఞాపించి యతనిపనిచినభంగిన్. 150
క. నడతము పోదమనుడుఁ గ, వ్వడి గొండొకవడి విచారపన్మానసుఁడై
కడు మే లటు సేయుద మని, యొడఁబాటుం బలుకు పలికి యొయ్యనపిదపన్.
వ. అమ్మహాత్ముతో ని ట్లనియె. 152
చ. అనికిఁ దొడంగునప్పుడు మదాత్మ గలంగినఁ గొన్ని తత్త్వబో
ధనమహనీయవాక్యములు దాత్తకృపం దగ నీవు సెప్పితే
మనమున వానియర్థములు మాధవ నిల్పఁగఁ జాలనైతి న
వ్వినుతవచస్సుధారసము వీనుల నిం కొకమాఱు నింపవే. 153
క. అనిన నగుచు నొకకేల న, తనిఁ గౌఁగిటఁ జేర్చి బుద్ధితత్త్వవిహీనుం
డును శ్రద్ధారహితుఁడు నై, తని దూఱి ముకుందుఁ డిట్లులను నాతనితోన్.
తే. [2]బ్రహ్మపదవేదనమునకుఁ బరమహేతు

1. గ. కార్యవిధిజ్ఞ దారుఁడ. 2. చ. బ్రహ్మపదవిత్త్వమునకును,

భూతములు నాఁటివాక్యముల్ బుద్ధిఁ దన్మ
హార్థములు నిల్పనైతి శక్యంబె యింక
సద్వచనములు సెప్పంగ నలఘుశౌర్య. 155

—✿ శ్రీకృష్ణుం డర్జునునకుఁ దత్త్వజ్ఞానస్థిరీకరణము సేయుట. ✿—

వ. తద్విషయం బగునది యొక్క యితిహాసంబు గల దాకర్ణింపుము నాకడకు నొక్కవిప్రోత్తముండు వచ్చిన నేనును దత్త్వజ్ఞానంబు తెఱం గుపదేశింపవే యనుటయు నతండు కాశ్యపనామధేయుం డగునొక్కధరామరుం డొక్కెడ విజితేంద్రియుండును జ్ఞానవిజ్ఞానశాలియుఁ ద్యక్తసంసారపరిగ్రహుండును బ్రబుద్ధసేవితుండును నగునొక్కసిద్ధుని గాంచి సంభృతవినయుండై శిష్యత్వంబున భక్తి నాశ్రయించిన నమ్మహాద్విజునకు నమ్మహానీయుండు సెప్పినవాక్యంబులు సెప్పెద నవధానంబుతో విను మని పల్కి మదీయవదనంబునం జూడ్కి నిలిపి యిట్లనియె. 156

ఆ. అట్లు భక్తిఁ దన్ను నాశ్రయించిన శుచి, త్యాగియుండు నిర్మలాత్మకుండు
నతులవినయపరుఁడు నగువిప్రవరుని వీక్షించి యిట్టులనియె సిద్ధవరుఁడు. 157

సీ. పుణ్యంబు లగుకర్మముల నెక్కుడును జేసి, యింపారు చందు నైహికసుఖంబుఁ
ద్రిదివంబుఁ బడసితి ధీయుత యత్యంత, యత్నలబ్ధం బైనయట్టిపదము
పడసి యొకమాత్ర భ్రంశంబు నొంది కా, మక్రోధముఖచిత్తములవిశేష
ములఁ బొరిఁబొరి జన్మమును మరణంబును, గలుగంగ నేను దల్లులను దండ్రు

తే. లను సహోదరులను బుత్త్రులను ననేక, జాతికలితులఁ గాంచితిఁ జన్నుఁబాలు
వివిధభంగులవానిఁ ద్రావితి సుహృద్వి, యోగధననాశదుర్దశ లొందఁ బెక్కు.

క. మానసశరీరము లగు, నానా వేదనల వివిధనరకగతుల దుః
ఖానేకత్వ మొనర్చువి, మానవవధబంధన ప్రమర్దనకృతులన్. 159

వ. అనుభవించుచు నుండి విసివి లోకతంత్రంబు పరిత్యజించితిఁ బదంపడి యాత్మప్రసాదంబున నిట్టిసిద్ధి వడసితి నింక లోకంబుల నాలోకింప నాకుం బ్రజాసర్గంబు గలయంతకాలంబును శుభంబ నిరంతరం బై కలుగుచుండు నే నంతకంతకు నెక్కుడులెన్న యగుదశలన పొందుదు బ్రహ్మానందంబు సులభంబ యని పలికి మఱియును. 160

ఉ. ప్రీతుఁడ నైతి నీదెసఁ బ్రకారిస్ఫుటభంగిని జెప్ప నొద్ద నా
చేత నుపాస్తిమైఁ బడయఁ జేరితి నీ కది గల్గునట్లుగాఁ
జూతు సవర్ణ్యమూర్తి వినయస్థసుందర నన్ను నెఱింగి వచ్చి తీ
వీతెలి వస్మదీయమతి కించిన నిన్నుఁ బరిగ్రహించితిన్. 161

క. అనుడు నతఁడు హర్షించుచు, ననుఁ బరతత్త్వప్రబోధనమునఁ గృతార్థా
త్మునిఁ జేసి జన్మమృతిదుః, ఖనిరాస మొనర్చు పరమకారుణ్యనిధీ. 162

తాతతశక్తులు దానను, వీతము లగుఁ జేష్టితములు ౼ విను మనుజులకున్. 175

తే. వాయు వంగంబులందు దుర్వ్యాప్తిఁ గదిరి
నొవ్వఁ దెవులును బుట్టించుఁ ద్రొవ్వ సెఱచు
నందు లెక్కలించుఁ గ్రమమున ౼ నొందుఁ బరఁగి
తనువు [1]నష్టానుగఁ జేసి జీవుని వెలార్చు 176

క. నాలుక యాడుట కలుగ, గాలి మునుపఁ జాడ వగుట ౼ కాయంబునయం
దీలీలలు వాయుగతుల్, [2]మే లే సివి గలుగుఁ దక్కు౼మే లనులాత్మా. 177

క. ఎక్కటి యిట్టిని దోషము, లొక్కొక్క మది రెండుమూఁడు౼నొదవి బెరయఁ దా
నక్కడ సన్నిపాతం, బక్కజముగఁ దనువుఁ బాయునది ౼ జీవాత్మున్. 178

క. ఈ విధమున వెడలి చనిన, జీవుఁడు నిజకర్మకాల౼సిద్ధగతులకుం
బోవుం దివ్యవసుఖముఁ, భావేశముఁ బొందు చుండు ౼ నయ్యైయెడలన్. 179

క. కృతకర్మఫలము దొరఁ గుడిచి తనకుఁ దగినట్టివృత్తు ౼ నొందు మగుడ ని
ట్టి తెఱంగున జీవాత్ముఁడు, గతాగతము లనుభవించుఁ ౼ గల్మషహీనా. 180

క. పాపాత్ములు నరకముఁ బుణ్యోపేతులు దివము విధినిర్ణయుక్తి నవశతం
బ్రాపింతురు గావున ని, ర్లేపం బగు మోక్ష మొందరు ౼ లే రట్టిజనుల్. 181

తే. ఊర్ధ్వగతి కేఁగువారవు ౼ లుండునట్టి, నెలవు లాక్యలు శాస్త్ర౼నిశ్చయమున
గని యెఱిఁగింతు రవి నీవు౼వినుము నీకుఁ, దెలియునట్లుగఁ జెప్పెద ౼ ధీసమగ్ర.

తే. సోముఁడనఁ దారకములన౼సూర్యుఁడనఁగఁ, గలుగు తేజస్విమూర్తుల౼నెలవులందు
ధర్మపరులుండుదురు తారక౼తమ్ములకు. మనసు తెరియనట్టివి గడు౼మంచి వగునె.

క. అదియును గాక ఫలంబులు, దుది ముట్టఁగఁ గుడిచి వెడలఁ ౼ ద్రోవఁ బడదు ర
ట్టిది సౌఖ్యమగు న శాశ్వత, పదంబు మోక్షంబ కాక ౼ భవ్యవిచారా. 184

వ. అని చెప్పి గర్భావాప్తిప్రకారం బెఱింగించెద వినుమని పలికి సిద్ధుం డాభూసురున
కిట్లనియె. 185

తే. అశుభములును శుభమ్ములు ౼ నైనకర్మ, ములఫలంబులు గుడువక ౼ పోవఁ గాదు
మన్యువశగతమైనయా౼త్మకు నువాత్త, చరిత యది కారణము నవ్యో౼జన్మమునకు.

క. ఎనయఁగ శుక్లము శోణిత, మును బెరసి వెలందిగర్భ౼మున నెలకొను న
వ్వని బ్రహ్మశక్తి బీజ, త్వనిరూఢిం బొనరు నవి వ్యో౼దలఁ బిండం బై. 187

క. విను మూబీజము పిండము, తనువునఁ జైతన్యరూప౼తం బరఁగి శిరం
బును గేలుఁ గాలు నుదరం, బు నురము వెన్ను ననునంగ౼ముల నేర్పఱచున్. 188

వ. అని చెప్పి. 189

క. జననార్హవేళ వెలువడి, తనతొల్లిటికర్ములకుఁ ౼ దగిన వివిధవ
ర్తనములఁ బొందు నవి దెగినఁ, జని మఱియుం బుట్టుఁ గర్మ౼సంతతికిఁదగన్. 190

---

1. గ. నాసుగ. 2. చ. శ్నైరైనన్ గలుగు దక్కు ౼ శే వమలాత్మా.

క. నరుఁ డెంతకాలమేనిం, బరమం బగుముక్తిపదముఁ బడయక యుండుం
బురుషవర యంతకాలముఁ, బొరిఁబొరి నిబ్బంగిఁ జావుఁ బుట్టువు నొందున్. 191

సీ. కావున ముక్తికిఁ గారణం బగు దాని, నేర్పడఁ జెప్పెద నెఱిఁగికొనుము
దానంబు శమమును దమమును బ్రహ్మచ,ర్యంబును వ్రతపరిరక్షణంబు
దయయును బరధనదారవర్జనమును, నియమయమేంద్రియనిగ్రహములు
జననీ జనక గురుజనపూజలును దేవ,తాతిథి పితృదేవతార్చనములు

తే. సత్యమును శౌచమును శుభసంవిధాన
నిరతియును ధైర్యమును గ్రౌర్యనిరసనమ్ము
గలిమి పుణ్యావృత్తం బిది గలుగునరుఁడు
మొనయు దీని నూఁతగఁ గొని మోక్షమునకు. 192

క. పదపడి ధర్మాచరణము, మొదలుం దత్త్వాత్మవిధము బుధజనులకడం
గదలక నిలిచి యెఱిఁగికొన, విదితం బగు వారిశీలవృత్తములఁ గడున్. 193

క. వారలు సెప్పెడిశాంతో,దారవచనసమితి వినఁగఁ దద్గతబహుగం
భీరార్థము లంతఃకర,ణారూఢము లైన బొరయ వాపన లెంచున్. 194

సీ. వ్రతపరినిష్ఠమై వర్తించుచుండియుం,ద్రియవిజయమును శాంతియును గలిగి
బ్రహ్మైకభజనతత్పరుఁ డగుచుండెను, నతనికి బ్రహ్మంబు హుతవహుండు
నంత్తరంబును యోగ్యసమిధలు జలమును,మంత్రంబు గురుఁడు బ్రహ్మంబ యిట్టి
సచ్చరణంబు సూక్ష్మబ్రహ్మచర్యంబు, దీనియం దుత్తమస్థిరతగలుగు

తే. వాఁడు హర్షశోకోద్దామవాయుహతుఁడు
గాఁడు మేదురమోహాంధకారమున వె
డంగుపడఁడు సంసారనిస్సంగసిద్ధిఁ
బొందుఁ గాలక్రమమున నప్పురుషవరుఁడు. 195

వ. అని చెప్పి మఱియును, 196

—తత్త్వజ్ఞానవిశేషప్రదర్శనము.—

సీ. ఆదిసృష్టిఁ బ్రధాన మనుతత్త్వ మంబుజా,సనుఁడు గల్పించి చేతన మొనర్చె
క్షర మందు దానిఁ దత్పర మగుతత్త్వంబు,నక్షర మనియును నమృత మనియు
నార్యులు సెప్పుదు రమ్మిథునంబున,యందు సంపన్నంబు లఖిలభూత
జాలంబులకును సంజనకంబు లై నబీ,జము లిది శ్రుతివాక్యసంభృతార్థ

తే. మరఁడు గలిగించె గమనము నాగమనము
జీవరాశికిఁ గావున నావిధమున
నది భ్రమించుచు నుండుఁ బుణ్యాతిశయము
కతన జీవాత్మఁ డొకఁడు దన్ గాంచినపుడు 197

1. ప. నియమంబు నింద్రియనిగ్రహంబు.

క. విను సుఖదుఃఖము లచిరము, లనియుం దను వశుచి యనియు § నఖిలపదార్థం
బును నశ్వర మనియుం గ,ర్మనిరూఢత జాడ్య మనియు § మదినూహించున్.
క. ఊహించి తన్నుఁ గప్పు స,మోహావేశంబు ద్రోచి § మోక్షపదప్రా
ప్తిహాను సంసారాబ్ధి వ,గాహనముం జేయ కుండు § గతకల్మషుఁ డై. 199
వ. అని పలికి వెండియు 200
క. జనిరుగ్జరామరణములు, గని ప్రకృతివిధంబు లెస్సగా నెఱుఁగుటఁ ద
జ్జనిత క్లేశమునకు విసి,వినమర్త్యులు పరమపదము § వెదకుదు రనఘా. 201
సీ. అట్టివా రట్టివా § రగుట మేల్ గనికొని, యజనంబుఁ బూతంబు § నైనచోట
నాసీనుఁ డై హృదయంబున నొకచింత,యును లేక యూఱడియుండి యడరి
తోఁచుతోఁపుల నెల్లఁ § దోడ్తో నడఁచి ని,రాలంబనుం డైనయతఁ డొకండు
సర్వమిత్త్రుండును § సర్వసహుండును, నిర్జితేంద్రియుఁడును § నిర్భయుఁడును
తే. గామకోపహీనుఁడు శమఘనుఁడు నైన
యతఁ డొకండు మానాభిమానాపగమము
సర్వభూతాత్మకత్వదర్శనముఁ గలుగు
నతఁ డొకండు వీరలు గందు § రనఘ ముక్తి. 202
సీ. బలయులాభాలాభములుఁ బ్రియద్వేషంబు,లును సుఖదుఃఖములును సమంబు
లై యుండు నెవ్వని § కాసపాటును నవ,జ్ఞతయు నెందును లేక § సర్వధర్మ
తంత్రలోలుండును § ధర్మశీలుండుఁ గాఁ, డెవ్వఁడు గూర్చువా § రెవ్వ రుండు
వా రని తనకు నెవ్వరును గల్గక త్రివ, ర్గేచ్ఛ యెవ్వనిచేత § నీడ విడువఁ
తే. బడు నకర్మభావంబుఁ దానవత్రయావ
గమము వైరాగ్యసుస్థిరత్వమును గల్గు
నరయ నెవ్వనియందేని § నతఁడు నతఁడు
నతఁడు నతఁడును గందు రవ్యయపదంబు. 203
క. అసమాలంబ మశబ్దము, రసగంధస్పర్శరూపరహిత మగుణ ము
ల్లసితగుణ మగు వెలుఁగు న,భ్యసననియతిపరుఁ డొకండు § వడయుం బుత్త్రా. 204
తే. సర్వసంకల్పవర్జనశాలి యగుచుఁ, బరమశాంతి చిత్తంబునఁ § బట్టుకొల్పు
నతఁ డనింధనానలమునట్లల్లఁ బొందు,వికృతవర్జితమైననిర్వృతి కృతాత్మ. 205
వ. అని నిర్దేశించి యోగిజనానుభావ్యంబైన నెల వెఱింగించెద నని పలికి యోగులు
దాని నాత్మదర్శనానందంబు నొందుదు రవధానంబున నాకర్ణింపు మని యి
ట్లనియె. 206
ఆ. అనఘ ముంజగర్భ § మగునిషీక విదర్శ,నంబు గాఁగఁ గనుఁగొనంగ వలయుఁ
దనువు ముంజ మాత్మ § తదిషీకనిష్కర్ష,విధము సుమ్ము యోగవిదునివెరవు.
క. తనువువలన నిష్కర్షం, బొనర్చి జీవాత్ముఁ గాంచు § యోగివరుం డ

య్యును బొందదని యట్లు దన్నుఁ గనినప్పుడు జననమరణాగతులం దొఱఁగున్, 208
క. ముక్తుండు జరామరణవి,యుక్తుం డై హర్షశోకయోగ మెడలి స
ద్భక్తులకు నుపాదేయుం, డగుఁ జుమ్మీ బ్రహ్మచర్యము పేర్మిన్. 209
ఆ. ఒకఁడు లోకమెల్ల నూహించి యాత్మయం, దధికనిష్ఠ గలుగునతఁడు సకల
భూతకోటివలనఁ బొందఁడు భయము రా,గాదిదుఃఖములకు నగపడఁడు. 210
క. ఈ యోగయుక్తునకు శ,స్త్రనిహతి జలబాధ యగ్నిదాహము మొదలై
చను నవ్వికారములు లే, వనఘ యతఁడు గోరఁ డైంద్రపదముఁ గుపద మైనన్. 211
క. తనయందు తన్ను తెప్పగఁ, గనుటం గాంచినసుఖంబు గలుగదు లోకం
బున నెందు దాని కయ్యెడు, ననుశాసనమునకు విసువమి వలయున్. 212
వ. అయ్యనుష్ఠానం బెట్టి దనిన. 213
క. తనయొడలిలోని తెరువున, నాత్మ మంతర్హితంబు జేసి మఱి బాహ్యగతిం
జననీ కుండఁగ నది యొం,ననుపుఁ బడు నిలుప వలయు నచ్చట దానిన్. 214
వ. అది యెట్లనిన. 215
తే. దంతములు జిహ్వ గుత్తుక తాలుతలము
కంఠనాళంబు హృదయం బగణ్యచరిత
మఱియు [1]లోపల నెచటికి మనసు మొలఁగెఁ
దాఁ గదల్పక యచటన యాఁగవలయు. 216
వ. అని చెప్పె నని చెప్పి నాతో శిష్యుం డని మఱియు నంబలికి తలంచికొని కొండొక నవ్వుచు నవ్విప్రుండు నా మొగంబు సూచి యచ్యుతా యాసిద్ధుం డనువాఁడ నేన కహా నీ యెఱుంగని యదియును గలదె మఱియు నక్కాశ్యపనామధేయుం డడిగిన తెఱంగు దానికి నుత్తరంబు నా యిచ్చినవిధంబును విను మని యిట్లనియె. 217
ఆ. కేలు మొగిచి వినయశాలి యమ్మేధావి, విశదకరుణఁ జెప్పవే మహాత్మ
పరమమోక్షకరణపరిణతం బైనయు,దాత్తనూత్మసుకరధర్మ మనియె. 218
వ. అనిన నవహితుండ వై యాకర్ణింపు మని పలికి యిట్లంటి. 219
ఆ. పాలకడవ వెన్నపసులలో నించిన,యాతఁ డెట్లు దాని నరసికొనుచు
నుండు నట్లు లోన నునిచినమనసు నే,మఱక యాత్మ వెదకు తెఱఁగు మేలు.
క. ఈ తెఱఁగున నుద్యుక్తుం, డై తెలివొందినమనంబు నతులవివేక
ఖ్యాతి మరగించి శక్త్యు,ద్ద్యోతిత మగు బ్రహ్మముం జతురయోగి గనున్. 221
తే. అయ్యనాదితత్త్వము చక్షురాదికంబు,లైన యింద్రియములకు గ్రాహ్యంబు గాదు
సకలమలనిరాసాజ్యప్రసన్నతరమ,నఃప్రదీపంబు తద్దర్శనం బొనర్చు. 222
క. కలయంగ నెల్లయెడలం, దలలును లోచనములును బాదంబులు హస్తం
బులు నై యాత్మత్వం బు,జ్జ్వలభంగి వెలుంగ యోగవంతుఁడు గాంచున్. 223

1. చ. లోపట్లు... మొలఁగె.

క. తను నేర్పరించి కేవల,మును శాంతము నైసత్త్వయును సంతతముం
గను మనస్సుఁ దన్ను నెఱుఁగం, గనుఁ జీకటిఁ బాపువెలుఁగు గలుగుం బుత్త్రా.

వ. బ్రహ్మవిద్యారహస్యంబు సర్వంబు నీకుం జెప్పితి నీ వింక సుఖివి గమ్ము పొమ్ము నేనుం బోయెద నని యామంత్రణంబు సేసిన నష్టసంశయుం డయి యా శిష్యుం డరిగె నట నిన్ను దర్శింప వచ్చితి నని పలికి యమ్మహాద్విజుం డంతర్హితుం డయ్యెఁ బరమహితం బైనయీవాక్యసంతానంబు సమవధానంబున వినం బడియెనే పాండవమధ్యమా నాఁడు రథస్థుండ వయిన నిన్ను నేతదీయం బయిన యర్థజాతంబు వినిపించితి నని యప్పురుషవరుతోడం బురుషోత్తముండు వెండియు ని ట్లనియె. 225

సీ. వ్యామిశ్రమతి యగు నరునికి నకృతాత్ముఁ, డైనవానికి నవధానరహిత
చేతస్కునకు నిది సెప్పఁ గాదే దొల్లి, దెలియఁగఁ జెప్పితి దేవతలకు
గాండీవి నీవు దక్కఁగ నిది మర్త్యులా,కర్ణింపఁ దగువారు గలరె యొకరు
పరమరహస్య మీపరిపాటి దీన న,య్యమృతవస్తువు గని యఖిలదుఃఖ

ఆ. ములుఁ దొఱంగి నిత్యముక్తత వెలుఁగొందు,నరుఁడు వైశ్యులైన నాతులైన
శూద్రులైనఁ గండ్రు సువ్వె యిమ్మెయిముక్తి,బ్రాఁతె బ్రాహ్మణులకు రాజులకును.

క. వినిపించితి నిను బోధం,బునకు నుపాయంబు ఫలసముదయము మోక్షం
బును సౌఖ్యనిర్ణయము ని,క్కనుట గడవ సుఖము లొందఁగలవే యరయన్.

ఆ. శ్రద్ధ గలిగి లోకసంగ్రహానంగంబు, నీడ విడిచి యెవ్వఁ డీయుపాయ
మలఁ భజించు వాఁడు మోక్షలక్ష్మికిఁ బతి, యగు నొకింతసందియంబు వలదు.

క. చెప్పం గలయది యెల్లను, జెప్పితి నీ కింత గడవఁ జెప్ప నొకఁడు లే
దిప్పాట నెలల నాఱిటఁ, జొప్పడు యోగంబు నియతిసుద్ధాత్మునకున్. 229

వ. అని యిట్లు కృష్ణుండు జిష్ణునకు నధ్యాత్మవిద్యావిషయంబు లగువాక్యంబులు సెప్పె నని చెప్పిన వినియున్నరనారాయణులు మఱియు నెవ్విధంబున వర్తించిరని యడుగుటయు. 230

చ. గుణసమతానుభూతిహృతికోవిదసారవివేకభవ్య చా
రణసురసిద్ధసాధ్యఖచరప్రముఖాఖిలభూతసేవ్య వీ
క్షణకలనాకృతార్థమునిసార్థబహుస్తుతివాక్యరత్నభూ
షణమహనీయఖేలన నిసర్గకృపాకృతలోకపాలనా. 231

క. నవ్యత్వపురాణత్వద,శావ్యపనయదుర్నిరూపసౌందర్యా వే
దవ్యాసవాక్ప్రకాశిత,దివ్యధురాధుర్య యోగిధీసత్కార్యా. 232

మాలిని. భువనభవనదీపస్ఫూర్తితేజోవిలాసా
సవితృశశిమయత్వస్ఫారచక్షుర్వికాసా

వివిధనిగమవిద్యావేద్యసూక్ష్మప్రభావా
పవనవిజయలీలాప్రౌఢచేతోనివాసా. 233

గద్యము. ఇది శ్రీమదుభయకవిమిత్ర కొమ్మనామాత్యపుత్ర బుధారాధనవిరాజి తిక్కనసోమయాజిప్రణీతంబైన శ్రీమహాభారతంబునయశ్వమేధపర్వంబునందుఁ బ్రథమాశ్వాసము. 234





హరిహరనాథాయ నమః.

# శ్రీమదాంధ్రమహాభారతము

## అశ్వమేధపర్వము, ద్వితీయాశ్వాసము.



సుఖనిష్పాదనకే
లీసక్తపదారవిందకేలీలా నతతా
ధ్యానవికాసిసమాధిస
మాసాదితశాంతిలోల హరిహరనాథా. 1

### బ్రాహ్మణగీతలు

వ. దేవా వైశంపాయనుండు జనమేజయున కిట్లనియె. 2

ఆ. అట్లు శౌరి పార్థు నంచితబ్రహ్మవి,ద్యాప్రబోధకంబు లైనయట్టి
వినుతవాక్యములు సవిస్తరముగ విని,పించి యతనివలని ప్రీతిఁ జేసి. 3

వ. వెండియు నిట్లని బోధించు. 4

సీ. భర్తృభార్యాకృతభవ్యసంవాదంబు, నభయనామకము నై యతిశయిల్లు
నట్టిది యొక యితిహాసంబు విను పార్థ, జననుతసమధికజ్ఞానవర్ణి
తాత్మకుఁ డైనమహాద్విజుఁ డొకఁడు వి,విక్తప్రదేశసేవిత్వనిరతి
నున్నెడ నల్ల నాసన్ను డై వినయంబు, భక్తియు నెసఁగఁ దత్పత్ని ప్రణతి

తే. యాచరించి మహాత్మ యధ్యాత్మబోధ,భరితఁగాఁ జేయవే నన్నుఁ గరుణ పల్ల
వింప నని దయ పుట్టంగ వేఁడుటయును,మందహాసవిభాసిమైమగువఁ జూచి.

క. ఈమాటకుఁ జారుముఖి, నామది ముద మందెఁ గాన నాతికి నిది యే
లా మేటితలం పనుత్రో, పేమియు లే దోపి వినుము హితవచనంబుల్. 6

వ. నా యెఱింగినభంగిఁ జెప్పెద నని పలికి యయ్యతులవ్రతుండా పతివ్రత కిట్లనియె.

సీ. వినను గానను జేయ వెర వైనయవి కర్మ,ములు వానిఁ గర్మకర్తలు సమస్త
సిద్ధిప్రదము లని చెప్పుదు రజ్ఞాన,తిమిరాంధులై విను ధీరచిత్త
జగమున లేదు నిష్కర్మత్వ మొందేనిఁ, గలిగె నేనియును మాకర్మముగ దాని
నిందింతు రొక్కఁడు నెల వది యాత్మ నేఁ, గందు బ్రహ్మంబు నిష్కర్మత వందు

తే. వెలుఁగు నగ్నితో సోముండు గలసి మిథున
ధర్మ మం దెప్డు నడపి ధ్యాతిముఁ దాల్చి
నజుఁడు మొదలుగ నతిరోపాస్తి యందుఁ
జేయుదురు శాంతి నింద్రియజిత్త్వ మొంది. 8

వ. అతిరంబు తెలియం గలింగించెద. 9

సీ. స్పర్శంబు రసము రూపంబును శబ్దంబు, గంధంబుఁ గా కున్కి కారణముగఁ
వ్యక్తాన జిహ్వా నేత్రమున శ్రోత్రంబున, ఘ్రాణంబునను బరిగ్రహవిధాన
మాచరించుటకులో నైయుండ దాత్మ, [1]మమలినబుద్ధ్యవగమను దానిఁ
బ్రాపించుఁ బ్రాణాదిపంచవాయువులును, విను దానివలన వర్తనముఁ బొందు
తే. నంద డిందుఁ బ్రాణంబు నపానమును స
మాననామక వ్యానమధ్యమున నడచు
మెలఁగుచుండుఁ బ్రాణాపానములకు నడిమి
దెస నుదానంబు స్ఫురి యిట్లు దేటపఱిచె. 10

క. నెలకొని ప్రాణాపానం,బులఁ బురుషుండు సుప్తుఁ డైనఁ బొలఁతి విలీనం
బు లగు సమానవ్యానం,బులు యోగులు సంశయంబుఁ బొందరు దీనన్. 11

క. విను తెలియంగ నుదానం,బున సుప్తుం డైనఁ బ్రాణము నపానంబుల్
వనజనిభలోచనా పురు,షుని విడవవు యోగిజనులు చూపి ట్లుండున్. 12

—•• అంతర్యాగప్రకారంబు నిరూపించి చెప్పుట ••—

వ. ఇవ్వాయువు లేనును మనంబును బుద్ధియుం గూడ నీయేడును వైశ్వానరునకు జిహ్వలు వైశ్వానరుం డనఁ బ్రాణులదేహంబులం దగ్నిరూపంబున వెలుంగుచున్న యాత్మయందు ఘ్రేయంబును భక్ష్యంబును దృశ్యంబును స్పృశ్యంబును శ్రావ్యంబును మంతవ్యంబును బోద్ధవ్యంబును నగునీసప్తసంఖ్య సమిధలు ఘ్రాతయు భక్షయితయు ద్రష్టయు స్ప్రష్టయు శ్రోతయు మంతయు బోద్ధయు నయినయీయేడ్వురును వకునను ఘ్రేయాదు లయినహవిస్సు లేడింటిని వేల్చుచుఋత్విజు లిది నప్తహోతృవిధానప్రకారంబు వైశ్వానరువదనంబులు పదియు [2]దిగ్వాయుసూర్యచంద్ర పృథివీపావక శక్ర విష్ణుప్రజాపతిమిత్రాత్మకంబులు శబ్దస్పర్శ రూపరసగంధవక్తవ్యకర్తవ్యగంతవ్యవిసర్గానందంబులు హవిస్సు లీపదింటిని గ్రమంబున నాహుతులు నేయుహోతలు శ్రోత్రత్వక్చక్షుర్జిహ్వాఘ్రాణవాక్పాణిపాదపాయూపస్థంబు లయినదశేంద్రియంబులిత్తెఱంగు దశహోతృవిధి యీరెంటిని నెఱింగియిం దేవిధంబుననేనియు జీవాత్ముం డుపద్రష్టగా నంతర్యాగంబు నడపుయోగిజనంబులు జననమరణవిముక్తు లగుదురు బహిర్యజ్ఞపరులు గమనాగమనభ్రమణంబులం బొందు చుందురు రని చెప్పి వెండియు. 13

1. గ. మమలినబుద్ధ్యవగమము, 2. చ. దిగాకాశసూర్య.

క. విను ప్రణవాదికరూప,త్వనిరూఢిం బుట్టు వాక్కు దాని వెనుచనఁగా
మనము పురుషార్థబుద్ధిం, [1]బనుపడి యని చెప్పె సతికి బ్రాహ్మణుఁ డనఘా. 14

క. విని యావిప్రునితో ని,ట్లను నమ్మెలనాగ మన మనఘ ప్రేరేపం
గ నెగయు వాక్కు తదనువర్తనము మనంబునకు నెవ్విధంబునఁ గలుగున్. 15

వ. అనవుడు నతండు. 16

చ. మనసు నుదానవాయువును మానిని గూడి చెలార్చు వాక్కు నా
త్మనివలనన్ భవద్వచనసమున్ జనితానుభవంబు చొప్ప నై
నను విను కార్యమున్ గుఱిచి సం దగ వాగనువర్తనంబు నే
యున వలసెన్ మనంబునకు నమ్మయి గల్గుట నట్లు సెప్పితిన్. 17

వ. అని పలికి మఱియు నమ్మహీసురోత్తముం డిట్లనియె. 18

క. మనసును [2]వాక్కును మాలో, ననఘచరిత యెక్కు డెవ్వ రని యంభోజా
సను నడిగిన నతఁ డెక్కుడు, మన మనవుడు వాణి యక్కమలభవుతోడన్. 19

వ. ఏను నీకుం గామదోహిని నయి యుండ న న్నెట్లు దక్కువగాఁ బలికి తనిన నతండు స్థావరంబును జంగమంబును నన నాకు రెండుమనస్సులు గల వందు స్థావరంబు నాయొద్దను జంగమంబు నీకడను నిలుచు భవద్గోచరత్వంబునం బరఁగువర్ణంబు మంత్రంబు స్వరంబు జంగమమనస్సుగా నెగడు దానికంటె నీ వెక్కుడు నీకంటె నెక్కుడు స్థావరమనస్సు గావున నిమ్మాట యాండం గల దానవు గా వని నిర్దేశించె. 20

క. విను మమ్మెయి నిర్దేశం,బున నవ్వాగ్దేవి మూర్ఛవోయినయ ట్లే
మిని బలుక కుండి పదవడి, వినయంబున నజుని శరణు వేఁడె లతాంగీ. 21

వ. అనిన బ్రాహ్మణి పతితో బ్రహ్మమాటకుం గొఱవోయినవాణి యేమిటం దేఱె నని యడిగిన బ్రాహ్మణుం డిట్లనియె. 22

క. ప్రాణాపానంబులయెడ, వాణి నిలుచుఁ గాన ప్రాణవాయు వొదవి త
త్త్రాణత్వ ముడిపె నది గీ,ర్వాణజ్యేష్ఠప్రభావవాసిత యగుటన్. 23

వ. ఇట్టి వని వాఙ్మనసప్రకారంబు తెలియుంగుట మోక్షంబునకు మూలం బింకను వాణీమనస్సుల తెఱంగు సెప్పెద వినుము. 24

తే. ప్రాణుఁ బొదువుట వాణి యపానుఁ జెంది
తా నుదానభూతాత్మయై తనువు విడిచి
వ్యానచేష్టిత సర్వసంగవ్యాప్తి నొంద
మనసు సుస్థితి నొందు సమానునందు. 25

వ. మనసు సుస్థితిం బొందుట ముక్తికిం గారణం బని చెప్పి వెండియు. 26

సీ. ఘోషిణి నాఁగ నఘోషిణి యన రెండు, దెఱఁగులు గలిగి వాగ్దేవి పరఁగు

1. క. బనుపడ నని. 2. గ. వాక్కును దమలో,

నం దఘ్రాణించి గర్భయని యుత్తమరసంబు, గోవుచందంబునఁ § గురియుచుండు
నవ్యయరూపక్రియాప్రభావోత్కర్షల, బ్రహ్మవాదిని యిట్లు § బ్రాహ్మవిధము
గనుట మహానందకర మని చెప్పి యప్పుడు మఱియు నర్థవ్యాప్తితోడ

తే. వినుము ఘ్రాణాదికము లైదు § మనసు బుద్ధి
యొక యధిష్ఠానమున నుండియును నెఱుంగ
వజల యొండొంటి విషయంబు § నలయికొనఁగ
ననిన వివరింపు మా తెఱం § గనియె నింతి. 27

వ. అనుటయు నయ్యవనీదేవుం డయ్యువిద కిట్లనియె. 28

సీ. గంధంబు ఘ్రాణంబ § కాని తక్కినయవి, యధిగమింపఁగ నోప § వధిగమించు
రసము జిహ్వయ యితరము లావటికిఁ గావు, రూపంబుఁ జక్షుస్సయోవు నెఱుఁగఁ
జాలునవి యెఱుఁగవు § తెలివ సంస్పర్శంబుఁ, గాంచుఁ జర్మంబ తక్కటివి గానఁ
జాలవు శబ్దంబుఁ § జాలుఁ బట్టంగ శ్రోత్రంబ యన్యమును దత్కరణమునకు

తే. వెరవు లేవు సంశయితసంవేదనంబు
మనసుకృత్యంబ యుకార్యమునకు నొండ్లు
సొరవు నిష్ఠ బుద్ధిన యగుఁ § జొరఁగ నేర
వి త్తెఱంగున కవరంబు § లెఱిఁగికొనుము. 29

ఇంద్రియమనఃపరస్పరసంవాద ప్రకారము.

వ. అని చెప్పి మనస్సునకు నింద్రియంబులకుం దొల్లి గలిగినసంవాదంబు సెప్పెద
నాకర్ణింపు మింద్రియంబులు మనస్సుతో నేము నీవు నొక్కరూప యనుటయు
మనస్సు వాని కిట్లనియె. 30

చ. చన దిటు లంట గం పెఱుఁగఁ § జాలదు నాసిక జిహ్వయుం జవుల్
గొన వెర వేదు రూపు గనుఁగొంటకుఁ గన్ను వలంతి గాదు సో
కు నెఱుఁగుశక్తి చర్మమునకుం బ్రభవింపదు శబ్దజాతము
న్వినఁ జెవి కల్ప మేనియును § నే గ్రోడఁగూడదు నేఁ దొలంగినన్. 31

వ. నిజంబుగా నేను దొలంగితినేని. 32

ఆ. అప్రయోజనంబు § లైయుండు నాఱిన, నిప్పులట్లు శూన్యనిలయములును
బోలె మీస్వరూపములు గాన మనలోన, నెక్కుడేన చూవె § యింత నిజము.

వ. అనిన విని యింద్రియంబులు మనంబున కిట్లనియె. 34

సీ. ఇంతవ ట్టిట్టిద § యు త్తైనయంతన, కలుగ నేర్పున యధికత్వ మేము
వలె గాఁగ నీ వొకవిషయంబునేనియు, ననుభవించితయేని § నధిక మగుట
గానంగ వచ్చు మాలో నొకం డడఁగిన, ననుభవింపుమ తదీయార్థ మట్లుఁ

1. గ. జిహ్వయుం జవుల్ గొన వెర లేదు.

గాక ఘ్రాణంబున । గంధంబ జిహ్వ రసంబ చక్షువున రూపంబ వినుము
ఆ. చర్మశక్తిఁ జేసి । సంస్పర్శవిషయంబ, శ్రోత్రయుక్తి శబ్దమాత్రకంబ
కాని యొంట నొంటిఁ । గబళింపఁ జాల వె, ల్లధికతాసిరూఢి । కాసపడితి. 35
క. మును మే మాలంబించిన, వెనుకఁ గదా నీకు ననుభవింప వశం బో
మనసా [1]నీ వెంగిలి కా,దనుమా యవ్విషయ మెక్కు । డయ్యెను మనలోన్. 36
క. నీ వడఁగినను బ్రాణముఁ, గావఁగ మాయందు బోధకం బగు ద్రవ్యా
బావర్తింపఁగఁ జేయుట, గావింమను నీకుఁ దెలివుఁ । గనికొను మిదియున్. 37
సీ. అట్లు గా దిట్లని । యనుశాసనము సేయుఁ, గడునేర్చు శిష్యులు । కడకుఁ బోయి
వినిపింపఁ దొడఁగి యు । ర్వీనుతార్థములు వార, లుగ్గడింపఁగ గను । నోజ్జవోలె
మముఁ గొని విషయో । త్కరము నీవు భోగ్యంబు,గాఁ జేసికొందు నీ । కలలు గన్న
యప్పుడు మా లేమి । నవ్విషయంబు బొం, కైన వాకిలి లేని । యాలయంబుఁ
ఆ. జెంది మరలినట్లు । సేద్పాటు వొరయుదు,గాక సత్యభుక్తి । గలదె నీకు
నింతవట్టుఁ గాన్పు । మేమును నీవును, గలసి పరఁగ భోగ । కలన గలుగు. 38
వ. అని యివ్విధంబున మనంబును నింద్రియంబులును సంవాదంబు సేసె నని యప్పు
రుషవరుం డావరవర్ణినితో వే ఱొక్కండు వినుమని యిట్లనియె. 39
సీ. ప్రాణప్రభృతు లగు । పవను లంభోరుహా, గర్భుని నొక్కటఁ । గానఁ బోయి
యెక్కుడు మాలోన । నెవ్వఁడు నావుడు, నవ్విభుం డెవ్వార । లడఁగ నడఁగు
దురు పెఱవార లె । వ్వరికిఁ బ్రవర్తన, మొందిన నెల్లవా । రును జరింతు
రధికు లందఱకును । నట్టివారలు మీరు, ననుఁ డని పలికినఁ । జనక నిలిచి
ఆ. ప్రాణుఁ డాది గాఁగ । [2]నందఱుఁ దమలోన,వలన నవ్విధంబు । గలుగఁ దెలుప
నాతఁ డే నెఱుంగ । నాయది యట్టిద, వినుఁడు మీవి శేష । వృత్తిభంగి. 40
తే. ఎప్పు డెవ్వరివలన నే । చొప్పు గలుగు
నవుడ వా రెక్కు డగుదు ర । న్యోన్యమిత్ర
భావమునఁ దాల్చుఁ డొండొరుఁ । బవనులార
పొరిఁ బరస్పరభావనా । పరుల రగుఁడు. 41
వ. ఇత్తెఱంగున మీకు భద్రం బగుం బొం డని పుచ్చె నట్లుపదేశించిన బ్రహ్మ
వాక్యంబుల వాయువులు సమత నొందె నని చెప్పి వాయువిషయం బైనయది
నారద దేవమతసంవాదంబు సెప్పెద నాకర్ణింపు మని బ్రాహ్మణుండు బ్రాహ్మణి
కి ట్లనియె. 42
తే. దేవమతుఁ డనువిప్రుం । డు దేవమునివ, రేణ్యుఁ డగునారదుని నొక్క । పుణ్యభూమిఁ
గాంచి వినతుఁడై యాతని । కరుణవడసి,భక్తిరసము వొంగారఁ ద । త్ప్రాంతమునకు.
సీ. అల్లన చన నాతఁ । డాదరంబున నిందు, రమ్మంచు మనుచుఁ గ । రమునఁ దావు

1. ఆ. 'నీవ యెంగిలి కా దనుమా'. 2. గ. పవనులు దమలోను.

నెఱ సమాసీనుఁడై కను వినయంబున, హస్తముల్ మొగిచి దస్రయానము గ్ర
మొఱఁగింపు పవనంబు లెంటియందును, బాయుమానం బగుజంతువునకుఁ
దొలితొలి యెద్ది దానఁ దోడ్పడు వర్తింపంగ, నవ్వుడు నారసుం డతనితోడ

తే. వాయు వెయ్యది గర్భస్థానమునకుఁ, జొనుపు జీవునిఁ దజ్జంతుజనన వేళఁ
దొలుత దాని కనంతరకలితమైన, మారుతంబు ప్రవర్తించు మఱియు వినుము.

తే. పురుషునందు సమానంబు పొలుతియందు
వ్యానమును జూవె పొడమించు వరుస నసఘ
శుక్లమును శోణితంబును జాలు గల్గ
నయ్యోగంబును విధిచెద్దు సమరఁ బొంద. 45

క. విను సృష్టశోణితంబునఁ, బను గొను శుక్లంబువలనఁ బ్రాణుఁడు దగ వ
ర్తన మొందుఁ బ్రాణశుక్లము, లనూనహేతువులుగా నపానుఁడు నడచున్. 46

క. చనుఁ బ్రాణుఁ డధోగతి నూర్ధ్వగరూఢి నపానుఁ డివ్విధము గలయీ రెం
టను నగ్నిమయోదానం,బును వ్యానంబును సమానమును వర్తించున్. 47

ఆ. పావకుండు సర్వదేవాత్మకుండు ప్రాణంబునకు నపాననామమునకు
నంతరమున వెలుఁగు నాభవ్యమూర్తి యు, దానరూప మంద్రు తద్జ్ఞజనులు. 48

సీ. విను మహోరాత్రంబులును శుభాశుభములు
సత్యానృతంబులు సదసదాహ్వ
యములును నైన ద్వంద్వములు ప్రాణాపాన
ములకు నామాంతరంబులు తదీయ
మధ్యవర్తి నొప్పు మహనీయవహ్ని యు
దానంబు దాని నిర్ద్వంద్వభావ
మాంతరయోగవిద్యాప్రవీణులు గంద్రు
పరమశాంతి యనంగ బ్రహ్మ మనఁగ

తే. నరయ భేదంబు లేదన్నయట్టు లుండు, నమ్మహావస్తువును సుదానాకృతియ య
నంగఁ జెవి యార విందుము నలినగర్భు, చేతననిదివ్యముని యిట్లు సెప్పెఁ గరుణ.

వ. అని చెప్పి యింద్రియమనఃపవనంబుల భంగులు గనుంగొనుటయు నాతత్త్వంబులకుఁ
బరమం బగు నతత్త్వంబు గనుటకుఁ గతం బై యుండు నని పలికి యద్ధరామరుం
డా రామారత్నంబును సదయంబుగా నవలోకించి యుత్తమరహస్యంబు సెప్పెద
నాకర్ణింపు మని యిట్లనియె. 50

—జీవాత్మస్వరూపనిరూపణప్రకారము.—

సీ. కరణంబు కర్మంబు కర్త యన్నీకద్వి, రాజిత కారకత్రయము చేత
నఖిలంబు నంవ్యాప్తమై యుండు ఘ్రాణాదు, లును మనంబును బుద్ధియును బ్రవరులు.
కరణహేతువు లంద్రు గంధాదివిషయసం, తతియు మంతవ్యబోద్ధవ్యములును

గర్మ హేతువు లగుఁ | గరఁవు గొనఁగ నాఁ, గాన మాటిఁగ వినఁ|గాఁ దలంప

తే. నిశ్చయము దగఁ జేయంగ | నేర్పు [1]లేదు
గలవు జీవాత్మునకు నవి | కర్తృహేతు
భూతములు [2]వాన విషయానుభూతి నతఁడు
దొఱఁగునిష్ఠలు మోక్షహేతువులు సుమ్ము. 51

వ. కరణకర్మకర్తృకారకాత్మకుం డగుజీవాత్ముండు భోక్త యగుట దక్క వివిధ విషయమూర్తు లగుహవిస్సుల నుదాసీనత్వస్రుగ్గతంబులు సేసి వేల్చునిష్ఠ నాత్మస్వరూపం బగుననలంబు ప్రజ్వలితం బయి యవిద్యాధూమరహితం బగుచుం బొలుచు నది మోక్షప్రకారం బట్లు గాక భోక్త యగునేని నట్టిద బంధప్రకారం బని నిర్దేశించి ముక్తభావంబునకు మూలం బయినయోగ యజ్ఞంబునం దేను బ్రవృత్తుండ నై యున్నవాఁడ దానికి సర్వపరిత్యాగంబు దక్షిణ దాన సకలాత్ముం డగునారాయణుండు ప్రీతుం డై స్వీకరించు నద్దాని పేరు మునులు ముక్తి యని చెప్పుదురని చెప్పి యవ్విప్రుండు వెండియు. 52

సీ. శాస్త్రమొక్కండ తద్వ్యాఖ్యానంబునవయోఁ, జరియింతు నొక్కండ | గురుఁ డతండు
చెప్పినయర్థంబు | చిత్తంబులో నుంతు, శ్రోత యొక్కండ తద్జ్ఞాతబుద్ధి
నెగడుదు నొక్కండ | వగవంగ విద్వేష్ట, వాని వ్రాల్చినదిక్కు|వ్రాలి యెడరుఁ
గడపుదుఁ గడవంగఁ | గారణ మయ్యెదు, తెలుఁగు పెద్దలచేత | నెఱిఁగినాఁడ

ఆ. వినుము దేవతలును | మునులును బరమేష్ఠి, యొద్ద కరిగి మాకు | నద్దిహితము
యనిన నావిధాత | యక్షరోపాసన, మసియోఁ గాన దుర్గ | మబల కడతు. 53

వ. ఇంక నెక్కడ గడచెద మున్న కడచితిఁ గ్రోధతిమిరంబును లోభవ్యాఘ్రంబును గామదస్యుమాషితంబును నగుదుర్గంబు గడచి యొకవనంబు ప్రవేశించితి ననిన విని యువ్వనిత యవ్వనం బెట్టిదని యడిగిన నమ్మహాద్విజుం డిట్లనియె. 54

ఉ. అంతకుఁ బిన్నలున్ వెదక | నంతకు బెద్దలు లేవు దుఃఖ మ
త్యంతముఁ జేయు సౌఖ్య మెన | లార నొవర్పఁగ నొండొకంటియుం
దంతటినేర్పు లేదు వెఱ | పన్నది యేమియు నవ్వనంబు ని
శ్చింతతఁ జొచ్చి యున్నవరుఁ | జెందరు నిర్వృతి సెందు నుగ్మలీ. 55

తే. కొన్నిటికిఁ బంచవర్ణముల్ | కుసుమఫలముఁ,లందుఁ గొన్నిటి కేకవర్ణాంచితంబు
లవనిజములుగొన్నిటికిన | వ్యక్తవర్ణ,కములులుసౌరభ్యమాధుర్యసమధికములు. 56

వ. అవ్విపినంబున. 57

క. వృక్షంబులకుం గలుగును, దీక్షాగుణములును నతిథిసత్కృతికృతియుఁ బ
ద్మాక్షీ యతిథులు బ్రహ్మాన,దృక్కులు సౌఖ్యంపునిట్టఁ | దేలుదురు మునుల్. 58

---

1. గ. లేదు కలదు జీవా. 2. గ. వానివిషయానుభూతి.

ఆ. కాలఁకాలమునను నింటికిని మేర లివి యన, రాదు గాన యయ్యరణ్యభూమి
వెలుఁగు లోఁపలి పారవృక్షనిచయము క్షేత్రజ్ఞుండు,రవి తదీయసేవకభవముఁ బాచు.
క. సమ్యగనయ బ్రహ్మసంభవ, మగుజలము వహించుచుండు నందులనదులున్
నగములు విను దానఁ దపస్విగణం బవ్యయపదంబుఁ జెందం గాంచున్. 60
వ. ఇట్టి దవ్విపినంబు, 61
ఆ. మాననీయనియతిసమహితతపోధన,వంతు లైనయట్టివారు శాంతి
దాంతినిస్స్పృహతలు దలకొన సుసమాహి,తాత్ము లై వసింతు రందుసాధ్వి. 62
వ. అని చెప్పి మఱియును. 63
సీ. వినుము మూర్ఖుఁ డవిగొన దర్శనస్పర్శ,నము లాచరింప విసనంగ నెలయ
నేమిసంకల్పంబు నెడఁ జేర్చ నిష్టార్థ, ములను ¹ననిష్టార్థములను గోరు
టయును నొల్లక క్రోధయుక్తుఁ డయినస్వభావకృ,త్యము లవిగనుఁగొంచు సబలవానఁ
బొరయ నె ట్లన్న మేల్దోరకొనుఁ గోరక,యును బోదు కీడు క్రోధించినను దీని
తే. నెఱిఁగి యేను స్వభావంబు నెడఁ బయోజ,పత్రగతజలబిందువుభంగిఁ దాల్తు
నని యొఱంగించి బ్రాహ్మణుఁ డతివతోడ, మఱియు నిట్లను శాత్రవమథనకల్య.
వ. ఒక్కయెడ నధ్వర్యునకు యతికిం గలిగినసంవాదంబు సెప్పెద నాకర్ణింపు మధ్వర్యుండు పశువుం బ్రోక్షించుచుండ యతి నిరీక్షించి యిది హింస గాదే యనిన నతండు. 65
తే. ఛాగ మిది యరయంగ నాశంబుఁ బొందద,దూర్ధ్వలోకసుఖంబుల నొందుఁగాన
శ్రుతులవాక్యముల్ నీ కెక్కసూనృతంబు, లగునయేని నీవిట్లంట యనుచితంబు.
వ. అని వెండియు నప్పశువు నుద్దేశించి. 67
క. భూతములు నింద్రియంబులు, నాతతగుణ యాత్మయోనులందుఁ గలయఁ బిం
డేతరుఁ డగుజీవుఁడు సౌ,ఖ్యాతిశయం బొందు నధ్వరాతిశయమునన్. 68
క. అని పలుకుటయును యతి యి,ట్లను ఛాగము పుణ్యగతికి నరిగెడుఁ బో యి
వ్వని నీ కెవ్విధము ప్రయో,జనంబు సిద్ధించుఁ జెపుమ సమ్యక్ఫణితిన్. 69
వ. అనుటయు నధ్వర్యుం డతని కి ట్లనియె. 70
క. ఆగమము పశువిధిం దగ, యాగ మొనర్పినఁ ద్రివిష్టపానేకమహా
భోగానుభూతిభవ్యన,మాగమ మది యనుట బొంకె యాగమవేదీ. 71
చ. అనవుడు హింస పాప మని యాగమవాక్యములంద కాదె యేఁ
గని యిటు లంటి నన్న యతిఁ గన్గొని నీవు సమాధిఁ బ్రాణరో
ధనము మనోలయంబు సుకృతంబులుగా నొనరించి వెండి యో
గనిరతిఁ బొందెదత్తెఱఁగు గాదొకొ హింస దలంచి చూడఁగన్. 72
వ. అని పలికిన నయ్యధ్వర్యునకు నయ్యతిముఖ్యుం డి ట్లనియె. 73

1. గ. ములను గోరుచు నున్కి ♦ పొందలఁ గోరు.

చ. పరమతపంబు గాఢపరిపాకము ¹నొందినఁ జిత్సుఖాత్మకా
²దురము నడచి త్రిభూతగుణజాలతనుచ్ఛరమున్ వివేకితా
పరిణతిఁ బాపి చూచి యనపాయసుఖస్థితి నాదిఁ బొల్లలం
బొరయక తోఁచు హింస యనుబుద్ధి విముక్తత గాక బోధనే                    74

చ. అనవుడు నాతఁ డార్యవచనామృత మానినవాఁడు గాన నేన్
గనుఁగొనఁ జాలు నేను బహుకార్యమునప్పుడు మీ రనుగ్రహిం
చిన క్రియఁ జూడ నేర్తుఁ జడచిద్ద్వయమున్ విభజించి దాన హిం
సనము నొకింతయుం బొరయక జన్నము సేయుదు మేలు నొందుదున్.           75

క. అనుటయు నతనికి యతి యి, ట్లనుఁ బహుయజ్ఞములకంటె ననఘ తపోయ
జ్ఞనిరూఢి మేలుగావున, వినిపింపఁ దలంచి యంటి వేయును నేలా.              76

వ. అనవుడు నమ్మాటకు నయ్యధ్వర్యుం డొండబడియె నని చెప్పి యాభూసురవర్యుం డాభామినితో నీయర్థంబున కొక్క యితిహాసంబు గల దాకర్ణింపుము సహస్రబాహుం డగునర్జునుండు దుర్జయప్రతాపంబున నఖిలద్వీపంబులు నేలి ప్రాలి తనకు నెదురు లే కున్న విజృంభించి పరశురాముం దొడరి యతనికి నత్యంతం బప్రియం బాచరించిన నతండు బహుశాఖోపశాఖాశోభితం బయినపాదపంబు నుఱుముగా నఱికి పడ నైచినచందంబునం బరశుఖండితసర్వాంగునిం జేసె నంత నిలువక తత్పుత్రులు రాజులుం గూడుకొని తదీయతనయులుం దారు నారాముని యసన్నిధి నతనిజనకుం డగుజమదగ్నిం జంపినం బెంపారుకోపంబున నాటోపం బెసంగ నాజామదగ్న్యుండు రాజుల నెల్లం దర మిడి యిరువదియొక్కమాఱు పరశుధారపాలు సేసిన నతనికిఁ బితృదేవతలు సన్నిధి సేసి.              77

ఆ. పరశురామ నీవు బ్రాహ్మణుండవు నరే
శ్వరులఁ జంప నేల వలవ దుడుగు
మయ్య యనుడు నాతఁ డట్లన కుండఁ డీ
రేను రాజపశువిధానమునను.                                              78

క. సారనియతిఁ బాటించి మహారోషాగ్ని పరితృప్త మగునట్టులుగా
వీరాధ్వరంబు సేసెద, వారింపక యుడుగుఁ డనిన వా రాతనితోన్.           79

క. యజ్ఞంబులలోనఁ దపోయజ్ఞం బుత్తమము దాని నాదరణమునం
బ్రాజ్ఞోత్తమ చేయుము సర్వజ్ఞుఁడు ప్రీతుఁ డగు శాంతరస మొప్పఁ జుమీ.      80

వ. అని చెప్పి మఱియు ని ట్లనిరి తొల్లి యలర్కుం డనురాజు మనస్స్పృష్టంబు లగునింద్రియంబుల కలిగి దివ్యాస్త్రంబులు ప్రయోగింపం జూచిన నవి యయ్యవనిపతితో నయ్యస్త్రంబులం దారు సెడు మనియును రోషావేశంబునం బ్రయోగించిన నతండ చెడు ననియునుం బలికి యేవు దేని నీతపోమయంబు

1. గ. నొందెన చిత్సుఖా. 2. జ. దురమునఁ జిక్కి భూతగణజాలతనుచ్ఛరమున్.

వైరియస్త్రంబులు[1]సంధింపు మనిన నతండు క్రోధంబు దక్కి యోగంబున శాంతి నొంది వారిం దమోగుణతత్ఫలాస్త్రసాధితంబులం జేసె నీవునుం దపంబున నంతశ్శత్రుజయసౌఖ్యం బనుభవింపుము బాహ్యశత్రుజయంబు జయంబుఁ గాఁ గొనకుము. 81

క. అని నిష్ఠించి పలుకె న,వ్వినుతచరిత్రుండు శాంతివిభవంబున నా
నినమునినుతుఁడు సాధిమా,ననవాస్త్రంబైనతపము నన మేలొందెన్. 82

సీ. అని చెప్పి బ్రాహ్మణుం డిట్లనుఁ, దొమ్మిదిగుణములు ◊ గొమ్మ కలవు
స్తంభాతిమానాహంకారంబులు సాత్త్వికములు క్రోధసంరంభములును శోక
మునురాజసంబులు మోహాతంద్రాస్వప్నములు తామసము లిట్లు ◊ గలుగురిపులఁ
దునుము నేయస్త్రంబు ◊ లను వగు వాన న,భ్యంతరశత్రుచయంబు నెల్లఁ

తే. దునిమి యేసింద్రియంబుల ◊ మనము నోర్చి
శాంతి నొంది శ్రేయస్స్వర్గసాధనం బొ
నర్చునది ముఖ్యవైరినిర్జయముఁ జేయు
నంబరీషగీతలు విను ◊ మంబుజాక్ష. 83

వ. అంబరీషుం డనురాజు రాజనీతిపరత్వంబునం బరమప్రభుత్వంబు నొంది యరాతుల నెల్ల వినతాసులం జేసి పూజ్యం బగురాజ్యంబు పరిపాలించుచుండి యొక్క నాఁడు విద్వజ్జనంబులతో ని ట్లనియె. 84

తే. అరులనెల్ల జయించియు ◊ నదిజయంబు,గాఁగొనక యున్నవాఁడ నగ్గలపుఁబగ జయింపకుస్కిఁదద్విజయవిహీనుఁదృష్ణ,జనిజరామృత్యువశగవ ర్తనునిఁ జేయు. 85

క. అంతటిలోభము గెలువక, శాంతి గలదె యని తదీయశక్తి నడఁచి ని
శ్చింతత్వ మొంది యాభూ,కాంతుఁడు సామ్రాజ్యమున సుఖస్థితి వడసెన్. 86

—•• జనకునకు విప్రరూపధరుం డైనయమునితో నైనసంవాదము. ••—

వ. అని వెండియు నవ్విప్రుం డిట్లను, జనకచక్రవర్తికి నొక్కబ్రాహ్మణునకుం గలిగిన సంవాదంబు సెప్పెద నాకర్ణింపుము జనకుండు దనకట్టెదుర బ్రాహ్మణుండు గొఱగాని సేసిన నతనితో నీవు నావిషయంబున వసియింప వలదు పొమ్మనిన నతండు. 87

క. నీవిషయ మెంతవట్టది, యే విని వరవిషయమునకు ◊ నేఁగెదఁ దెలియం
గా వినిపింపు మనుడు నా,భూవల్లభుఁ డూరకుండెఁ ◊ బుణ్యచరిత్రా. 88

ఆ. ఊరకుండి మూర్ఛ ◊ నూని యొక్కింత సే,పునకుఁ దెలిసి యిట్లు ◊ లనియె నాదు
తాతతండ్రితరము ధరణి మద్వశ్యత, నుండ నాకు మమత ◊ యొలయ దందు.

వ. మిథిల నెవ్వాఁడు వసియించెద నిప్పురంబును మదీయం బని యంగీకరింపంబడదు కావున నిది నావిషయం బన లేమిం జేసియున్న నీతో నాడినమాటం బుట్టినవగ

1. గ. సాధింపు.

పెంపున మూర్ఛ వచ్చె ననిన విని యుర్వీశ్వరుం డాభూమివిభునాననం బాలోకించి. 90

క. నరనాయక నీ యేలెడు, పురమున భూమిని సమత్వబుద్ధి గలుగ కి
స్థిరవై యుండుటకుఁ గతం, బరయఁగ నెద్ది వినిపింపు మది విశదముగన్. 91

వ. అనుటయు నజ్జనపతి యతని కి ట్లనియె. 92

తే. అరయ నివి [1]యెట్లుఁ జేసియె యనఘ నవియకాన
వినుము మద్ధన మిది యని వీనిలోన
నొకటియందు నంగీకార మొలయ దెట్టి
విషయమును నాయదియ యనుసవిధము గలదె. 93

వ. ఎట్లంటేని ఘ్రాణముఁకు గోచరంబు లయినను గంధాదులు సెవం గలయనిగా వున నాయవి యను సంస్పృటంచేసి భూమ్యాదిభూతంబులు నాచేతనిర్జితంబు లై [2]మద్వశగతంబు నొంది యుండు. 94

చ. అనవుడు బ్రాహ్మణప్రవరుఁ డల్లన నవ్వుచు నిన్ను నారయ
న్మనమున వేడ్క పుట్టి నర నాయక వచ్చితి నేను ధర్ముఁడం
బనుపమునివ్వివేకపరిపాకము గాంచెనిరూఢభావ మొం
ది నిలుచుఁగాత నీ దగుమనోదిన సతతంబును శాంతికారి యై. 95

వ. అని ధర్మదేవత జనకునకు వరం బిచ్చి యంతర్ధానంబు సేసె నని చెప్పి యాధరణీసురోత్తముం డయ్యుత్తమాంగనతో హితోపదేశంబు సేసెద నవహిత వయి యాకర్ణింపు మని పలికి యిట్లను సంసారవర్తనంబు వదల విడిచి యే నేకతంబ యున్నయెడ నీవు ప్రొద్దులి వచ్చి మదీయవైరాగ్యంబు మాన్పఁ దలంచి నాకు నధ్యాత్మబోధంబు గలుగం జేయు మని యభ్యర్థించిన నీతలం పెఱింగి యు నెఱుంగనివాఁడ పోలె నధ్యాత్మవిద్యాబోధక ప్రకారంబు లైన వాక్యంబులు సెప్పితి నే నింక లోకంబులం గలసి చరించువాఁడం గాను నిక్కపుబ్రాహ్మణుండ నయితి బ్రహ్మచారి నయితి జీవన్ముక్తుండ నయితి మిముబోఁటులకొలఁది గాననన్నుం జూచెద వదినాతెఱం గెఱుంగమి యేను జగంబు సమస్తంబును వ్యాపించి యున్నవాఁడ నాయున్నభంగికి నాబుద్ధి సకలపృథ్వీరాజ్యంబును నాకలోకాధిరాజ్యంబును సరిగా వని తలంచునాబుద్ధియు నాకు ధనంబు [3]దారువుల నగ్ని యున్నచందంబున సర్వజంతువులయందును నంతర్గత యై సిద్ధి యున్నది గురువాసగృహవాసవనవాసవకు లగుబ్రాహ్మణుల కెల్లను శ్రేయఃప్రాప్తిం దెరువొక్కండ యందఱు నుసరిత్తులుసాగరంబుఁ బ్రాపించున తెఱంగునఁ బరతత్త్వంబు నొందుదురు బుద్ధి నిమ్మార్గంబు నధిగమింప నగుఁ గాని శరీరంబున వశంబు గాదు కర్మంబు లాద్యంతవంతంబులు శరీరంబు కర్మబంధనకరం బింత యెఱుంగుదుం గాన నాహృదయంబునం బరలోకభయంబు లేదు నాచెప్పినయధ్యా

1. చ. యెల్లఁ. 2. చ. మద్వశగతంబు లై యుండు. 3. జ. తరువుల.

త్మవిద్యావిషయవాక్యంబులతాత్పర్యంబు చిత్తంబున నెఱకొలిపి భావనానిరత
వయి యుండుము నన్న పోలెను వెఱవకు మనినఁ బత్ని సాష్టాంగదండప్రణామం
బాచరించి కేలు మొగిచి. 96

సీ. నీవు సెప్పినమహనీయవాక్యనికాయ, మతిగహనం బకృతాత్ములకును
నర్థగ్రహణశక్తియసమ కల్గునె కృతాత్ముల కైనఁ [1]గ్రమ్మనఁ దెలియ వచ్చి
యుండ దయ్యెఁబుద్ధికి నుదయింపఁ బట్టైన, యట్టియుపాయంబు నాదరమున
నాకుఁ బ్రసాదింపవే కరుణాకర, నావుడు నాతఁ డన్నాతితోడ

ఆ. నరణి బ్రాహ్మణుండు గురుఁ డుత్తరారణి, తపము శ్రుతము నిర్మథనము మొనర్ప
జ్ఞానవహ్ని పుట్టు మానిని యని చెప్ప, వనిత యిట్టు లనియె వల్లభునకు. 97

క. జనవినుతచరిత బ్రాహ్మణుఁ, డనఁగా క్షేత్రజ్ఞుఁ డగుట యల్పము దోఁచెన్
మనమున నతని నరణి గాఁ, గొను టవ్వస్తువు నెఱింగి కొని పిదపఁ గదా. 98

వ. అనిన నతం డి ట్లనియె. 99

ఆ. అతనిఁ దోఁపఁ జేయునట్టిసాధనము లే, దింద్రియముల కందఁ [2]డేమి లక్ష
ణములు లేవు నిర్గుణత్వనిరూఢుం డ, హంత లేమిఁ దోఁచుఁ గాంత కనుము.

వ. అని నిర్దేశించుటయు క్షేత్రజ్ఞవిషయసంశయంబు వాసి యయ్యింతి శాంతి
బొందె నని గోవిందుండు సెప్పిన గాండీవి యాబ్రాహ్మణుండును బ్రాహ్మణియు
నెట్టివా రగుదురే వా రెచ్చటివారు వారల నా కెఱింగింపవే యని యడిగిన
నద్దేవుం డతనియాననం బాలోకించి. 101

క. నామనమును బుద్ధియును గ్ర, హామహితా బ్రాహ్మణుండు బ్రాహ్మణియు హృషీ
కామేయ మైనక్షేత్ర, జ్ఞామలవస్తు వన నేన యనియె నరేంద్రా. 102

—గురుశిష్యసంవాదంబు కృష్ణుం డర్జునున కెఱింగించుట.—

వ. అనిన విని యర్జునుం డచ్యుతునితో భవత్ప్రసాదంబున మదీయమతి యతి
విశదయును సూక్ష్మగ్రాహిణియు నయి యున్నయది పరమం బైనవేద్యం బగు
బ్రహ్మంబు నెఱింగింపవే యనుటయు నాకృష్ణుండు గురుశిష్యసంవాదం బను
నితిహాసంబు వినుము మది నీప్రశ్నంబునకు నుత్తరం బయి యుండెడు నత్తె
ఱంగున మేధావి యగునొక్కశిష్యుండు సంశితవ్రతుం డయినగురు నడిగిన
నగ్గురుండు [3]ప్రజాపతిభరద్వాజ భార్గవ గౌతమ కాశ్యప వసిష్ఠాత్రివిశ్వామిత్ర
ప్రముఖు లగుమునిజనంబు లాంగిరసుం బురస్కరించికొని విరించికడకుం జని
తచ్ఛరణంబులకుం బ్రణమిల్లి హితం బెయ్యది తత్ప్రాప్తికి సుపథం బెట్టిది
వివరింపవే యని విన్నవించిన నన్నలినాసనుండు కృపాధురీణం బైనచిత్తంబుతో
న త్తపస్విసత్తముల కెఱింగించిన తెఱంగు నీకుం జెప్పెద నవహితుండ వయి

1. గ. గ్రమ్మఱఁ. 2. క. డేమి లక్షణములు లేమి నిర్గుణత్వ. 3. క. బృహస్పతి భరద్వాజ.

యారక్షింపు మని పలికె నిట్లనియె 108

ఆ. ఆదరమ్మునఁ జగుమ సారినమోములఁ, గాంతి వింత గాఁగఁ గమలగర్భుఁ
డాతపస్విజనులఁ దయాననంబులుగల, యంగఁ జూచి యిట్లు లనియె వత్స. 104

తే. సత్యమనఁ భూతంబులు సంభవించు; నంద వర్తించు దానన యడఁగు నిదియు
ణెత్రయాత్మకసత్యచరిత్ర మమల, బుధులార సత్యంబు ప్రసిద్ధి వినుఁడు. 105

క. శ్రుతి యనఁ దప మనఁగఁ బ్రజాపతి యన సత్యంబునకుఁ బరనామంబుల్
వ్రతులార సత్యమున నన్వితమహిమ [1]మైనపరమ వేద్యము సుండీ. 106

క. కావునఁ గామక్రోధ,మానేగము లెడల విడిచి యనవరతంబున్
సేవింతురు సత్యము దృఢ,భావాకలనమున యోగపరినిష్ఠాత్ముల్. 107

వ. అది హితంబు తత్ప్రాప్తికి సుపథంబు సెప్పెద వినుండు. 108

క. చతురాశ్రమములును జరణ, చతుష్టయము గాఁగ వర్ణసముదయసంసే
వ్యత నొప్పెడుధర్మము సుం, డితులంబు శివప్రదంబు నగుపథ మరయన్ 109

వ. నాలుగాశ్రమంబులకు సామాన్యంబ యధ్యాత్మవిత్త్వంబు లేక పరతత్త్వంబు
నొంద రామి మారుతాదిత్యేంద్రప్రజాపతులకును లోనుగా నిట్టిద యధ్యాత్మ
దర్శనం బనం జతుర్వింశతితత్త్వావలోకనంబు గావునఁ దత్త్వంబులు వివరించెద.

తే. అంబరాదిభూతములు శబ్దాదిగుణము
లింద్రియము లిరుదెఱఁగు మునీంద్రులార
మన మహంకారబుద్ధు లిట్లొనరి ప్రకృతి
గలయఁ దత్త్వచతుర్వింశతికత్వ మొందు. 111

క. వినుఁడు ప్రభవవిలయజ్ఞా,నవిరాధము గాఁగ వీక్షనైజ మఖిలముం
గనిన భవమోహ మొందఁడు, గనుఁ బరతత్త్వంబు నతఁడు గతకల్మషుఁడై.

వ. అని నిర్దేశించి యద్దేవుండు వెండియు. 113

క. వ్యక్త మనిర్వాచ్యం బ,వ్యక్తము సుస్థిరము ధ్రువము వ్యాపిత్వధురా
యుక్తము కలితగుణత్రయ, శక్తి నవద్వారపుర మసాధ్యము సుండీ. 114

క. తత్సాధనంబు తద్గత,చిత్తులభత్త్వప్రసిద్ధిఁ జేయుఁ ద్రిగుణసం
పత్సాగవంత మది [2]గుణ, జిత్స్వవ్రతులైనవారిచే సాధ్య మగున్. 115

సీ. సంయమివరులార సత్త్వరజస్తమో,నామరూఢములు గుణంబు లవియు
నన్యోన్యమిథునత్వ మన్యోన్యసంశ్రయ, మన్యోన్యసంకలితానువృత్తి
భావ మన్యోన్యోపజీవనాచరణంబు, గలిగి దుర్భోధత్వగాఢభంగు
లై యుండుఁ దమము నిశ్చయమితమైనరజస్సుఁ,దన్నియమమున సత్త్వంబునడచు

తే. సత్త్వ మడఁగినచోఁ దమశ్చరిత మొనఁగు
లోభశోకసమ్మోహనిద్రాభయములు

1. గ. మైనపద మవేద్యము. 2. క. గ. చ. గుణ, చిత్స్వప్రతు.

వికృతిదుస్సహమోహప్రకృతికోప
శాఠ్యమాత్సర్యములు తమస్సంభవములు. 116

ఉ. పాములుఁ జేళ్లునుం బసులుఁ । బంధులుఁ గుక్కలు మీలుఁ గోళ్లలుం
జీమలుఁ గాకులుం గ్రిములు । జింకలు నక్కలుఁ గొంకనక్కలు
న్దోమలు నూఁకలున్ బొదలు । నోవులఁ బీడలఁ బొందువారు మున్
తామసభాగు లిట్లు మఱి । తద్విధజంతువు లెన్ని యన్నియున్. 117

క. ఇవి తామసంబు లని గుణ,నివహములోఁ గీడు వాపఁ నేర్చునతఁడు త
ద్ద్వివిధవికృతివిరసనహేం,తువివేకము గలుగఁగా నధోగతి దలఁగున్. 118

చ. బలమును శౌర్యమున్ మదముఁ । బ్రాభవమున్ సుఖదుఃఖభాగితా
కలనముఁ జెల్మిసేఁతయును । గాంతియు నొల్లమియుం బ్రతాపముం
గలహము నీర్ష్యయున్ బహువికల్పప్రభావలుఁ గామినీజనం
బులయెడ గాఢరాగితయు । బొంకును నబ్బు రజఃప్రభూతముల్. 119

చ. అవి దొలుబామునం గలుగునట్టిజనంబులు నీతు లిట్టి వి
ట్టివి యవినీతు లన్మతిపటిష్ఠత గల్గి త్రివర్గవర్తనం
బు వెరవు నొంది యర్థములఁ । బొంపిరివోవుచుఁ గామసౌఖ్యవై
భవములఁ గ్రాలుచున్ మనుజభావనిరూఢతఁ బొల్తు రెంతయున్. 120

క. రాజసగుణములకుం గల,నైజ మెఱుఁగువారు తజ్జనకవైకృతముల్
ధీజితములు గావింపఁగ, నోజ గలిగి శుభదవృత్తి । నొందుదు రెందున్. 121

సీ. సంతోషమును బ్రకాశత్వంబుఁ బ్రియమును, నానందమును గరుణాభిరతియు
క్షమయును సత్యంబు శౌచంబుఁ ధృతియు న,కార్పణ్యమును దితిక్షయు నహింస
యును నార్జవంబు ననసూయయును గ్రోధ,రాహిత్యమును నసంరంభతయును
సమత దాక్షిణ్యంబు । శ్రద్ధధానతయు న,క్రూరభావంబు హ్రీగౌరవంబు

తే. సత్త్వజాతంబు లివి పూర్వజన్మసంక,లితములై నట్టివా రహంకృతి మమత్వ
మర్థతృష్ణ [1]కామార్తి లేకతలబోధ, భరితులై యూర్ధ్వలోకవైభవము గంద్రు.

క. వినుఁ డీగుణంబు లన్నిటిఁ, గనికొని తత్తదనుషక్తి । గలుగని వాఁ డ
ప్పనిచే భుజింపఁగాఁ బడఁ, డనఘాత్మకులార మ్రింగు । నతఁ డారాశిన్. 123

వ. అని చెప్పి యప్పరమేష్ఠి మఱియును 124

సీ. వేర్వేఱ యుండవు । వినుఁడు గుణంబు ల,న్యోన్యసంకలితంబు । లగుచుఁ బరఁగు
నంగతత్వమునన । సంసారయాత్రాప్ర,వర్తనం బొనరించు । వానిలోన
నెయ్యది మిగులఁ దోఁపి చ్చెఁ దజ్జన్యంబు, లోలయుఁ బాయుటయు నొక్కొక్కమాటు
గలుగు [2]దమం బెఱుఁగ లి యధికం బైన, స్రోతస్సధోముఖస్రుతి రజస్సు

ఆ. పెరిఁగినపుడు మధ్యసరణి సత్త్వము వృద్ధిఁ, బొంద నూర్ధ్వవృత్తిఁ । బొందు వీని

1. క. కామార్థి. 2. అ. దమంబు పేర్కొని యథి.

మును [1]ప్రకారభేదములను నెఱిఁగించితి, నవి [2]నదుత్తరంబులనఘులార. 125

క. శ్రోత నృప [3]జీవగమన, హేతు వగుదశావిశేష । మీగుణమునఁ దా
నీ తెరువు నొందు నని కనుఁ, డాతతమతులార కరణ । మగు నదిత్రోవన్. 126

వ. గుణత్రయంబునం ద్రోచుటమే లది త్రోవువదునట్టివితృష్ణత్వంబు లే కుండునేని.

క. సాత్త్వికులకు దివము రజో,మత్త్వకలితవర్తనులకు । మధ్యభువనవా
సత్త్వముఁ దామసులకు నీ,చత్త్వకరాధోజగంబు । సంప్రాప్త మగున్. 138

క. ధర్మార్థకామగోచర, కర్మములకు సాత్త్వికాదిక ప్రకరవికా
రోర్ములు హేతువు లగు ని,ష్కర్మత కేతిద్వ్యభూతి । కారణము సుఁడీ. 129

క. క్రమమునఁ బ్రాణంబు నపా,నము సత్త్వంబును [4]రజస్సు । నాఁకుం జూడఁగా
యమివహులార యుదానము,తమ మిట్టుల ప్రతియు సువిదితంబుగఁ జెప్పన్. 130

క. జపమును దానము యజ్ఞము, దపమును గర్భజనచిత్తదశలను సత్త్వా
ద్యుపహితములగుటనడచుం, ద్రిపథంబుల సాత్త్వికపుగతియ మే లెందున్. 131

క. వినుఁ డెక్కువ దక్కువ లే, కనయము నెనసినగుణత్రయంబునుజూరే
వినుతావ్యక్తం బనఁగాఁ, జనుతత్త్వము శివ మచలము । శాశ్వతమరయన్. 132

క. సదసత్ప్రకారనిత్యం, బది దాని తెఱం గెఱుంగుకనాతఁడు విజ్ఞా
నదశావస్థితగుణుఁ డై, యదీనగతిఁ బొందఁ గను నిరామయపదమున్. 133

వ. అని యుపదేశించి విరించి వెండియు. 134

### మనోబుద్ధ్యహంకారాదితత్త్వప్రకారము.

సీ. అవ్యక్తమునను మహాతత్త్వ ముదయించు, నది బుద్ధి మతి ధృతిఖ్యాతి నంచి
దుపలబ్ధినామంబు । లొంది యొందును గని, విని చని కావించి । విభుత నొప్పు
దాన నహంకారతత్త్వంబునకుఁ గల్గుఁ, బ్రభవంబు వినుఁడు తద్భావితాత్మ
కంబై ప్రవర్తించుఁ । గార్యనీతుల లోక, మఖిలంబు వర్ణత్రయప్రజనితు

తే. లధ్యయనమును వ్రతమును । నధ్వరంబుఁ
దపము మొదలైనక్రియ లందుఁ । దగిలి నడచు
నెల్లఁ దద్వ్యాప్తిఁ జేసియ । యెల్ల నింత
జగము రంజిల్లు దాని తేజంబువలన. 135

క. వినుఁ డాతత్త్వంబుల నం,జనితము లగు మేదినియును । జలమును దేజం
బును వాయువు నాకాశము, ననఁగ మహాభూతములు నిరతిశయమహిమన్. 136

తే. తద్గుణంబులు నూరె గంధంబు రసము
రూపసంస్పర్శశబ్దముల్ । రూఢభంగిఁ
బరఁగునవ్విషయములఁ బ్రాల్పడ్డమనసు
గలుగుజంతువు మోహాంధకార మొందు. 137

---

1. ప్రకారభేదముల నెఱిం 2. గ. నదుత్తరంబు 3. చంద్రదివగమన. 4. గ. రజస్సునకుఁజూడఁగ సంయమి.

తే. పూజితాధ్యాత్మకము లధిభూతవృత్తి
వెలయు నధియాన [1] మంతవ్యములను నిశ్చ
యంబు నధిదైవతము [2] రుద్రుఁ డమ్మతికరుండు
బ్రహ్మ యిది వేదవాక్యనిర్ణయము తెలియఁగ. 150

ఆ. ఇట్లు దెలియనేర్చి యింద్రియంబులనింద్రి, యార్థములను భూతసార్థమును దె
మల్చి చిల్లకుండ మనసున నొదిఁగించుఁడు, తపోధనులార భవనిరాసకంబు 151

వ. అని నిర్దేశించి నిరహంకారుం డనాయుమివయులకు సూక్ష్మభావత్వసంపాదినియు
శివయు నగు నివృత్తితత్త్వం బెఱింగించెద ననుమాట [illegible] చెప్పినిరి. 152

సీ. కమఠంబు దనయంగకములనొప్పుగా, ముణుఁగ విద్వాంసుఁ డురవుగ [illegible]
గామంబుల మరల్చఁగా నొప్పఁ దీకొంచు, [illegible] తెరువు గాంచు
నింద్రియంబులు పద్మయుగోళి [illegible] నెంచు, [illegible] వది [illegible] ధనముగ
నాత్మాగ్ని వెలుఁగుభూతావలి నాత్మ[illegible], నన సూక్ష్మత త్త్వనిర్ణయము గలుగు

తే. భూతపంచకజా ధి రోగాతిశోక, సహితభోగలవాలశకాక్రియుపా [illegible]
విభులు కాముండుఁ గ్రోధుండునవిరి గెల్వ, వచ్చునప్పా యది గడవంగవచ్చు.

ఆ. మనసు మనసునందుమడఁచి యాత్మని నాత్మ, యంద కాంచునట్టియతఁడు సర్వ
విదుఁడు సకలభూతవితతియందును దనుఁ, గనుచు నుండు నిర్వికల్పకముగ. 154

తే. ఆత్మతత్త్వ మేకంబ దీపాంతరములఁ
గలుగఁ జేయు ప్రదీపంబుకరణి నావ
హించు రూపాంతరముల నయ్యేలమియును బు
ధుండు గనుఁగొని బ్రమయుక యుండు నొకట. 155

తే. ఆపరంజ్యోతిపేళ్ళు లక్ష్యముఁడు వరుణుఁ
డనిలుఁ డగ్ని సోముఁడు విష్ణుఁ డజుఁడు శివుఁ డ
నంగఁ బరఁగుశబ్దములు సన్మతులు దానిఁ
బ్రయతు లయి భజింతురు నియతులార. 155

వ. అని చెప్పి యచ్చతురాననుం డమ్మాననీయులతో మఱియు నిట్లను ధర్మంబునకు
నహింస లక్షణం బధర్మంబునకు హింసయు దేవతలకుఁ బ్రకాశత్వంబును
మనుష్యులకుఁ గర్మంబును నాకాశంబునకు శబ్దమును వాయువునకు స్పర్శం
బును జ్యోతిస్సునకు రూపంబును జలంబునకు రసంబును బృథివికి గంధంబును
భారతికి శబ్దంబును మనంబునకుఁ జింతయు బుద్ధికి వ్యవసాయంబును దదీయ
మహత్తత్త్వస్వరూపంబునకు ధ్యానంబును నవ్యక్తంబునకు [4] సాధుత్వంబును
యోగంబునకుఁ [5] బ్రవృత్తియును జ్ఞానంబునకు సన్న్యాసంబును లక్షణంబులు
లక్షణజ్ఞానంబు పరతత్త్వపరిజ్ఞానంబునకు హేతుభూతంబు. 157

1. గ. సంకల్పములను 2. గ. వేధయస్మృతి 3. చ. గనఁగఁజేయు 4. చ. సమత్వంబును. 5. క. చ. ట. వృత్తంబును

ఆ. జ్ఞానపూర్వకమైన సన్న్యాసకలనంబు, పరమగతి నొనర్చు భవ్యులార
ద్వంద్వరహితుఁ డైన నతని జరామృత్యువుని, దరణకరణ మైన ధర్మ మిందు 158

—•• అవ్యక్తనామతత్త్వనిరూపణప్రకారము. ••—

సీ. అవ్యక్తనామకం బగుతత్త్వ మరయ సలింగంబు పురుషుఁ డలింగుఁ డతఁడు
క్షేత్రంబు నెఱుఁగుట క్షేత్రజ్ఞుఁ డనఁ జను, క్షేత్రంబు నాఁగఁ బ్రకృతియ సంగ
నవ్యక్తమునకు నామాంతరంబులు గుణ, ప్రభవమాతత్త్వమ ప్రభువు గుణము
లెఱుఁగవు చేతనాహీనముల్ గాన యయ్యంతరాత్ముఁడు తత్క్రియా ప్రపంచ
ఆ. మెఱుఁగు నిట్టు లగుట యెఱిఁగి గుణమ్ముల, విడిచి నిలిచి తత్త్వవేది యంత
రాత్మవేశనమున నచలనిరామయా, వ్యయపదంబు నందు ననఘులార. 159

వ. అని వెండియు. 160

సీ. జ్యోతిస్సులందు వర్యుఁడు రవి భూతంబులం దగ్ని వరుఁడు విద్యలఁ బ్రధాన
సావిత్రి దేవతాసమితిఁ బ్రజాపతి, ఘనుఁడు వేదముల ముఖ్యంబు ప్రణవ
మనిఁ జయమ్ము నప్రాణ[1]మగ్ర్యము ఛందములకు గాయత్రి యగ్గలము పశువు
లకు మేటి యజ ముఖలచతుష్పదములకు, ధేనువు మిక్కిలి మానవులకు
తే. బ్రాహ్మణుండు వరిష్ఠుండు పక్షులందు, శ్యేన మధికంబు యజ్ఞవిధానములహు
తంబు పెద్ద యుగములఁ గృతంబు మేలు, ధాతువర్గములోన నుత్తమము పసిఁడి.

సీ. యవ లోషధులలోన నన్నంబు భక్ష్యభోజ్యములందు జలము పేయములలోన
నమరాచలము పర్వతములలోఁ బ్లక్షంబు, తరువులలోన నూర్ధ్వంబు దిశల
జాహ్నవి నదులందు సాగరంబు సరస్సు, లందు గృహస్థత్వ మాశ్రమముల
నెక్కుడరయ నెక్కు డేను ప్రజాపతులం దంచితాత్మకుండనై యట్టి
తే. విష్ణుఁ డెక్కుడు నాకంటె విను తెలియ, నీశ్వరుఁడు దేవతావలి కెల్ల నెక్కు
డతఁడు నా నేనఁగ విష్ణుఁడనఁగ వస్తు, వొకఁడ మూర్తిత్రయంబున నుల్లసిల్లు.

క. నెఱయఁ బ్రధానపదార్థము, లెఱుఁగుట పరిబోధమూల మెఱుకల కెల్లన్
మెఱుఁగిడుట మమ్ము మువ్వుర, గుఱుకొని యొక్కఁడుగ నెఱిఁగికొనుట దలంపన్.

క. దివసము రాత్రియు నంబోరిఁ, బ్రవర్తనముఁ బొందుచుండు పగిది సుఖసం
భవదుఃఖజననములు జంతువులకుఁ గలుగు వల దుబ్బ [2]దురపిల్లంగన్. 164

తే. పొదలుఁ దఱుఁగుటకై పొడ [3]వొదవుఁ బడుట
కై [4]కడను జేరుఁ బాయుటకై జనించుఁ
బొలియుటకు నై సుఖంబును బొందు దుఃఖ
మందుటకు నై పదార్థము లఖిలములును. 165

క. జ్ఞానము సవిశేషస్థితి, దానికి నాశంబు లేదు దానిఁ దెలియుటన్
మానాహంకృతిమమతలు, మానిననిర్మలుఁడు మోక్షమార్గముఁ గాంచున్. 166

1. చ. మాద్యము. 2. జ. దురపిల్లంగన్. 3. జ. వడుగు. 4. కడం జేరు.

వ. అని వివరించి యానసమంచితాచారులతోడ నాశ్రమప్రకారంబు లెఱింగించెద
నని పలికి యిట్లని యుపన్యసించె. 167

సీ. గురునకుఁ బ్రియహితకరుఁ డయి వేదాధ్యయనం బొనరించుచు[1] నశన మమల
భిక్షఁ గొనుచు ద్వివిధలాఞ్ఛనంబులలో నొకటి ధార్యముగఁ జేసి
స్నానశీలుఁడు బ్రహ్మచర్యపరుండును నియమితేంద్రియుండును నిత్యశుచియు
యజ్ఞోపవీతియు నజినాంబరధారియు మేఖలాధరుండు నై శయనాసనప్ర

తే. చారవిధములు సముచితా[3]చరితములుగ, నత్యధర్మనిరూఢుఁ డై శాంతి గలిగి
వేల్మి యిరుసంజలు నడపుచుఁ గల్మషంబు, లడఁచుచు వర్తించు బ్రహ్మచారి.

సీ. అగ్నిహోత్రపరుఁడు నమావాస్యకుం డయి పరదారవిరతుండును నిర్మలప్ర
చారుండుఁ బంచయజ్ఞపరుండు నతిథిప్రియుండును శుక్లవస్త్రావృతుండు
శక్త్యనుగుణదానశాలియు నచపలేంద్రియుండును శుచియు మైత్రీపరుండు
స్వాధ్యాయశీలుండు సంతతప్రసన్నుండు నై యాజనంబు నధ్యాపనంబు

ఆ. శక్యమైనఁ జేసి కూడు గల్గి సత్ప్రీతి, గ్రాసా మొనర్చి మిత్త్రహితు లనక
మాటకార్యమునను మధ్యస్థుఁడై గృహస్థుండు నడచు మరితమారుఁ డగుచు.

సీ. గ్రామంబు దొలఁగి యరణ్యస్థలంబునఁ
బర్ణశాలావాసపరత నొంది
స్నానతంత్రము రెండుసంధ్యల నడపుచు
బ్రహ్మచర్యవ్రతాభాసి యగుచుఁ
బూరిపంటలు ఫలంబులు మూలములు శాక
సముదయంబును నశనముగఁ గొనుచు
నజినంబు వల్కల మంబరంబుగఁ గొని
శయనకృత్యంబు భూస్థలి నొనర్చి

తే. యతిథులకు నెడ మిచ్చి యాహారములను
భక్తి నాత్మీయములలోనఁ బంచి పెట్టి
యధ్యయనహోమశీలుఁ డై యన్ని యింద్రి
యముల గెలిచి వానప్రస్థుఁ డతిశయిల్లు. 170

క. ఈమూఁ డాశ్రమములలో, నేమిట వర్తించువారలేనియు ముక్తిం
గామించినఁ జొరఁ దగు వి,ద్యామూలాచార మైనయత్యాశ్రమమున్. 171

సీ. సర్వభూతదయానుషంగంబు గలిగి య,తీతవస్తువులఁ జింతింప కెద న
నాగతంబులమీఁద నాస సేయక వర్త,మానలబ్ధము లుపేక్షతో నిరూఢిఁ
గూర్చు చంగంబులఁ గూర్మ మొట్టుట్ల యిం,ద్రియముల లోనికిఁ దిగిచికొనుచు
సముచితకాలభిక్షాచర్య గొరకొన్న, యంతన నిజదేహయాత్ర నడపి

1. చ. నన్నమమల. 2. చ. జరించుచు. 3. గ. చారములుగ, నాచరించుచు స్త్రీజనత్యాగ మొంది, వేల్మి:

తే. ప్రప మాచ్ఛాదనంబు దర్భలంగ నెవ్వఁ, డర్థి నెయ్యది యిచ్చిన నందకేక
వారిభోజి యగుచు సమస్తకాంక్ష, మతినిరాకృతిరహితుఁడై మతి వెలుంగు.
క. అనసూయయు సంతోషం, బును దమమును బ్రహ్మచర్యమును ఋజుభావం
బును సత్యంబు నపైశున, మును నహింసయుఁ జూరె యతికి ముఖ్యవ్రతముల్.
తే. వృక్షమూలనదీతీరవిజననిలయ, విపినగిరిగుహానిత్యవివిక్తదేవ
సదనవాసియై కాలోత్ప[1]సాధ్యవస్తు,సంచయనము లుడిగి యతి సంచరించు.
క. తనమేలు ప్రకాశింపక, తనుఁ గనుఁగొనుసజ్జనులు లుపాసీనతమై
ననిశీకిఁ దగిమెసుచుండం, బున వర్తించుయతి సర్వసముత్వత నొందున్. 175
వ. అని యెఱింగించి మఱియును. 176
సీ. సన్న్యాసన మనఁ దపశ్చరణంబుపేరు త, పోజ్ఞానము క్రియాప్రబుద్ధులైన
జనము లచింత్యం బజర మమృతంబు నా, వెలుఁగుతత్త్వము గంధ్రప్రవీతతామ
సము నవధూతరాగజనము నై శుద్ధస, త్త్వాశ్రయం బగుహృదయంబు గలుగు
వారు తపోవృత్తివలన సుక్షేమమార్గంబున నడతు రేకత్వశోభి
తే. మహితనానాత్వ మనఁగ సమస్తభూత
సముదయస్థమై యున్నతత్త్వము ప్రకాశ
మగుట నఖిలగతులఁ దోఁచునవ్యథంబు
గలుగుబుధుఁడు నిర్ద్వంద్వుఁడై కాంచు ముక్తి. 177
వ. అవ్యక్తప్రభవంబును బుద్ధిస్కంధంబును నహంకారవిటపంబును మహాభూతో
పశాఖంబును నింద్రియకోటరంబును [2]సంతతాశాపల్లవంబును శుభాశుభఫలం
బును నై సంసారవృక్షం బొప్పుచుండు. 178
క. జ్ఞానాసి నది నఱికి యభి,మానాహంకారమార్గమతి యగుపురుషుం
డానంత్యము ప్రస్ఫుటముగఁ,గానంగా నేర్చు విగతకల్మషులారా. 179
ఆ. నిమిషమైనఁ బరమనియతి నాత్మని నాత్మ
యుంప కనినఁ దెలివు [3]నారఁ బడసి
బోధమహితముసలపొందునవ్యయగతిఁ
బొందఁ గంద్రు ప్రకృతిపొందు దొఱఁగి. 180
ఆ. వరమనియతి యనఁగఁ బ్రాణసంయమనంబ, యది క్రమాభివృద్ధి నలవరింప
గాఁ బ్రసాదసిద్ధి గలిమిఁ ధుృవం బవ్వి, శేషకలన మిష్టసిద్ధిఁ జేర్చు. 181
క. అవ్యక్తతత్త్వజాతము, భవ్యము సత్త్వంబు దురితపంకహరం బై
యవ్యయ మమృత మనింద్రియ, భావ్యం బగుతత్త్వ మొందఁ బ్రాఁకగుఁ జుండీ.
వ. కావున,
తే. సత్త్వభావనకంటెఁ బ్రశస్తమైన, కృత్య మరయంగ లేదండ్రు నిత్యవస్తు

1. గ. కాల్యస్తు. 2. గ. సంతతవర్ణపుష్పంబును; చ. సంతతశాద్వలంబును. 3. నభరి భారు.

సమ్యగధిగమసిద్ధికి సంయమప్రసిద్ధు లాగమతంత్రప్రసిద్ధులార. 184

క. వినుఁడీ సత్త్వముఁ బురుషుఁ, గనుఁగొను టనుమానములనఁ గాని మనమున ద
క్కిన తెఱఁ గెయ్యది నైనం, గనుఁగొనియెడు నుపాయ మెవ్వరికిఁ గా కుండుఁ జూఁడీ.

సీ. ఇట్లగు నట్లని యెఱుకలేని సత్త్వంబు, సంతోషమును నహింసయును ధృతియు
శమము నార్జవమును సన్న్యాసమును బరి, త్యాగంబు విజ్ఞానయోగదశయు
సాత్త్వికంబులు వస్తుతత్త్వవిజ్ఞానము లీ, యనుమానములఁ బురుషాధిగమముఁ
బడయుట యొప్పు నీ ప్రకటమగుప్రసత్త్వంబు, బురుషుని నొక్కఁ డనుబుద్ధి గొంద

తే. ఱార్యు లాడుదు రట్ల యనుచు నిందు
రమున మఱి యిట్లు వారి భేదము దెలిసి
యట్లు సత్త్వంబునం దంతరాత్మ యుండు-
గాక యని యెఱుఁగువాఁడు కైవల్యము గలఁడు. 186

వ. అనిన విని యమ్మునులు మహాత్మునితో ధర్మంబు లనేకవిధంబులు వీనిలో నెవ్వం
డెయ్యది యవలంబించె నదియ వాని కుచితంబు నేఁ దమ్మింటిమీఁద నుంబరఁగిన
బుద్ధులు గలిగి యనిశ్చయదర్శనుల మయి యున్నవారము మిగిలి ప్రధానానుష్ఠేయం
బని యుపదేశింపవలయు సత్త్వపురుషసంబంధప్రకారంబును బ్రస్ఫుటంబుగా
నెఱింగింపు మనుటయు వారికి వారిజాసనుం డిట్లనియె. 187

సత్త్వం బపవర్గ్యస్థేయంబుగా నిరూపించుట.

సీ. సకలధర్మములలోఁ సర్వభూతాహింస, మేటి యహింసాసమేతుఁ డైన
వానికి నుత్తమస్థానోదయం బగు, నది మోక్ష మొనరించు ననఘులార
కోరికమెయిఁ గర్మకారి యయ్యెడువాఁడు, పొందు గతాగతంబుల ఫలాభి
లాషంబు లేక నిర్ద్వంద్వత మే లాచరించిన ముక్తి సిద్ధించు వినుఁడు

తే. విమలు పురుషుండు సత్త్వంబు విషయ మిట్లు
భోక్తృభోజ్యత్వసంబంధమునఁ బొసంగి
యుండియును బద్మపత్త్రపయోలవంబు
కరణి నలఁడు తత్సంగంబుఁ బొరయకుండు. 188

క. సత్త్వము ప్రదీప మాపర, తత్త్వముఁ గాంచుటకుఁ గాన తత్త్వాధ్వతా
[1]తత్త్వము వదలక చిత్తసుఖత్త్వాకలిత మగు నెలవుఁ గందురు కృతాత్ముల్. 189

చ. అది సమపాయ మెయ్యదియు నపాయముఁ నుగ్రత లేమి నెప్ప ద
భ్యుదయము దూరమార్గమునఁ బొందెడు భద్రము వాహనాఢ్యుఁడుఁ
నది నెఱి నుత్తరించి కనునందము నౌసహితుండుఁ గాంచునొ
ప్పిదము వినాధనుం డయినఁ జేటు లొందఁగ నేర్పుఁ జెప్పఁడా. 190

ఆ. ఇట్టు లగుట యెఱిఁగి యెఱిఁగియేనియును నెఱుంగ కేని బలిమిఁ దెలుచు గడిగి

1. క. పత్త్వము...చిత్తసుఖ.

చేయుపని ఫలంబు సిద్ధింపకుండుట, కొలఁదిఁ బోక దుఃఖములును గలుగు. 191

క. స్థలపథమునఁ బోతమ్ము, జలమార్గమునందు వాహనము వినియోజ్యం
బులు గా విమ్మెయి సాధన, కలనవిభాగజ్ఞుఁ డైనఁ గడచు దురితముల్. 192

వ. అని చెప్పి. 193

తే. తటినిఁ దగ నుత్తరించునంతకును బోత
మాదరించి తత్కూల్లనియట్టు పురుషు
దర్శనము సంభవించునంతకును సత్త్వ
మాది విడువఁ దత్సంబంధముడుగుఁ డనియె. 194

వ. ఇట్లుపదేశించి మఱియు నిట్లను నవ్యక్తంబుగుణంబు మహత్తత్త్వంబు మహ
త్తత్త్వగుణం బహంకారం బహంకారగుణంబులు మహాభూతంబులు మహా
భూతగుణంబులు శబ్దాదు లం దాకాశంబునకు శబ్దంబు గుణంబు వాయువునకు
శబ్దస్పర్శంబులు గుణంబులు తేజస్సునకు శబ్దస్పర్శరూపంబులు గుణంబులు జలంబు
నకు శబ్దస్పర్శరూపరసంబులు గుణంబులు పృథివికి శబ్దస్పర్శరూపరసగంధం
బులు గుణంబులు శబ్దంబు మృదుఖరాదిబహువిధభేదంబులు గలిగి యుండు
స్పర్శంబు శీతోష్ణముఖ్యవివిధప్రకారంబులం బరఁగు రూపంబు శుక్లకృష్ణ
ప్రభృతినానావిధంబులం జను రసంబు మధురతిక్తాదిప్రచురభంగుల నడచు
గంధంబు సురభితీక్ష్ణప్రముఖానేకవిశేషంబుల వర్తించు నిట్లు పెక్కుచందంబులం
జెల్లువిషయంబుల తెఱం గెఱుంగుట వానిఁ దొలంగుటకుం దోడ్పడం జాలు
నని చెప్పి వెండియు. 195

ఆ. భూమిముఖచతుష్కమునకంటె దివి యహం, కారతత్త్వ మంతకంటె దాని
కంటె బుద్ధి బుద్ధికంటెఁ బ్రకృతి యొక్కఁ, డన్నిటికిని బురుషుఁ డధికుఁ డరయ.

క. భూతములతారతమ్యము, చేతోగతి మైనయట్టిశిష్టజనము ప్ర
ద్యోతితుఁ డగుపురుషుఁ గని ని, రాతంకావ్యయపదంబు ప్రాప్తింపఁ గనున్.

సీ. పంచభూతంబులఁ బరఁగింపఁ గుదియుంపఁ, జాలుదక్షత వాని నేలు ప్రభుతఁ
దవరు మనంబు రథ్యముల సారథి యట్టు, లట్లింద్రియంబులఁ నాఁగ నడప
నదియ వలంతి భూతాత్మకంబును బుద్ధి, నన్నామమును మనస్సారథికము
నింద్రియాశ్వము నైనయాద్యరథంబున, నభిమతగతి నంతరాత్ముఁ డెందు

తే. నెలమివర్తించు నిట్లగుటెఱుఁగుబుధుఁడు, ఘోరసంసారమోహవ్యాగురకులోను
గాక నిర్గుణపథమునఁ గ్రాలి కను ని, రామయము నవ్యయంబును నగుపదంబు

వ. అని పలికి మఱియును. 199

క. శరనిధితరఁగలభంగిం, బోరిఁబోరి నవ్యక్తమునన పుట్టు నడంగుం
సురవరధరణీరుహముఖ, చరాచరానేకభూతజాలము లెల్లన్. 200

క. అవ్యక్తాదికసకలము, నవ్యయుఁ డగుపురుషుఁ డాశ్రయంబుగఁ బరఁగుం

సువ్యక్తంబుగ నిది గను,భవ్యులు వడయుదురు మోహబంధవిముక్తిన్. 201

క. విను డక్కనుటకు మూలం, బనఘం బగుతపము యట్టి యతివిఘ్న దపో
ధనసమ్యగ్విధసముపార్జనం బవశ్యంబు వలయు సన్మతులారా. 203

సీ. భూరితపంబునం బ్రజాపతుల్, బహువిధసృష్టినిర్వాహణనిపుణు
లైరి వన్యంబు లాహారంబులుగఁ దప, మాదరంబునఁ జేసి కాదె మునులు
కాలత్రయంబు లోకత్రితయంబును, గాంతురు విద్యల గౌరవంబు
లొందవుఁ దపంబున నొండువిధంబులఁ, బడయంగ రానివెల్లను బదంబు

తే. లచ్చమైనతపంబున వచ్చుఁ బడయ, బ్రహ్మవధమద్యపానాదిపాతకంబు
లెల్లఁ బాయుఁ దపఃకృతి నిద్ధతపము, పేర్మి సర్వభూతంబులఁ బ్రీతిఁ బొందు.

క. మమతాహంకృతిసహితత, పమునఁ బ్రజాపతిసమీపభవ్యస్థానము
యమి వొందు నిందు సందేహ, మొకింతయు లేదు నిర్మలాత్మకులారా. 204

క. మమతాహంకారవిముక్తము శుద్ధము నైనయచలితధ్యానముతో
సమవేతం బగుతపమున, యమి గను సకలోత్తరావ్యయపదప్రాప్తిన్ 205

వ. అని చెప్పి వెండియు. 206

క. తమము రజస్సుఁ దొలఁగి స, త్త్వమునన రమియించి యగుణత్వము గని స
త్త్వము నదిగవిడుచు నైరా,గ్యమహితుఁ డగు మునిపదం బగుఁ గల్మషులారా. 207

క. పరమం బనంగ వేదాం,తరహస్యాత్మత వెలుంగు తత్త్వము నిక్కం
బరయంగ క్షేత్రజ్ఞుఁడ యను,పరిణతి గలయతఁడు సర్వవిదుఁడు సుండీ. 208

క. వృత్తివిశేషమునఁ జనిన,చిత్తము వెనుకఁ జని యందుఁ జేర్చి మనసు దా
నెత్తెఱఁగునకుం దివియమి, యుత్తమపురహస్య మండ్రు యోగమున మునుల్.

క. వినుఁ డవ్యక్తాంతం బగు,పని యెల్ల నవిద్య నొలయు బంధము మమతం
బనుపడిన మృత్యు వమృతం,బనఁ జనునది నిర్మమత్వ మారఁ గలిగినన్. 210

సీ. కర్మముల్ మేలండ్రు కర్మతత్పరులు బు,ద్ధాత్ములు విద్య యర్థ్యత నుతింతు
రవి షోడశవికార యగుమూర్తిఁ గల్పించు,నది నిత్యుఁ డగ్రాహ్యుఁ డవ వెలుంగు
పురుషునిఁ [1]దోఁపించు నరయంగఁ గర్మము,యత్వంబు లేమి విద్యామయత్వ
మతనికి నైజమై యతిశయిల్లుట శ్రుతి, సాటు నిత్తెఱఁగు సుజ్ఞాన మేమ

తే. హాత్మునకుఁ గల్గి యుండు నయ్యార్యవర్యుఁ
డఖిలసంకల్పములఁ బాచి యాత్మ నాత్మ
యంద కాంచి యనామయ మజర మమృత
మనుపదమ్ముఁ బ్రాపించుఁ గృతాత్ములార. 211

వ. [2](అని యిట్లు కమలగర్భుండు.) 212

క. జ్ఞానపరినిష్ఠితాత్మకు, లైనవిముక్తివదనిర్ణయజ్ఞులచేన

1. దోఁతెంచు 2. ఈవచనము పెక్కిటఁ గానరాదు.

మ్మానిత యగుగతి యిది [1]క,ర్మానుగతివిరక్తజనసమంచితసుండీ. 213
వ. అని నిర్దేశించి వెండియు. 214
క. కోరికలకుఁ గోరక యసం,గారూఢత గలిగి యెల్లయందును సమతం
గూరినచిత్తంబులు గల,సారాత్మకు లీపథమునఁ జనుటకు శక్తుల్. 215
క. చెప్పితి సర్వంబును నీ, [2]చొప్పున నడవుఁ డెడ నొందు సౌరనీకుఁడు మీ
రొప్పుచు తెరు విది దీనం, దప్పదు పరమపదసిద్ధి ధార్మికులారా. 216
క. అని యిట్లు కమలగర్భుఁడు, మునులకుఁ దత్త్వోపదేశమును జేసిన వా
రనవద్యసమాధికులై, యనితరసులభ మగుసౌఖ్య మందిరి వత్సా. 217
వ. అని పలికి గురుం డశిష్యునితోడ. 218
క. నీవును నివ్వాక్యంబులు, భావంబున నెలవుకొలిపి [3]పరమసమాధి
శ్రీ వాటింపుము నిత్యప,దావాప్తి ఫలించు నీ కనాయాసమునన్. 219
క. అని గురుఁడు ప్రబోధించిన, మనమునఁ దెలి వొంది తత్సమంచితమార్గం
బున నడచి పొందె శిష్యుం, డనామయం బజర మమృత మనియెడుపదమున్.
చ. అని వసుదేవసూనుఁడు సమాదర మేదురచిత్తవృత్తిఁ జె
ప్పిన విని వారియుల్లములఁ బెంపిటు లుండునె వార లెవ్వరో
వినుటకు నాదుడెందమున వేడ్క జనించె నెఱుంగఁ జెప్పవే
యనుటయుఁ బార్థుమోముఁ గృప నమ్మహితాత్ముఁడు చూచి నవ్వుచున్. 221
క. అనఘ విను మే గురుఁడ నా,మనంబు శిష్యుండు విమలమానస నీపైఁ
బనుపడు ప్రీతిం జెప్పితి, ననితరసులభాతిగుహ్య మగునిప్పదమున్. 222
క. విమలము నచలము నగుచి,త్తము నాదెస నేకభక్తితత్పరముగఁ జే
యుము నిత్యము నీయధ్యా,త్మము ననుసంధింపు పాసెదవు దురితములన్. 223
క. సమరమునప్పుడు నీ కీ,యమృతపదప్రాప్తిహేతు వగుసమ్యగ్బో
ధము వివరించితి నచలత, రమింపు మిం దెపుడు శమధురాధుర్యుఁడవై. 224
వ. అని యిట్లు కృష్ణుండు జిష్ణున కధ్యాత్మవిద్య వివరించె నని చెప్పినఁ బరమగురుం
డును విశిష్టశిష్యుండును నగునప్పురుషవరులు మఱియు నెవ్విధంబునం బ్రవర్తించి
రాకర్ణించుకౌతుకంబు నామనంబున నెనకం బెనంగెడు మునీంద్రా యెఱింగిం
పవే యని యడుగుటయు. 225
చ. పరమదయావిధేయ పరిపాలితవేదకలాప [4]పక్వని
ర్భరశమనాత్మతాతనువిభాసిత పన్నగతల్పభూషణా
దరభరితా పవిత్రపదతామరసస్మరణా పరాపర
త్వరహిత పద్మజాదిసురవందిత పశ్చిమనాళనందితా. 226

1. గ. కర్మానుమతివిరక్తి. 2. గ. చొప్పునడవుఁ డెడయనొందు. 3. జ. పరమసమాధిన్ శ్రీ. 4. గ. పక్వనిర్భర.

క. వినుతచతుర్వర్ణకనం, జనకముఖభుజోరుపాద । సంవిదఖేదా
మునిహృత్కమలమరాళా, జననమరణవారణచరణ।సరసిజలీలా. 227

మాలిని. పదవమదమరాళీ । భక్తసంపోషశాలీ
విదళితసురవైరీ । విశ్వలోకైకధారీ
మదరహితహితైషీ । మాన్యయోగప్రతోషీ
నదవనవరచిత్తా । సర్వనిర్మాణవేత్తా. 228

గద్యము. ఇది శ్రీమదుభయకవిమిత్ర కొమ్మనామాత్యపుత్ర బుధారాధనవిరాజి తిక్కనసోమయాజిప్రణీతం బయిన శ్రీమహాభారతంబునయశ్వమేధపర్వంబు నందు ద్వితీయాశ్వాసము. 229





హరిహరనాథాయ నమః.

# శ్రీమదాంధ్రమహాభారతము

## అశ్వమేధపర్వము, తృతీయాశ్వాసము.



నగసుతాత్మమహితవి
ధానుతశశ్వల్లసల్లతావేష్టనహే
లానిత్యశాడ్వలతరు
త్వానుగుణఫలప్రదత్వ హరిహరనాథా. 1

తాను ద్వారక కరుగవలయు నని యర్జునునిఁ గృష్ణుఁ డడుగుట.

వ. దేవా వైశంపాయనుండు జనమేజయున కిట్లనియె నట్లు ఫల్గును నఫల్గువిద్యావిశారదుం జేసి శౌరి యతనితోడ. 2

క. నాచిత్తము వసుదేవునిఁ, జూచుట గోరియును నీవు సుమనోవృత్తిం
జూచి యనుమతి యొనర్చుట, వేచినయది నన్నుఁ బుచ్చవే ద్వారకకున్. 3

చ. అనవుడు నక్కిరీటి దగ నయ్యదువంశవరేణ్యుతోడ ని
ట్లను నటు లేనిఁ బో వలయు హాస్తిపురంబున కిత్తెఱంగు సె
ప్పిన నిను ధర్మనందనుఁడు ప్రీతిగ నందుల కన్పి పుచ్చు న
య్యనుమతి గల్గునట్లు దగ నాడెద నవ్విభుపాల నచ్యుతా. 4

వ. అనిన విని దామోదరుండు దారుకు రావించి రథంబు పూన్చు మని నియోగించె దదనంతరంబ ధనంజయుండు దమతోడం జనుదేరం దగుపరివారంబు సమకట్టం బడవాల్గం బనిచె నొక్కింతసేపునకు దారుకుండునుం దేరాయితంబు సేసి తేరం బడవాల్చినం బరిజనంబుల సన్నద్ధులం గావించి సన్నిహితుం జేయ నాకృష్ణార్జునులు ప్రయాణోచితాలంకారాలంకృతులై రథం బెక్కి కరినగరంబుపథంబు గైకొని చనువసమయంబున. 5

సీ. వినయ మారంగ గోవిందున కిట్లను, గాండీవి దేవ నీకరుణఁ జేసి
కౌరవసైన్యసాగర ముత్తరింపంగఁ, గంటిమి గురుభీష్మకర్ణముఖ్య

దుర్జయవీరులఁ గనిర్జించితిమి నీవు, శాత్రవయోధులఁ గనమయఁ జేయ
వెనుక నేము జయంబుఁ గొనుచుండఁ గీర్తి తేజంబును బేరు సౌఖ్యంబు నతుల

తే. మైనభవదీయసుప్రసాదాతిశయము, గలుగఁ బడసితి మప్రతిహతమహార్ధి
రాజ్యసంపూజ్యుఁ డయ్యె ధర్మజుఁడు సంప్రీ, తాభిరక్షణవ్రతనిరతాంతరంగ. 6

క. నీమహిమ వొగడఁ గొలఁదియె, దామోదర విశ్వసంవిధాతవు భవదీ
యామలతేజము యగ్నిష్ఠో మను కాలాత్మకత్వశోభివి కృష్ణా. 7

క. భవదీయశ్వాసమ వాయువు నీక్రోధము ప్రసాదయోగంబును మృ
త్యువు లక్ష్మియు నీవలనన, యవుఁ బ్రీతియు మరణమును మహానందంబున్. 8

క. స్థావరజంగమమయజగ, దావిర్భావస్థితిక్రియావిలయంబుల్
నీవలనన యగు చూడను, భావాతీతుఁడవు సర్వపతివి ముకుందా. 9

వ. అని వెండియు. 10

కృష్ణార్జునులింద్రప్రస్థమునుండి హస్తినాపురంబునకు వచ్చుట.

క. నారదదేవలకౌశిక, పారాశర్యాదిమునులకు పలుకుల భీష్మో
దారవచనముల నిను సభ, నారా యే నెఱిఁగి యుందునను సకలముగన్. 11

వ. కావున. 12

క. నావలనికరుణ పెంపున, నీవు ప్రసాదించినట్టి నిరవద్యకవి
ద్యావిస్తారంబున దృఢ, తావిశదమగ రచించెదను గ్రతుపురుషా. 13

వ. అని యిట్లు సభక్తికంబుగా సంభాషణంబు సేసిన వాసుదేవుండును వితతా
దరవాక్యంబుల నభినందించె నప్పురుషవరు లిట్లు సల్లాపంబులు సేయుచుం
బోయి తమరాకకు సమలంకృతం బైనసామజపురంబు ప్రవేశించి ధృతరాష్ట్ర
మందిరంబునకరిగి యక్కురువృద్ధుని గాంధారిని బ్రణామవినయవిశే
షంబులం బ్రీతులం జేసి కుంతీసమారాధనం బాచరించి విదురధౌమ్యయుయుత్సు
సంజయులదర్శనంబులు సముచితప్రకారంబుల నడపి కౌంతేయాగ్రజు నత్యంత
భక్తిపూర్వకంబుగా సముచితవిధంబునం గాంచి తదాలింగనాద్యాదరణం
బులు వడసి రవ్వద్మనాభుండు నాఁడు సవ్యసాచిసదనంబున నతనిచేయు
పూజావిధానంబుల మానసం బలర వసియించి మఱునాఁడు మహనీయాస్థాన
మండపంబున నున్న యన్నరేంద్రునకడకు నయ్యింద్రసుతుండు దోడన చనం జని
సుఖగోష్ఠి నుండె నట్టియెడ నగ్గాండీవి యప్పాండవపూర్వజునాననంబునం జూడ్కి
నిలిపి నిభృతుం డై. 14

తే. కమలనాభుండు పెద్దయుఁ గాల మిచట
నున్నవాఁడు దండ్రియును సహోదరాది
సకలబంధులు నితనిదర్శనము గోర
కుండు రే వారిఁ జూడ నీతఁడుఁ గోరె. 15

క. ద్వారకకు నిమ్మహాత్ముఁడు, మీరనుమతి సేయఁ జని యప్రమేయగుణుల నా
సీరిని వసుదేవునిఁ గని, గౌరవ మెసఁగంగఁ దల్లిఁ గాంచి ముదమునన్. 16
క. తక్కటిసోదరుల సుతుల, నక్కజఁ బ్రియ మారఁ జేర్చి యప్పురజనులన్
మిక్కిలిమన్నన మక్కువ, నెక్కొనఁగా నాదరించి నిలువక మగుడున్. 17
సీ. దేవర యిప్పుడు దివ్యచిత్తంబునఁ, జూచి మీ రెట్టులు సూడఁ బోలె
నట్టుల యుత్తరం బానతి యిత్తురు, గాక నావుడు నధిక ప్రియమున
మాతులుఁ గాంచి యమ్మాధవదేవుండు, మనమారఁ గాఁగ నమస్కృతులును
నాలింగనంబులు నాచరించి హలాయుధుని దేవకీదేవిఁ గనినయపుడు
తే. భక్తిమనకు నై పూజించి బంధుజనుల, నందఱును దత్తదౌచిత్య మభినుతముగ
నాదరించి వారలకుశలానుయోగ, విధము సత్కృతమ్ముగ విస్తరించి. 18
క. పరిజనయోగక్షేమము, లరసి పురజనమ్ములకుఁ బ్రియం బెసఁగఁగ వా
క్యరచనలుం గార్యసమా, చరణములు నొనర్చి నడపి సఖసత్కృతులున్. 19
తే. మఱియు వలయుకృత్యంబులుఁ దెఱఁగుపఱుప
వలసినన్నిదినంబులు నిలిచి యశ్వ
మేధమునకు బాంధవజనమిత్రభృత్య
వర్గసహితుఁ డై చనుదెంచువాఁడు గాక. 20
క. అని ధర్మజుండు వలికిన, విని కృష్ణుఁడు సంతసిల్లి వినతుం డై గొం
తిని ద్రౌపదిఁ దగుపెయి వీడ్కొని తాను సుభద్రఁ దోడుకొనిపోవుటకున్. 21
వ. కొంతి యెంతయుఁ బ్రియంబున ననుజ్ఞ సేయుటయు నర్జుననుమతియుం గొని 22
తే. వివిధవాహనారూఢులై విభవ మెసఁగఁ, బాండవేయులుఁ దక్కినబంధుజనులు
ననువరాఁగ సాత్యకి దోడ నరుగు దేరఁ, బురము వెడలి యొక్కెడ నిల్చి కరము నెమ్మి.
క. సముచితభంగుల నందఱఁ, గ్రమమున వీడ్కొని పథంబు గైకొని తనచి
త్తము దృష్టియుఁ బాండవము, ధ్యముపై నొలయంగ నల్లనరుగుచు నుండెన్. 24
ఆ. అట్లు మరలిమరలి యర్జునుం జూచుచుఁ, జనఁగ నతఁడు చూడ్కి సనినయంత
దవ్వుఁ జూచు చుండె నవ్విధంబున సితాం, బుజహాలోచనుండు వోవునపుడు. 25
క. నరసన సాత్యకి రుచిరప్రు, టరదంబునఁ జనియె వెనుక నలఁతిరథముపై
నరిగె సుభద్రయు నిమ్మెయి, నరుగఁగ హరిమీఁద నింద్రుఁ డలరులు గురిసెన్.
క. పవనుం డనుకూలత మెఱుఁగఁ, బ్రవర్తితుం డయ్యె నతిశుభప్రదభంగుల్
వివిధములు మఱియు ధరణీధవ తోఁచె నిమిత్తములు నిరంతస్ఫుటతన్. 27

—శ్రీకృష్ణుఁ డుదంకాశ్రమంబునకుఁ బోవుట.—

వ. అట్లు వోయి పోయి మార్గంబుకెలనం జేరువ నున్నయుదంకాశ్రమంబు గని
యందుఁ జని వినయం బొప్ప నమ్మునిం గని యతనిచేయు నతిథిసత్కారంబులం
బ్రియం బంది యతనిపాల నాసీనుం డయి యుండ నతం డప్పుండరీకాక్షున

ర్వము విను మేన చూపెద యుపన్యసించు సరణిఁ బసఁ గల్గుతత్త్వముల్. 38

తే. ప్రణవముఖవేదములుఁ జతుర్వర్ణములుఁ జ
తుర్విధాశ్రమములును స్వస్వకర్మ
జాలములును సముచితస్వర్గమోక్ష
ములును మన్మయములు కాఁగఁ దెలిసికొనుము. 39

క. క్రతుపరులు నన్ను లెగ సంస్తుతించి ఫల మందఁ గంద్రు దోషయుతులు స
మ్మతిఁ బ్రాయశ్చిత్తంబులఁ, గృతాత్ము లగుదురు మదీయసంకీర్తనపరులై. 40

క. మానసము మదగ్రపుత్త్రిఁ, గా నెఱుఁగుము ధర్మునిని జగద్రక్షకునై
యే నభిమతకాలములను, [1]మానితజన్మముల నొంది మనుతుఁ దపస్వీ. 41

క. భవవర్ధనవిలయంబుల, నవలీలఁ బరుస బ్రహ్మ యనవిష్ణుఁ డనన్
శివుఁ డన నిర్వర్తింతును, భువనంబులు నేన చూడు భూరిమహిమలన్. 42

క. ధర్మంబునకలఁతఁ గాంచియు, ధార్మికులం బొలియఁ జేసి ధార్మికులను బే
రర్మిలి రక్షింతు నుచితకర్మాచరణములు నేఁ జగద్ధితమునకై. 43

వ. అట్టివాఁడ నయ్యుండియు నధర్మపరు లగుధార్తరాష్ట్రుల నత్యంతధార్మికు లగు ధర్మనందనాదులతోఁ గలుపుటకుం బలుదెఱంగులం బనిచితి నది దివ్యజ్ఞానదేదీప్యమాను లగుపారాశర్యప్రభృతిమునివరులచిత్తంబుల కెక్కె నక్కౌరవులు దమ దౌరాత్మ్యంబున మాహాత్మ్యవంతు లగు నాకొంతేయులం దొడరి ధర్మసమరంబున నమసిరి నాచేసినపని యిట్టిది నన్ను నుదంక నీవింక నేమనియెద వనుమని పలికిన నతండు వినతుం డగుచు నిట్లనియె. 44

ఉ. ఇప్పుడు నీమహామహిమ దేర్పడ సమ్యగనుగ్రహంబునం
జెప్పినయీసమంచితవిశేషము లెల్ల నెఱుంగుదుఁ మదిం
గప్పినయీదురాగ్రహపుగర్వము నీ వొనఁగంగ నాకు ముం
జొప్పడియెన్ సుధాసదృశసూక్తులఁ దేర్చితి వీవ యచ్యుతా. 45

వ. అని వెండియు. 46

ఆ. అతుల మైననీదయామహిమకు నేను, బాత్ర మగుదునేని పద్మనాభ
యనుపమానతావకాకృతిఁ జూపవే, నాకుఁ జూడ్కి యను మనసంబు నలర. 47

కృష్ణుఁ డుదంకునకుఁ దనవిశ్వరూపంబుఁ జూపుట.

చ. అనుడు దయాళుఁడైనహరి యర్జునుచూచినదివ్యమూర్తిఁ జూ
పినఁ గని సంప్రమోదమును భీతియు విస్మయముం బెనంగొనన్
మునిపతి పాణిపద్మములు మోడ్చి నమః పురుషోత్తమాయ తే
యనుచు వినీతి నమ్ర మగునంగము నివ్వెఱ నిశ్చలంబుగన్. 48

వ. ఒక్కింత నిలిచి నిభృతస్వరంబున. 49

1. క. మానితజననముల నొంది నడతుఁ దపస్వీ.

సీ. పుండరీకాక్ష యీపుడమి యంతయును భవత్పాదకంజసంవ్యాప్త మయ్యె
నంబరం బెల్లను నావృత మయ్యె నీ మహితసముజ్జ్వలమస్తకముల
నంతరిక్షము దావకాద్భుతకుక్షిదేశంబుచేత సంగ్రథన మయ్యె
భవదీయసుమహనీయబాహార్గళాంచిత మాపిహితము లయ్యె నష్టదిశలు
తే. బహుచరణముల బహుశిరోభాగములను
బహుజఠరముల బహుభుజాప్రకరములను
దేవ యిట్లు సర్వంబును నీవ యైతి
వర్చి తిది నాదుకన్నులు మనంబుఁ దనిపె 50
వ. విశ్వరూపా యీరూపం బుపసంహరించి నీ దగు నెప్పటియాకారంబు గైకొనవే యనిన నప్పరమేశ్వరుండు వరంబు గోరు మని యానతిచ్చిన నమ్మహాత్ముండు సంశ్రితార్తిహర నీమూర్తిఁ గంటి నింతకంటె నెక్కుడువరంబులును గలవే యనుటయు. 51
క. ఆదేవుఁ డతనితో నటు, గాదు సనుం గనుట శుభము గావింపక పో
దేవి ప్రియ మడుగు మిత్తుఁ బ్రసాదంబుగ నీకు ననిన ముని యిట్లనియెన్.
వ. అవశ్యంబును నాకిట్లు గావలయు నని యవధరించితేని దేవా యిది మరుదేశం బిచ్చట జలంబు దుర్లభంబు నాకు జలసన్నిధి యెప్పుడుం గలుగఁ బ్రసాదింపుము. 53
క. అనుటయు నంబుజనాభుఁడు, దనయెప్పటిలలితమూర్తి ధరియించి మునీం
ద్రునితోడ నన్నుఁ దలఁపఁగ, ననఘా దొరకొను జలంబు లని పలికి తగన్. 54
వ. వీడ్కొని చనియెం బదంపడి యాభృగువంశపతుం డొక్కెడ మెలంగుచుండి తృషితుం డయి హృషీకేశుం దలంచినం. 55
సీ. కుక్కలు సుట్టి రా నొక్కమాతంగుండు, బాణబాణాసనపాణియును ది
గంబరుండును మలినాంగుండు నగువాఁడు, దోఁచె నచ్ఛజలంబు దొరఁగుచుండు
మేనితో నమ్ముని వానిఁ దప్పక చూడ, వాఁ డోయుదంక యుగ్రవ్రతి డప్పి
వోఁ ద్రావుమనుడు నాభూసురాగ్రణి యొల్ల, ననిపల్కెఁ బల్కిన నవివేకి నీవు
ఆ. నీరువట్టు శ్రమముఁ గూరిన నీమీఁది, కరుణ వచ్చినాఁడఁ గాన నాకి
యర్థిఁ ద్రావు టొప్పు ననియె నాచండాలు, నలుకమెయి నదల్చె నత్తపస్వి. 56
వ. అదల్చిన నతండు సారమేయంబులుం దాను నంతర్ధానంబు సేసె నాసంయమి వెఱఁగుపడి యొక్కింత విచారించి యిక్కపట ప్రచారంబు కృష్ణసంపాదితంబు గావలయు నని యూహించుసమయంబున నయ్యెడకుం గృష్ణుం డరుగుదెంచుటయుం గనుంగొని యమ్మహాత్మునితోడ నమ్మునివరుండు. 57
క. జలము నినుఁ దలఁచఁగా నిటు, గలుగున చండాలునొద్దఁ గాఁ జెనకునే రే
నలఘుగుణ త్రావుదునె యే, కొలఁది శ్రమం బైన వరము కుచ్చితమయ్యెన్.

చ. అనవుడుఁ గృష్ణుఁ డిట్టు లను నాజడుఁ బోయెఁ బ్రయత్న మెల్ల నీ
వనఘ యెఱుంగ నైతి సమయం బొకఁ డిమ్మెయిఁ గల్గె నేర్పడ
న్వినుము నిలింపవల్లభుని నీకు వేఁడితి నే సుధారసం
బనితరసాధ్య మైనశుభ మయ్యెడుభూతి దొలంగె నక్కటా. 59

వ. అది యెట్లం టేని. 60

క. ఏను సుధ యడుగుటయు హరి, మానవులకు నేల యగు నమర్త్యత్వము మే
లైన తెఱఁ గొండు గోరుము, దానిం దగ నిచ్చెదఁ ముదం బారంగన్. 61

వ. అనిన నయ్యనిమిషపతి యాననం బాలోకించి. 62

క. నిను వేఁడుట మోఘముగాఁ, జనునే యెట్లైన నాదుసచనవు సెఱప క
మ్మునిపతికి నమృతరస మిం, మ్మని ప్రార్థించిన మహాత్మ యాతఁడు నాతోన్. 63

వ. సమయంబు సేసికొని వచ్చె నత్తెఱం గాకర్ణింపు మమ్మహితసౌజన్యధన్యుండు. 64

శా. మాతంగత్వము దాల్చి యే నరిగి సమ్మానించి యాభార్గవుం
బ్రీతుం జేసెద నట్టు లిచ్చిన సుధన్ హ్రీదూషితస్వాంతుఁ డై
యాతం డొల్లక యున్న నేమి విను నా కన్యాయ్యవృత్తంబు గా
దీతంత్రంబున కీవ సాక్షి యని తా నేతెంచె నిన్ గానఁగన్. 65

వ. నీవు ప్రత్యాఖ్యానంబు చేసిన నతం డంతర్ధానంబు సేసెం గా నిమ్మ దాని కేమి
సేయ వచ్చు నాయిచ్చినవరంబు బొంకు గాకుండ నీకు జలం బెప్పుడుం గలుగం
జేసెద. 66

చ. అనఘ జలంబు నీవలసినప్పుడ మేఘము లీమరుస్థలం
బున నొసఁగున్ భవద్వశము పొంపిరివోవ నుదంకమేఘనా
మనుతవిహారముల్ గలిగి మాన్యత నెప్పుడు నియ్యెడం జరిం
చును జలదంబు లింక నను సువ్రత దూఱకు పోయివచ్చెదన్. 67

క. అనినం బ్రీతుం డయ్యెను, ముని యంతర్ధానకలనమునఁ గృష్ణుండుం
జనియె నని చెప్పి మఱియును, జనమేజయనృపతితోడ సంప్రీతిమెయిన్. 68

వ. వైశంపాయనుం డిట్లనియె. 69

ఆ. మనుజనాథ యెప్పుడును మరుదేశంబునందు నియతవృత్తి నద్భుతంబు
దలకొనంగ నయ్యుదంకమేఘంబు లొక్కొక్కపుణ్యతిథుల నొలసి కురియు. 70

వ. అనిన విని జనమేజయుండు మునీంద్రా యుపేంద్రుని శపించుటకు నుత్సహించిన
యుదంకుం డేమివిధంబు తపంబున నమ్మహానుభావంబు నొందె నెఱింగింప వే యనుడు
నావిభునకు వైశంపాయనుం డిట్లనియె. 71

—•• జనమేజయునకు వైశంపాయనుఁ డుదంకునిచరిత్రంబు సెప్పుట. ••—

సీ. అతనికి గురుభక్తి కతనఁ జొప్పడి యొప్పె న, త్తెఱఁగు సెప్పెద విను తెలియ నతఁడు

పనగుణుం బైనగౌతమునకు శుశ్రూష, నియతిమైఁ జేయు నన్నెహాభక్తి
గాఁబుగఁ బెద్దయుఁ గాలంబు సనిన నా, గాయమితతి శిష్యగ్రామణి కొల్ల
వివిధవరము లిచ్చి । వీడ్కొల్పి పుచ్చియు, దంకునిదిక్కాను । దలఁపకుండె
ఆ. సత్తపఃపరాత్ముఁ । డతినిష్ఠఁ బరిచర్య, సవపు చేసె నా । గనుమ్రేఁగు
గలుగునట్టివంటకట్టె యమో పట్టు, గుఱుఁడు మోచి తెచ్చెఁ । గురువరేణ్య 72
క. అటు మోచి తెచ్చియుం దొరఁ,జట పెద్దయుఁ దగిలి యుండ । శరభసముగ వై
చుటయుఁ దెగి మోపుతో ముం,దట నది పడియెను జరాసితచ్ఛవి మెఱయున్. 73
సీ. దాన నన్నియతుండు । దనవయఃపాకంబు, నెఱిఁగి శోకంబున । నేడ్వ నమ్మ
హాముని యశ్రువు । లంజలిఁ బట్టంగ, నిజపుత్త్రిఁ బనిచె నక్కన్నిరజాక్షి
రయమునఁ బట్టి కరంబులు వేఁడిమి, నెరిసిన విడిచిన । ధరయుఁ దలరె
నమ్మునిని యాశిష్యు । రమ్మని చేరంగఁ, బిలిచి నీ వేటికి । నలఁతఁ బొంద
ఆ. దనిన నతఁడు శిష్యు । లందఱుపైఁ గల,కరుణ మీకుఁ బెద్దకాలమేని
మునివరేణ్య నావలన లేద దానికి, నుమ్మలింప కొట్టుకలుండవచ్చు 74
వ. అనుటయుఁ గృప చిగురొత్తు చిత్తంబుతోడ. 75
క. ఎలప్రాయ మిచ్చితిని నీ, కలఘుమతీ యిచ్చెదను మదాత్మజ నుల్లం
బులరఁగఁ బెండిలి గమ్మని, పలికి మఱియు నాతపస్విపతి యిట్లనియెన్. 76
క. నీ తేజంబు సహింపఁగ, నీతామరసాక్షి దక్క । నెవ్వారికిఁ దప
స్స్ఫీతా శక్యము గా దిది, చేతోగతిఁ జూచి తగవు । సిద్ధించుటకై. 77
వ. ఇమ్ముగ్ధియకును. 78
క. తను వొండుగఁ జేసెద నది, జననాంతర మెట్టు లట్లు । సజ్జనముత నీ
వనుమానము దక్కుము యావనమును గైకొనుము కన్య । వరియింపు తగన్.
వ. అధర్మము గా కుండునట్లుగా వరం బిచ్చితి నని యనుగ్రహించి యక్కన్యకా
రత్నంబునకును. 80
చ. తనులత యొండు సేసిన నుదంకుఁడు యౌవనలక్ష్మిఁ దాల్చి య
వ్వనిత వివాహ మయ్యె నృపవర్య పదంపడి యమ్మునీంద్రుతో
ననుఁ బని గొంటు మీరలు మనంబున నెద్ది దలంచి వేడ్క సే
సిన నది దెత్తు మీకరుణం జేసియ కల్గెను నాకు శక్తియున్. 81
క. అని విన్నపంబు సేసిన, విని దక్షిణఁ బ్రీతి యగుట । వే ఱొరులకుఁ గా
కనఘ భవదీయచరితం,బునఁజూవే నాకు ననియె । ముని మనుజేంద్రా. 82
తే. అంత నిలువక మునిపత్ని । కతఁడు భక్తి, నెఱిఁగి తల్లి మీ రానతీయుండు మీకు
వలయునట్టిపదార్థ మవశ్యమును న,మాహరింతు నే ననుటయు । నయ్యహల్య.
చ. వలవదు లేఁతవాఁడవు భవద్గుణతోషితగౌతమాంచితో
క్తులు మది నూఁదు మన్నను నకుంఠితచిత్తత నొత్తి పల్క న

పోయినభుజంగం బైరావతాపత్యం బటన్న విని యమ్మునిశిష్యుండు. 106

క. పాతాళంబున నున్నవి నీ కుండలములు విను మవ్వని నా
చేతం గా కున్న నవి ప్రీతము విడువఁబడ నిది ప్రకటం బని పలికెన్. 107

చ. పలికిన నత్తపస్విశిష్యుని యాజ్ఞఁ జేకొని సురేంద్రుఁ డొండొకప
ల్కులవని సిల్పి శాసమునకయి గులిశంబునఁ గల్గువాఁడియున్
బలువును నిచ్చి వ...నె బాంధవ మేర్పడఁ జెప్పి భీతిమై
నిల దెస విచ్చి నమ్మకియు నేర్పడఁ జొచ్చె భుజంగలోకమున్. 108

వ. చొచ్చి యనేకప్రాకారప్రాకారపరివేష్టితంబును బహురత్నదీప్తిజాలదేదీప్యమానంబును నైనయమ్మహనీయలోకంబు నాలోకించి దశయోజనాయామంబును బంచయోజనవిస్తారంబును నగుతద్ద్వారంబు గని యతండు కుండలాహరణంబు దుర్లభం బనుతలంపున డిల్లపడియె నయ్యవసరంబున నరుణవదనంబును నసితాంగంబును సితవాలంబును నై వెలుంగుతురంగం బతని కిట్లనియె. 109

ఉ. ఆలత మైనవాదగుణకపానము నూఁదు ముకెంతియున్ జగు
ప్పానురవృత్తి నీదుహృదయంబునఁ జొప్పకు లోకవంద్యుఁ డ
గౌతమునాశ్రమంబున నఖండితభక్తి నుపాస్తి సేసి నన్
బ్రీతునిఁ జేసినాఁడవు వశరిత్తతపోధన యట్లు గావునన్. 110

వ. నీకుం బొడనూపి యైరావతసుతుండపహరించినసముచితకుండలంబులు మగుడం జేరెడునుపాయం బుపదేశించితి ననిన నుదంకుం డేను నిన్ను నెఱుంగ నుపాసించుట యెట్లు గలిగెఁ దెలుపు మనుడు నయ్యశ్వం బతనితోడ భవద్గురునకు గురుండం బావకుండ నీవు శుచివయి సభక్తికంబుగా నిత్యంబును నన్నునియతింబూజించి తత్తెఱం గెఱుంగవే యని పలికినం బ్రీతి నొంది యతండు తదీయోపదిష్టప్రకారం బాచరించిన. 111

సీ. ఘోటకోత్తమరోమకూపంబులం దెల్ల, నొక్కట ఘనధూమ ముద్గమించి
కడసి పాతాళలోకం బంతయును గప్పి, వాసుకిప్రభృతినివాసభూము
లుపరుద్ధభావంబు నొందె నైరావతా, వాసంబు హాహారవంబుతోడ
నాకులం బయ్యె నట్లతిదారుణం బైన, పెనుఁబొగ నంతయు భీతి నొంది

ఆ. యమ్మునీంద్రుకడకు నహివరుల్ రయమున, వచ్చి భక్తి నర్చ లిచ్చి వినతు
లై తదీయకార్య మడిగి యెఱింగి వే, తెచ్చి కుండలంబు లిచ్చి రధిప. 112

—✿ ఉదంకుండు కుండలంబు లిచ్చి యహల్యను సంతోషపఱచుట. ✿—

చ. అతఁడును వారిఁ బోఁ బనిచి యగ్నికి భక్తిఁ బ్రదక్షిణంబు సే
సి తగ నమస్కరించి విలసిల్లఁగఁ దేజము ప్రీతచిత్తుఁ డై
యతలము నిర్గమించి రయ మారఁగ వచ్చి యహల్యఁ గాంచి తె
చ్చితి నివె కుండలంబు లని చే నిడి భూస్థలిఁ జాఁగి మ్రొక్కినన్. 113

తే. అయ్యుదంకుని గౌతముండు సత్కారమునఁ, గౌఁగిలించుచు దీవించి గారవింప
సతియు నమ్మునిపతిసతియు నయ్యవసరమున, మిక్కు మాటలు భక్తిమెఱయ మ్రొక్కి నిలిచి.
క. మీకరుణఁ గాక తగునె యి, నీకుండలములు పరిగ్రహించుట నమరన్
నైకృత మొలసినఁ గలఁగుట, నాకోలఁదియె యనియె వినయమ్మొందఁగుచున్.
వ. అనిన విని వార లత్యంతసంతుష్టాంతరంగులైరి గౌతముం డతని కిట్లనియె. 116
ఉ. నీచరితంబు చిత్రము మహాద్యుతి యమ్మిత్రసహాటవీశ్వరున్
నీచతఁ బాప నాగపురకేళము సేసినకుండలద్వయం
బాచతురత్వ మాజడిమి నాగ్గూఢనిశ్చయ మట్టు లొప్ప ధ
ర్మోచితలీలఁ జేర నొసఁగఁ బోవునె యేను నిజాంబ పల్కితిన్. 117
వ. అనియె నయ్యుదంకుం డట్లు సనముహాశయంబుబలిమిం బరాక్రమించి యనన్యసులభంబు లగుకుండలంబు లాహరించి గురుజనమనోరథసిద్ధి గావించె నా భృగువంశమహోత్తమ మహానుభావం బిట్టిదనిన విని జనమేజయుం డమ్మహాత్మునకు వరంబొసంగి చనినవాసుదేవునవంతరవృత్తాంతంబు మునిసత్తమా యెఱింగింపవే యని యడిగిన నవ్విభునకు వైశంపాయనుం డిట్లనియె. 118
సీ. ఆభార్గవోత్తము నట్లు వీడ్కొని కృష్ణుఁ, డరిగి యలంకృతమైననిజపు
రము సొచ్చునప్పుడు రైవతకాచల, యాత్రామహోత్సవ మఖిలజనులుఁ
గొనియాడుచుండి యస్సగ్గోవిందుసందర్శ,నంబున నుత్సవోన్మత్తభావ
మిమ్మడి యై ప్రమోదమ్మునం దేలిర, దేవదేవుఁడు వసుదేవుఁ గాంచి
తే. దేవకీదేవి బలభద్రదేవుఁ దక్కఁ, గలుగువృద్ధబాంధవులను గని వినీతిఁ
దత్తదుచితమనోజ్ఞవిధానమునంచి, తాచరణములు నడపెఁ బ్రియంబెలర్ప.119
వ. వార లందఱకు ధర్మనందను చెప్పినచొప్పునఁ బ్రణామాదియోగ్యోపచారంబు లాచరించె ననుజతనుజామాత్యభృత్యులు దన్నుం గనినం బ్రీతివాత్సల్యసంభావనాబహుమానంబులు మెఱయ నాదరించె సాత్యకిసుభద్రలం దగుతెఱంగులం దగినవారలం గానిపించె నట్లు సకలజనప్రమోదావాది యైనదామోదరు నత్యంతసమీపాసీనుం జేసికొని వసుదేవుండు భారతరణప్రకారంబు యాతాయాతజనంబులచేత వింటిం బ్రస్ఫుటంబుగా విన వలతుం జెప్పవే యని యడిగిన నచ్యుతుం డతని కిట్లనియె. 120
క. అది యతివిస్తారము పెక్కుదినంబులు సెప్పఁ బట్టుఁ గొంత దగం జె
ప్పెద నేఁ బ్రధానపురుషస,ముదయనమరవిధము లఘుతరోక్తులఁ దెలియన్.
సీ. కౌరవసైన్య మేకాదశాక్షౌహిణీ, కలితంబు దానికిఁ గట్టె వీర
పట్టంబు భీష్ముఁ డాప్రభువున కెదు రొడ్డి, రలమిమైఁ బాండుపుత్త్రులు శిఖండి
నక్కడ సప్తసంఖ్యాక్షౌహిణీక మ,నీక మిమ్మాడ్కిఁ బన్నినబలద్వ
యంబును ఖేచరు లచ్చెరువడఁ బోరెఁ, గాండీవి దోర్బలంబుగా శిఖండి

విప్రప్రకరంబుల కొసంగుటయు మఱియుం దటాకకరణాదిధర్మంబు లాచరించుట యునుం జెప్పి మఱియు నురంబునం దెరలక మరలక యాసౌభద్రుండు రౌద్రమూర్తి యై సుయోధన ద్రోణ కృప ద్రౌణి కృతవర్మ కర్ణాదివీరవ్రాతంబుం గలంచి యనేకనృపలోకంబు జముగోకంబున కనిచి యనిమిషులు వొగడ నుత్తమలోకంబున కరిగి సుఖ మై యున్నవాఁడు వానికి వగవ నేల యనియుం బలికి యిట్టు శాంతి గావించి. 131

ఆ. బంధులోకమునకుఁ బరమప్రియం బైన, యుచితవర్తనమున నుండెఁ గృష్ణుఁ
డని సవిస్తరంబు లగువాక్యములఁ బ్రీతి, సిగురు లొత్త నిట్లు సెప్పి మఱియు.

వ. కరిపురంబునం బుట్టినవిశేషంబులు విను మని పలికి వైశంపాయనుండు జనమేజయున కిట్లనియె. 133

—•• వ్యాసుఁడు పాండవుల నశ్వమేధయాగోన్ముఖులఁ జేయుట. ••—

సీ. చుఱచుఱఁ దనచెవుల్ నూఁడినయట్లుగ, నభిమన్యుసంస్తుతి యైనవాక్య
యము ప్రసంగాధీనమై బంధుజనులందుఁ, బొడముటయును ధృతిక్రమెడలి తలరి
యుత్తర విలపింప నత్తన్వియలమట, గనుఁగొని పాండునందనులు వనటఁ
గూరిన నచటికిఁ గారుణ్యమూర్తి వేదవ్యాసుఁ డేతెంచి తగినమాట
తే. లాడి వారలవగ మాన్చి యశ్వమేధ, విషయవిధులు ప్రసంగించి వేగ తొడఁగుఁ
డని నియోగించి వారెల్ల నట్ల కాఁగ, యనిన నాతఁ డంతర్హితుం డయ్యె నధిప.

క. అన విని జనమేజయుఁ డ, మ్మునిని యిట్లు హితోపదేశమును జేసినఁ బాం
డునృపాగ్రతనయుఁ డెమ్మెయి, ననఘ తొడఁగె నశ్వమేధయాగంబునకున్. 135

క. అని యడిగిన వైశంపా, యనుఁ డాతని కిట్టు లనియె నప్పుడు కుంతీ
తనయాగ్రజుండు దమ్ములఁ, గనుఁగొని యుత్సాహలక్ష్మి గనుఁగవ నొప్పన్. 136

సీ. వ్యాసమహాముని వత్సలత్వంబున, నానతి యిచ్చినసమ్మాననీయ
వాక్యంబు వింటిరె వసుధ యిత్తఱి వసు, హీన యై యున్నది దానఁ జేసి
భూదేవనిహితధనాదాన మావశ్యకం బయ్యె దానికర్తవ్యమును హి
మాచలయాత్రాసమాచరణప్రకారమును విచారణీయములు గావె

ఆ. యనుడుఁ బవనతనయుఁ డతనితో నీశ్వరుఁ, బరమనియతిఁ గొలిచి కరుణ వడసి
ప్రమథగణము నెల్ల భక్తిఁ బూజించి య, త్తలమునందు భూతబలు లొనర్చి.

క. తెత్తము గాక నరేంద్ర మ, రుత్తకలిత మైనదానరూపము సుమహో
దాత్తస్థితి నున్నకనక, మిత్తఱి నిలదెసఁ దలంప నేటికి మనకున్. 138

వ. అప్పనికి సముచితసైన్యసమేతంబుగా దేవర విజయంచేయ వలయు ననిన నర్జునుండును గవలును నట్ల పలికిరి దానికి ధర్మనందనుండు ప్రియం బంది కృతనిశ్చయుం డయి ధృతరాష్ట్రుకడకుం జని యశ్వమేధయాగోపక్రమోత్సవ శ్రవణంబునం బుత్త్రులం దలంచి శోకసంతాపసమాక్రాంతుం డయి యున్న

యన్నరపతిచరణంబుల కెఱఁగి వేదవ్యాసువచనంబులు గాంధారియు వినుచుండ నతనికిం జెప్పి యతని నయ్యజ్ఞాచరణంబునకు ననుజ్ఞ వడసి యయ్యోగీశ్వరును దండప్రణామపూర్వకంబుగా వీడ్కొని గొంతిపాలికిం బోయి సంతోషవికచ వదన యయి యున్నయద్దేవి యధ్వరవిధానంబునకు ననుమతి సేయం దదీయ పాదంబులకుం బ్రణమిల్లి తదామంత్రితుం డై యాగస్థానమండపంబునకు నరుగుదెంచి యుయుత్సు రావించి కార్యంబు తెఱం గెఱింగించి నీవు నగరరక్షకు నిలువు మని నెయ్యం బలర విదురసమేతంబుగా నిలిపి బలంబుల సంఘటింపం బడవాళ్ళం బనిచి నియతుం డయి సురపితృపూజనంబులు దీర్చి మహాప్రార్చనం బొనర్చి మహితావధానుం డై. 139

క. నానావిధబహుళాంచిత, దానము లొనరించి యప్పు డతం బకునర్చెన్
దానియధికారి ధౌమ్యుం, డాను బ్రదక్షిణవిధాయుక్తుం గొలిచి తగన్. 140

క. సితలేపనసితభూషణ, సితమాల్యసితాంబరములఁ జెన్నుగ నమలం
కృతుఁ డై సితాతపత్ర, ప్రతతి మెఱయఁ బూర్ణచంద్రుపగిది వెలుఁగుచున్. 141

వ. షోడశశ్వేతాశ్వప్రఖ్యాతరథారూఢుం డై. 142

క. భూదైవతవక్త్రాశీ, ర్వాదంబులుఁ బుణ్యగానరవములు రోదో
మేదురమంగళతూర్యని, నాదంబులుఁ జెలఁగ బుధజనస్తుతు లెసఁగన్. 143

చ. వెడలుచు నమ్మహీవిభుఁడు వేడ్క యొఱంగి వృకోదరుండుఁ గ
వ్వడియును బిన్నతమ్ములును వైభవ మొప్ప నలంకరించి యె
క్కుడు మెఱయం బ్రధానభటఘోటకదంతిరథప్రతానముల్
[1]దడిగలఁ గుంచెలుం గొడుగులుం దండములుం విలసిల్ల వచ్చినన్. 144

క. కని యానృపుఁ డలఁతినగవు, నిను పారెడిచూడ్కి వారిపై మొగములపైఁ
దను పారుచుఁ బోలయుం జనఁ, జన రాజులు గూడుకొని నిర్గసైన్యంబులతోన్. 145

వ. ఇవ్విధంబున నరిగి యక్కురువంశవరుండు సముచితప్రయాణంబుల గిరిసరిదరణ్యంబులు గడచి హిమశైలంబు సేరి ధౌమ్యాదిపురోహితులఁ బురస్కరించుకొని తదీయతలం బధిష్ఠించి యొక్కయుచితప్రదేశంబున విడిసె నట్టియెడ. 146

వ్యాసుఁడు హిమవత్పర్వతంబున నున్న పాండవులకడకు వచ్చుట.

శా. బాలార్కద్యుతిపుంజపింజరజటాభారంబుఁ బ్రావృణ్ఘన
శ్రీలీలం బ్రవసించు నంగమును రోచిస్స్ఫారదండంబు ను
న్మీలన్నీలమృగాజినాంబరము నై నిర్వాణదానక్రియా
శీలుం డై పరాశరాత్మజుఁడు విచ్చేసెం గృపాలోలుఁ డై. 147

వ. ఇట్లు సన్నిహితుం డయిన వేదవ్యాసమునీశ్వరునకుం బాండవులు పరమభక్తిం బ్రణామపూర్వకంబుగాఁ బూజించి కర్తవ్యం బెయ్యది యానతిం డనిన నమ్మాన

1. గ. చ. జ. 'దడి గుడిగుంచెలుఁ'.

నీయెడం జెల్లి మీరెల్లవారును త్ర్యంబకపూజలు సెల్లింపవలయు నేటిరాత్రి
నియతులై దర్భసంస్తరణంబుల శయనించునది యని నియోగించిన. 148

ఆ. రమ్యమైఁ దత్ప్రకారంబుల దర్భసంస్తరణములను యోగ్యసదనమునఁ బ్ర
భాసమానులు లగుపంచాననులుం బోలె, నమ్మహాత్ము లుండి రధిపముఖ్య. 149

వ. అట్లుండి యవనీసురాశీర్వాదంబుల నాదరించుచు నారేయి గడపి కల్యం బగు
టయుం గాలోచితకరణీయంబు లనివర్తించి సర్వక్రియాకలాప నిర్వాహణధుర్యుం
డగుపారాశర్యుండును వనుప ధౌమ్యప్రముఖపురోహితసహాయమహనీయ సమా
చారు లగుపాండవేయులు పరమస్థండిలంబునం బార్వతీపతి నావహించి యుత్కృ
ష్టంబులును బహుళంబులు నగుగంధపుష్పధూపదీపంబులం బూజించి సముచిత
మనోహరభూరిపాయసాది [1]భక్ష్యద్రవ్యభారమహోదారం బగునైవేద్యంబు సమ
ర్పించి వేఱువేఱ ప్రధానప్రమథులకుఁ దద్గణంబులకు నర్పలిచ్చి కుబేరమాణి
భద్రప్రభృతిభూతయక్షజనంబులను సభక్తికావాహనకలితులం గావించి పూజ
నంబు లాచరించి. 150

క. రక్షాకరమంత్రకలన, దక్షాత్మకు లైనయట్టిధౌమ్యముఖోదా
త్తక్షోణీసురులు బెరయ, నక్షయపుణ్యుఁ డగుకౌరవాధిపుఁ డెలమిన్. 151

క. అనుజులుఁ దానుఁ బరాశరతనయపురస్సరముగా నిధానస్థలికిం
జని యరుణగంధకుసుమములను మాంసాపూపములను లాజములఁ దగన్. 152

ఆ. భూతతృప్తిఁ జేసి భూరిబలాఢ్యులఁ, బరిజనములఁ ద్రవ్వఁ బనుచుటయును
నతికుతూహలమున నార్చి వారలు ద్రవ్వి, రన్నిధానదేశ మధిపముఖ్య. 153

క. త్రవ్వినఁ బ్రభ లెల్లదెసల, నివ్వటిలఁగ వెలుఁగుచుండె నిధి యనిలజుఁడుం
గవ్వడియుఁ గవలు నలరఁగ, నవ్వసుధాధిపుఁడు దానికర్చన లిచ్చెన్. 154

వ. అట్లు వివిధవిద్యానిధి యగువేదవ్యాసుండు సన్నిధిసేసి యప్పెన్నిధి సాధించిన నా
ధర్మనందనుఁ డాపరాశరనందనుపాదంబులకు దండప్రణామంబు సేసి నిలిచి కేలు
మొగిడ్చి ఫాలతలంబునం గదియించి వినయావనతుం డై యున్న నన్నరేంద్రు
నమ్మునీంద్రుం డాలింగనాశీర్వాదంబుల నాదరించి యామంత్రణంబు సేసి యంత
ర్హితుం డయ్యె నమ్మానవనాథుండు. 155

సీ. శకటఖరోష్ట్రఘోటకకుంజరంబు లనేకసహస్రంబు లెలమి సంఘ
టించి భారంబు లెత్తించి భారవహత్వ, నతజనుల్ పెక్కు లతఁ డర్థిఁ
గదిసి యే నే ననికడఁగి మోవఁగ యాగ, నిలయంబుఁ గలపయ్యె గలశములును
నలఁతులుఁ గాఁగులు నాదిగాఁ గలభాండములును పీఠములు శయ్యలును ఱోళ్లు

తే. రోఁకళ్లుఁ జట్టువంబులు స్రుక్స్రువాజ్య, పాత్రదండకమండలు [2]దాత్రములును
లోనుగాఁ గల్గువస్తువు లుద్ధహేమ, మయము లొక్కట నడపించె మనుజనాథ.

1. ట. భక్ష్యద్రవ్యభారమహోదాత్తంబగు. 2. క. వేత్రము [illegible]

చ. మఱియును సన్నిధిం గలసముంచిత కాంచనరాశి బండులం
బెత్తికల మోవులం గొలఁది నెట్టఁగఁ బెక్కగు బాహువుల్ జనుల్
వెఱఁగుపడంగ ఖేచరులు వెక్కస మందఁగ శత్రుకోటికిన్
వెఱ పొనరించువార్త పృథివిం బరఁగన్ నడపించె భూవరా. 157

ఆ. పరు నేలకొలఁది నెడనెడ విడియుచుఁ బోవ వలసి యుండె భూరిభార
వహులఁ దప్పి యెఱుఁగఁ వాఁ డగునా ధర్మనందనునకు ధరణీనాథవర్య. 158

వ. అంత నక్కడఁ గృష్ణుండు. 159

తే. ద్వారకానగరమునకుఁ దన్నుఁ బుచ్చు, నప్పుడు ధర్మజుఁ డశ్వమేధాధ్వరంబు
సమయ మగుట ప్రతీక్షించి సకలబంధు, యుక్తముగ రమ్మని మధురోక్తి యాఁడి.

—శ్రీకృష్ణుండు సకలబంధుసహితుం డై కరినగరంబునకు వచ్చుట.—

వ. అరసికొని యుండి యప్పాండవాగ్రజుండు యాగంబున కుద్యోగంబు సేయుట
చారులు సెప్ప నాకర్ణించి కుతూహలోన్నిద్రుండై బలభద్రసాత్యకికృతవర్మ
ప్రద్యుమ్నచారుదేష్ణసాంబాదియాదవసమేతంబుగా వసుదేవ దేవకీసమనుజ్ఞాతుండై
సుభద్రం దోడ్కొని కరినగరంబున కరుగుదెంచిన ధృతరాష్ట్రుండును గాంధా
రియుఁ గొంతియుం బనుప నుత్సుకుం డై యుయుత్సుండు విదురుం బురస్కరించి
కొని యప్పాంచజన్యధరు నెదుర్కొని పరమభక్తిం దోడ్కొని వచ్చిన. 161

తే. మున్న ధృతరాష్ట్రుకడకు నా వెన్నుఁ డేఁగి
యతని గాంధారిఁ బ్రణతిపూర్వాతిమధుర
వాక్యములఁ బ్రీతి నొందించి వచ్చి కొంతిఁ
గాంచి ప్రణమిల్ల నద్దేవి కౌఁగిలించి. 162

వ. పెక్కుభంగుల దీవించె బలదేవాదులుం దగిన తెఱంగున నప్పాండురాజమహిషిం
గని రక్కులపాలికాతిలకంబు పులకంబులం బెరిఁగిన మేనితో మాననీయచరిత్రుం
డగు నద్దేవకీపుత్త్రు సంభావించి. 163

క. ప్రమద మెసఁగ విదురుఁ బనిచి, సముచిత మగునర్చనంబు సంకర్షణపూ
ర్వము గాఁగ నడపి యదునికరము నర్చలు సంభృతాదరంబున నడపెన్. 164

వ. సుభద్ర దన్నుం గనినం బరమప్రియంబున గారవించి యభ్యంతరమందిరం
బునకుం బుచ్చెఁ బద్మనాభప్రభృతు లగు నా బంధుజనంబు నెల్లను నగరిచేరువ
శోభిల్లు మందిరంబుల విడియింప యుయుత్సు నియోగించె నట్లయ్యందఱు
నభినందితు లై యున్నసమయంబున. 165

ఉ. ఉత్తరపుణ్యగర్భమున నుండి భవజ్జనకుండు పూరువం
శోత్తరుఁ డాదిరాజగుణయోగి పరీక్షితుఁ డుద్భవించినం
జిత్త మెలర్పఁ బుత్త్రుఁ డని చెప్పిరి వెల్పలివారి కింటిలో
నత్తఱి నున్నవృద్ధసతు లార్చె జనం బఖిలంబు నుబ్బునన్. 166

క. బాలుఁడు మృతజాతుం డగు, నాలోచన యెప్పు డెరయ - నలమట సచ్చో
నాలలన లుగ్గడించినఁ, జేలెరి శోకమున జనులు - ధీరవిచారా. 167

వ. అత్తఱి రోదనధ్వనులు గఱయుం జెలంగిన విషాదవేదనాయత్తంబు లయిన చిత్తాంగంబులతో శౌరి సాత్యకి యనుగమనంబు సేయ సత్వరంబుగా గొంతి యున్నెడకుం జనుదెంచె నప్పు డాకుంతిభోజనందనయు ద్రౌపదియు సుభద్రయు నార్తనాదంబు లెసంగం దనకడకు రయంబున రా నెదుర నయ్యాదు వీరుండు గాంచి శోకసమాకులమానసుం డయ్యె నప్పాండురాజపత్ని పురుషోత్తమున్ డగ్గుత్తిక నెలుంగు దగుల ని ట్లనియె. 168

— పరిక్షిత్ప్రాణదానంబునకై కుంతీసుభద్రలు కృష్ణుఁ బ్రార్థించుట. —

క. గతి నీవె నాకు మత్స్యం,తతికిని నీయుల్లఁగుబ్బుగలనయ్యుఁడు వృష్ణీ
మృతుఁడై క్రూరుం డగుగురు,సుతునియిషీకాస్త్రవహ్నిఁ - గజాఁడినకతనన్. 169

సీ. దేవకీపుత్ర సంజీవితుఁ జేయవే, యబ్బాలు నద్దారుణాస్త్రసంప్ర
యోగంబునవుడు కృపాగరిష్ఠుండ వై, చేసితి ప్రతిన గాచెద నవశ్య
మునునుత్తరాగర్భజనితు నే ననిబాలు, బ్రదుకఁతోడిద నాడు - బ్రదుకుద్రుపద
తనయాసుభద్రలు - ధర్మజుం డనుజు లా,శిశువు సంజీవితుఁ - జేయ కున్న

ఆ. బ్రదుక రన్వయమున - కుదకపిండప్రదా,నంబు లెడలు మత్స్య - నందనయును
నూఱడింపఁబడియె - నొకనాఁడు నీచేత, దానియార్తి కరుణఁ - దలఁగవయ్య 170

వ. దేవా నీ విక్కులంబు గలిగించినవాఁడ వింకను నీవ వీని బ్రదికింపవే యని పల్కుచుం బుడమిం బడిన గొంతి నగ్గోవిందుం డనునయవచనంబుల నూఱార్చి యెత్తె నట్టియెడ సుభద్ర యమ్మహాత్మునితో ని ట్లనియె. 171

క. గురుసుతుఁడు భీమునకునై, పరమాస్త్రం బెత్తె దానిఫల మందంగా
నరుఁడును దత్పౌత్త్రియుఁ గాం,చిరి తుది నే నీకు నేమి - సెప్పుదుఁ బ్రభువా. 172

క. నీమఱఁది యాకొడుకుపైఁ, బ్రేమం [1]బెప్పుడును బెంపఁ - బ్రేలెడి మనుమం
డీమెయి వమ్మయి పోయిన, నేమి యగునొ యెఱుఁగ నీవ - యెఱుఁగుదు దీనిన్.

సీ. ధర్మజుం డెమ్మెయి - [2]ధరియించు నెవ్వగ, పవననందనుఁడును - గవలు నేమి
వెరవున నుపశమింతురు దీని విను దేవ, యస్త్రప్రయోగంబునవుడు నీవు
గురుసుతు నదలించి - కుచ్చిత నిన్ను మోఘాస్త్రునిఁ జేసెద - నంటి దాన
నూఱడి యుండుదు - ముజ్జ్వలతేజ నీ, మహితానుభావత - మాకు నెల్లఁ

ఆ. దెలిసి యుండుఁ గాన - [3]యులుకము సత్యాద, యాశ్రితాభిరక్ష - లనఘ నీకు
నైజములు శిరఃప్రణతి నేను వేఁడెదఁ, గరుణ నిక్కులంబు - గాచికొనుము. 174

తే. ఏవిధంబునఁ గోలుపోనీవు నీవు, పాండవుల నీదుసన్నిధి - బాపకర్మ
శీలుఁ డైనయశ్వత్థామ - గోలుపుచ్చె, వాని నే మనఁగలదు దుర్వార తేజ. 175

1. క. బెట్టు వగవుఁ బెంప. 2. గ. దరియించు. 3. చ. యలుకము.

వ. అని వెండియు. 176

చ. భువనము లొక్కపెట్ట మృతిఁ బొందిన జీవము లావహింప నే
ర్తు వలచినట్టు లైన గుణధరూధుఁడు మేనమఱంది పౌత్రుఁ జా
వ విడు తెఱంతవెంపున నవారణ నీ యొసఁగంగ బ్రలాపముల్
వివిధము లే మొనర్చితిమి వెఱ్ఱుల మై యిటు భక్తవత్సలా. 177

తే. అనినఁ గృపయును శోకంబు నగ్గలింప, వనజనాభుండు జను లర్థి విననగఁ బిన్న
వాని బ్రతికింతు వగవంగ వలవ దనియె, నెలుఁగు జలదస్వనమ్మునఁ బెల్లొసక మెసఁగ.

వ. ఎల్లవారును బ్రమోదంబు నొంద నట్లు పలికి సూతికాగృహంబునకుం గుంతీ
ప్రభృతులు దోడరా నతండు పోవునప్పు డది ధవళకుసుమసితసర్షపలాజపూర్ణ
కుంభప్రముఖమంగళవస్తువులను బ్రజ్వలితపావక ప్రదీప్తశస్త్రపిచుమందపల్లవాది
భూతపరిహారకపదార్థంబులను జతురవృద్ధాంగనాచికిత్సకదక్షపరిచారికాముఖ్యహిత
కారిపరివారజనప్రవర్తనంబులను బరిశోభితంబయి యుండె నమ్మందిరంబు గోవిం
దుండు ప్రవేశించె నట్టియెడ నంతకుమున్న. 179

సీ. కడచి ద్రౌపది సని యడలునఁ బడి యున్న, మాత్స్యనందనతోడ మాధవుండు
ననుదెంచె వీఁడె సవినయంబుగాఁ గను, మనవుడు నుత్థిత యై వికీర్ణ
వేణీభరంబుతో వినతి యొనర్చి భర్తార్తి వాపుట నీకు నతిదృఢవ్ర
తంబు కదే దేవ దయ వెలయంగ నీ, శిశువు సంజీవితుఁ జేయవయ్య

తే. నీవు గూర్చిన మేనల్లునికిఁ దదీయ, పుత్త్రి ద్రోణిపుత్త్రుఁడు బొలియఁ జేయు
వాఁడె పతిహీన యగు పాపవతికిఁ బుత్త్రి, హీనతయును బాటిల్లిన నెట్లు బ్రదుకు.

ఉ. నందనుచావు నిక్క మనుమానము జను టప్పుడ కల్గ దేవకీ
నందన యెల్లభంగి నరనందనుపాలికి [1]నాజి కేచి పో
వం[2]దనతోడి తెంపునకు వారక యిచ్చిన బాస దప్పె నిం
కం దనుఁ గన్న దెప్ప నొడికాఁ డని కొంకెదఁ గాని యచ్యుతా. 181

తే. పద్మనాభుండు వచ్చిన బాలుఁ జంకఁ, బెట్టికొని పోయి మ్రొక్కెదఁ బ్రీతి యెసఁగ
నని తలంచుచు నుండితి నమ్మనోరథంబు విఫలంబుగాఁ జేసె ద్రౌణి పేర్చి. 182

వ. అని యంత నిలువనివలవంతపెంపున బాలశవంబు నెత్తికొని యంకతలంబున నిడి
కొని తదాననం బాలోకించి. 188

ఆ. తాత లోకగురుఁడు దామోదరుఁడు వచ్చి యుండ లేచి మ్రొక్క వుజ్జ్వలాంగ
ధర్మవేది యైన తండ్రికిఁ బుట్టి య, ధర్మపరుఁడ వగుట తగునె నీకు. 184

క. కను విచ్చి గొంతిఁ జూడుము, ననుఁ జూడుము ద్రుపదనృపతనయఁ జూడుము నీ
జనకునితల్లి సుభద్రం, దనయా చూడు తల యెత్తి దరహాసముతోన్. 185

చ. అని పలవించి యాసరసిజానన మూర్ఛ మునింగి నేల వ్రా

1. క. నాఁటి కేచి. 2. క. దనతోడి తెంపునకు.

లినఁ గరుణాంబుపెంపున విలీనతఁ బొందుమనంబులుఁ జబా
ష్పనయనయుగ్మకంబులును ƺ బాడఱుమోములు నైనకౌరవాం
గనలయలంతఁ గాంచిన వగల్ మిగులుం బగవారి కేనియున్. 186

వ. ఒక్కింతసేపునకుం దెలివొంది విరాటనందన ధరాతలంబునం బడి యున్నభంగిన
ఫాలతలంబునం గేలు మొగిచి గోపాలదేవునకు మ్రొక్కుచు వెక్కుచు శరణు శర
ణని పలికిన నవ్వరమకృపాపరుఁ డోడకోడకు మనుచుఁ బాదప్రక్షాళనోపస్పర్శ
నంబు లాచరించి యశ్వత్థామప్రయుక్తంబును బ్రహ్మశిరోనామకంబును నగున
మ్మహాస్త్రం బుపసంహరించి యబ్బాలశవంబు శయ్యాతలంబునం బెట్టం బనిచి
దరోల్లసితు లైనయెల్లవారలం గలయం గనుంగొని. 188

—శ్రీకృష్ణుఁడు మృతజాతుం డైనపరిక్షితు లబ్ధజీవితుం జేయుట.—

తే. మీఁదఁబొంకగుమాటయేని మీరు వినఁగ, నాడ నిబ్బాలుఁ బ్రదికింతుఁ జూడుఁ డఖిల
జనులు నిప్పుడ తేలుంత్రు ƺ సంతసమున, దీని విని పాండవులు శ్రీతిసూనువారు

వ. అని ప్రతిజ్ఞ సేసి యిట్లనియె. 189

తే. పగఱయెడ నైన నే బొంకుసవలుక నేని, సమరముఖమున నెన్నఁడుఁ ƺ జలితవృత్తిఁ
బిఱిఁది కడు గిడనేని నిప్పిన్నవాని, యంగమున జీవ మిప్పుడ యావహిల్లు. 190

క. ధరణీసురకులము నెడం, గర మెక్కుడు ప్రియము నాకుఁ ƺ గలదేని సధ
ర్మరతుఁడ నయేని నియ్యు, త్తరాసుతుఁడు లబ్ధజీవితత్వము నొందున్. 191

క. నరు నియెడ నామనంబున, విరోధ మెన్నఁడును నేమివిధమున నైనం
బొరయమి నిజ మేనియుఁ సుస్థిరముగ నిబ్బాలు మేన ƺ జీవము సెందున్. 192

క. నిక్కపుధర్మపునయేఁ, నక్కంసాదుల వధింతు ƺ టారసి చూడఁగ
నిక్కవ మై యార్యజనుల, కెక్కనయేని నసువర్గ ƺ మీశిశువు గనున్ 193

తే. మహితసత్యంబుఁ బరమధర్మంబు గాఢ,నిర్మల, బ్రహ్మచర్యంబు ƺ నిత్యసుప్ర
తిష్ఠితంబు లై నాయందుఁ ƺ దేజరిల్లు, నేని నిబ్బాలునకు జీవ ƺ మిపుడ వచ్చు.

వ. అని యిట్లప్పురుషోత్తముండు వలికిన. 195

సీ. బాలుని మేనికిఁ ƺ బ్రాణముల్ వచ్చిన, నల్లన కదలెఁ దదంగకములు
మఱి కను విచ్చె నత్తెఱఁగు దెల్లంబుగాఁ, గని గొంతి మొదలైనకౌరవాంగ
నలు మనంబులు నిండి ƺ [1]యలువులఁ బాఱెడు, నానందపూరంబులనఁగఁ బొల్చు
హర్ష బాష్పములు రోమాంచకంచుకితదే,హంబులు నై యలరార నఖిల

తే. జనసమూహమ్ములును సంతసమునఁ దేల, గగనమున దివ్యవాణి యక్కమలనాభుఁ
బొగడె మిూఁతం డ్రి యున్నయప్పుణ్యగృహము, గరము శోభిల్లె నప్పుడు కౌరవేంద్ర.

ఉ. ఉత్తర బిడ్డ నెత్తికొని ƺ యొయ్యన మోమలరంగ వచ్చి [2]య
త్యుత్తమతేజుఁ డైన పురుషోత్తము నంఘ్రులపొంత భూస్థలిం

---

1. క. [illegible]. 2. 'యత్యుత్తమతేజుఁ డైనపురుషోత్తము' నని పెక్కుప్రతులు.

చిత్త మెలర్పఁగాఁ దనదుచెన్నగుఫాలము సేర్చినన్ ముదా
యుత్తమనస్కుఁ డై యతఁడు సాదరభావము గారవించుచున్. 197

క. వినుతబహురత్నవిస్ఫుర,దనేకభూషణనికాయ మబ్జాలున కి
చ్చినఁ దక్కటియదువీరులు, జననాయక యొసఁగి రక్కజంబగుతొడవుల్. 198

వ. అప్పుడు. 199

తే. ఆత్మకులము పరిక్షీణ మైన జనన, మొందెఁ గాన యయ్యభిమన్యునందనునకు
నర్హమగుఁ బరిక్షిన్నామమనియెఁ గృష్ణుఁ, డఖిలజనములువినఁ గౌరవాధినాథ.

వ. అట్లు పుండరీకాక్షుండు పాండవసంతానంబు గలిగించె నట్లప్పరమపురుషుచేతం బ్రత్యుజ్జీవితుం డైనభవజ్జనకుం డేకమాసవయస్కుం డగుకొలంది నొక్కపుణ్యదివసంబున. 201

సీ. ధర్మసుతుండును దమ్ములు నమ్మహా,కనక మల్లెత్తించికొని యుదాత్త
వైభవ మెసఁగంగ వచ్చినఁ గృష్ణని,యుక్తులై విదురయుయుత్సు లర్థిఁ
గస్తూరినీళ్లులకలయంపులను గప్పు,రంపు ముగ్గుల బహురత్నతోర
ణములఁ దోరపుముత్తియముల నొనర్చిన,ప్రాలంబమాలికావంక్తులను బ

తే. సిండిపూర్ణకుంభముల విశిష్టమరక,తప్రకరమయకదళికాస్తంభములను
గరము దోరంబుఁ జిత్రరేఖంబుఁగా న,లంకరించిరి పురముఁ గులప్రదీప. 202

వ. సకలజనంబులుం గయిసేసి కలయం బొలయు నప్పు డప్పురంబు చంద్రోదయఘూర్ణమానం బయినయర్ణవంబు ననుకరించె నయ్యచ్యుతుండును బలదేవసాత్యకిప్రద్యుమ్నప్రముఖులు ప్రమోదంబునం బొంపిరివోవుచుం బెంపారు నలంకారంబుల నభినవోదారచారుత్వంబు వహించి యెదురుచని పాండవులం గని రయ్యిరుదెఱంగులవారలును సౌహార్ద్రంబును సౌముఖ్యంబును సౌజన్యంబును నత్యంతంబును మెఱయ నర్హంబు లగునాచారంబులు నడపి రట్లు కృష్ణసమేతు లై మీ తాతలు హర్షోల్లాసభాసమాను లగుచు నాసమగ్ర కాంచనసంచయంబుఁ బురస్కరించుకొని పురప్రవేశం బాచరించి. 203

క. తొలుత ధృతరాష్ట్రగాంధా,రులఁ గని మఱి కొంతిఁ గాంచి ప్రోన్మీలచ్చ
క్షులుఁ బ్రమదసంభరితచి, త్తులు నయినయయుయుత్సునిఁ విదురునిం బ్రీతిన్. 204

వ. కానిపించికొని సంభావించి సంభృతాహ్లాదు లగుచుం గృష్ణాదియాదవలోకంబునుం దారు నొకరమ్యమండపంబున నుండి రట్టియెడ. 205

—•• వ్యాసుఁడు కృష్ణసహితు లై యున్నపాండవులయొద్దకు వచ్చుట. ••—

సీ. తగువారిఁ గాంచి యత్యద్భుతం బగుభవ,జ్జనకు తెఱంగు విస్తార మొప్పఁ
జెప్పిన వార లచ్చెరువాటు సంతసం,బును నెమ్మనంబులఁ బెనగొనంగఁ
బద్మనాభు ననేకభంగుల వినుతించి, యిట్టివి వింత లే యెల్లనాఁడు
నిట్టుల కాక మాయెడ నీమకరుణ పెం, పని యభినందించి రట్లు గలసి

లుగాఁ గనకంబునం గావింపం బనుపు మని చెప్పిన నప్పుడమిఱేఁడు. 216

క. తురగపరీక్షావిదు లగు, పురుషులఁ బిలిపించి యశ్వపుంగవుఁ గని తెం
డరయుఁడు మనకొదవములలో, నరవరహితశుభము గీర్తియంబునఁగన్. 217

వ. అని పలికి కర్మాధికారులం గనుఁగొని యజ్ఞంబునకు నలయునట్టిభాండ ప్రముఖంబు లయినసాధనంబులును స్రుక్స్రువాద్యుపకరణంబులును సువర్ణమయంబులుగా వేగంబ చేయింపఁ బలయు నని నియోగించిన నట్ల కాక యని చని వారును బదంపడి. 218

క. తురగంబును సంభారో, త్కరమును గొని వచ్చి చూప ధర్మజుఁడు పరా
శరసుతునకు వాని వినయా, పరత సమర్పించెఁ గురునృపాలవరేణ్యా. 219

క. ముని యశ్వముఁ జూచి కరం, బనురాగముఁ బొందిమేధ్య మగు నిది దీనిన్
వినుతవిధానమున వినుత, మనవృత్త నతఁ డతనితోడ సాదర సరణిన్. 220

తే. దీని రక్షింప నర్హుండు మానసిశుభ, బోధ మెవ్వండు నీమనసుబుద్ధి నరసి
యిట్టివాఁ డని యానతి యిమ్ము నాకు, ననిన నమ్మునినాథుఁ డత్యాదరముతోడ

క. దివ్యాస్త్రవిదుఁడు ధిషణా, భవ్యుఁడు శౌర్యోత్తముండు పార్థుఁడు దగు న
శ్వవ్యాపనక్రియకు నితఁ, డవ్యాహతి నాచరించు నక్కార్యంబున్. 222

వ. భీమసేనుండును నకులుండును మనరాష్ట్రంబు రక్షించువారు భవదీయకుటుంబకార్యంబులు సహదేవుండు నడపువాఁ డని నిర్దేశించిన. 223

—•• ధర్మజుం డర్జును యజ్ఞాశ్వరక్షణంబునకు నియోగించుట. ••—

సీ. అమ్మహీవల్లభుఁ డర్జునుఁ బిలిచి యధ్వరయోగ్యమైనయీతురగరత్న
మనఘ సంరక్షణీయంబు నీ కొరుఁడు, నిప్పని కర్హుండె యెల్లభంగి
నిక్కార్యమునకు నీ వేగంగవలయు నీయశ్వము చరియించుచుండ
నెడనెడ రాజుల కే నశ్వమేధదీక్షితుఁడ నై యుంట సెప్పు ముచిత

తే. కరణనియతి నిరోధంబు గాకయుండ, నడపు మని చెప్పి భీముని నకులు రాష్ట్ర
గోపనమునకు సహదేవుఁ గులకుటుంబ, సముదీరక్షకుఁ బనిచి యుక్తజ్ఞ నామునఁగ.

వ. మఱియునుం గలయట్టిపనుల కర్హజనంబుల నియోగించి గాంధారీధృతరాష్ట్రుల యనుమతి వడసి కుంతీసమనుజ్ఞాతుండై యశ్వమేధముఖంబున కున్ముఖుం డయ్యె నని యిట్లు ధర్మపుత్త్రపుణ్యచరిత్రంబు సెప్పిన నప్పరమధార్మికుం డసకల లోకమనోజ్ఞం బగుయజ్ఞం బెవ్విధంబున నిర్వహించె వినువేడ్క నాచిత్తంబునం జిగురొత్తెడుఁ జెప్పవే యనుటయు. 225

ఉ. మానమదాదిదోషపరిమార్జననిర్మలచిత్తభక్త స
న్మానసలోల వీతపరిమాణవిభూతివిశాల శాంతతా
హీనవిదూర విశ్వహితసేవవిచార నిరామయావ్యయ

స్థానకసిద్ధిమంగళవిగ్రహాయక [1] వేదసచ్ఛైకనాయకా. 226

క. అనపేక్షితఫలతాశ్రో,భజనమహనీయక్రియావిపాకాత్మకరూ
పనితాంతధూతసంశ్రిత,జనపాపా పరమమిత్రసత్యాలాపా. 227

మాలిని. తరుణజరఠభావద్రావణోదారమూర్తీ
హరణకరణనిర్మూలానతాభ్యంతరార్తీ
మరణజననదుఃఖోన్మాదహృత్పుణ్యకీర్తీ
చరణకమలపూజాశాలిచిత్తానువర్తీ. 228

గద్యము. ఇది శ్రీమదుభయకవిమిత్ర కొమ్మనామాత్యపుత్త్ర బుధారాధనవిరాజి తిక్కనసోమయాజి ప్రణీతంబైన శ్రీమహాభారతంబున యశ్వమేధపర్వంబునందుఁ దృతీయాశ్వాసము. 229



1. గ. వేదమాత్రైకనాయకా - జ. వేదసద్దేశనాయకా.



హరిహరనాథాయ నమః.

# శ్రీమదాంధ్రమహాభారతము

## అశ్వమేధపర్వము, చతుర్థాశ్వాసము



విద్యాశాంతకృతి
ప్రావీణ్యా [1]నిరూఢిగణ్యా ॥ పాదసతతసం
సేవనతత్పరహృత్కమ
లావాసకృతప్రమోద ॥ హరిహరనాథా. 1

ధర్మజుం డశ్వమేధదీక్షం బూని హయంబుం బుడమిం దిరుగ విడుచుట

వ. దేవా వైశంపాయనుండు జనమేజయున కిట్లనియె నట్లశ్వమేధయాగోద్యోగప్రద్యోతితుం డయినపాండవాగ్రజుదీక్షకు నర్హం బయినదినంబు సంప్రాప్తం బగుటయు మౌహూర్తికదత్తశుభముహూర్తంబునం గృష్ణద్వైపాయనాదులైన ఋత్విజులు వేదవిహితవిధానమహితంబుగ నక్కురుక్షితిపతి దీక్షితుం జేసి రవ్వసుంధరావల్లభుండు సంవీతక్షౌమకృష్ణాజినుండును దండపాణియు నయి ఋత్విగ్జనంబులు బలయుం బరమసంయమిపరివృత ప్రజాపతిప్రఖ్యుండును గనత్కాంచనాభరణభూషితుండు నయి బహుళప్రభలు నిగుడ సందీప్తపావకసన్నిభుండును నగుచు వెలింగెం దత్తుల్యాకల్పకల్పనంబున ఋత్విగ్జనసమాజంబునుం దేజరిల్లె నావేదవ్యాసమహామునిచేత శాస్త్రోక్తప్రకారంబున ముక్తం బయి హయోత్తమంబు వెడలె నప్పుడు. 2

సీ. వివ్వచ్చుఁ డాగమప్రవిధివంతముగ ధర్మనందను నామంత్రణంబు వడసి
గాండీవపాణి యై ॥ కవదొనల్ ధరియించి, తేజోవిశేషంబు ॥ రాజితముగ
హయ్యశ్వరత్నంబు ॥ ననుసరింపంగఁ బ్రజ, బాలురు వృద్ధులు ॥ భామినులును
లోనుగాఁ బఱతెంచి ॥ లోలత [2]నతనినా,హయమును గనుగొనుచు నప్పు డగ్గ
తే. లంపుసందడి నూష్మ జనింప నాజనంబు లవ్వీరునకు దీవనలఁ బొగడ్త
లను బ్రమోద మొనర్చిరి సవనధిరవము, నమకరించెనయ్యాలివు నృపాగ్రగణ్య. 3

---

1. క. నిరూఢగణ్యాపాతసతత, 2. గ. నతని హాహాయమును గనుంగొను.

వ. ఇవ్విధంబునం జనానాకవ్యాసితోడ యజ్ఞకర్మకుశలుం డైనయాజ్ఞవల్క్యశిష్యుం డక్షవిధానంబులకయి మాననీయవిప్రజనసహితంబుగాఁ జనియె నప్పరమతురంగంబు ధరణిం బ్రదక్షిణరూపంబునం దిరిగి యుత్తరాభిముఖం బై యల్లనల్లన యరుగుచుండ నర్జునుం డనుసరించి పాలనపరుం డగుచుం బ్రవర్తింపం ద్రిగర్తదేశంబునందు. 4

—❀ అర్జునుతోఁ ద్రిగర్తదేశాధిపతులు యుద్ధము సేయుట. ❀

సీ. ఉద్ధతు లై త్రిగర్తోర్వరాపతిపుత్త్ర,పౌత్త్రు లయ్యశ్వంబుఁ బట్టువారు
గాఁ బూని తేరులు గడురయంబునఁ దోలి,కొని యడ్డముగ వచ్చి కోలుతలకు
వలుగక నరుఁ డన్న యానతి దలఁచి యా,రాజకుమారవర్గంబుతోడ
ధర్మజునశ్వమేధంబున కపకార,మాచరించుట పాప మదియుఁ గాక
తే. యేము మీరును బాంధవులమనక మెసఁగ, నడుము టొప్పదె పగయేల నంగ వారు
సూర్యవర్మనాముఁ డగుణోన్నతమతు, మారుఁ డగ్రణి గాఁగ నుదారలీల. 5
చ. కవిసిన వారితో మఱియుఁ గవ్వడి యిట్టు లనుం జయాధురా[illegible]
ప్రవణుఁ డజాతశత్రుఁడు తురంగమరక్షకు నంపునప్డు భూ
పవితతి యెల్లనుం దెగియె భారతయుద్ధమునందు బాలురం
దివిరి వధింపఁ గాదు కృపఁ దిన్నఁదనం బెసఁగం జరింపుమీ. 6
చ. అవినయవృత్తి నశ్వమున కడ్డము వచ్చిర యేని నీవు బాం
ధవము దలిర్పఁ బల్కి యనిఁ దప్పఁగఁ ద్రోవుము కిన్క మాను మ
న్నవచనవృత్తి నా దగుశాసనంబున నెక్కొని యుక్కుఁ జేసి యా
హవమున గొల్లనయ్యెదఁ బ్రియంబులు గావొకొ మీకుఁ బ్రాణముల్. 7
చ. వలవదు పొందనంగ నిలుకపం బడ కేవున సూర్యవర్మ యు
బ్బలియునిమీఁదఁ గ్రూరశరపంక్తి నిగిడ్చినఁ ద్రుంచెఁ జిప్పయ
మ్ముల నది యెఱ్ఱనవ్వు తనమో మనుతమ్మికి లేఁతయెండ యై
[1]చెలువముచెన్న వింతలుగఁ జేయఁగ నావిజయుండు భూవరా. 8
వ. అట్టియెడ. 9
తే. సూర్యవర్మనితమ్ముఁడు శూరవరుఁడు, కేతువర్మ గాండీవిపై శాతబాణ
వృష్టిఁ గురియుచు నుద్ధురవేగ మొప్ప, నన్నఁ గడచి బెట్టడరిన నన్నరుండు. 10
చ. అతని నొడుంగ నేయుటయు నాతనితమ్ముఁడు చండవిక్రమో
ద్ధతి ధృతవర్మ నాముఁ డతిదారుణసాయకపంక్తి సత్వరా
తతగతిఁ బర్వఁ జేయుచుఁ బృథాసుతుఁ దాఁకిన మెచ్చు వచ్చి య
య్యతిరథవర్యుఁ డప్పుడు తదంగము లేయఁగ నొల్ల కుండుటన్. 11
చ. శరములు ద్రుంప నాతఁడు వెసన్ బలునారసముల్ నిగిడ్చె న

1. చెలువముఁ జెన్న.

క. నడుమన వానిం బార్థుఁడు, పొడిగా సేయంగఁ గనలి భూపకుమారుం
డడరించెఁ దోమరంబులు, గడఁ బెక్కువి మిడుతకదుపుగతిఁ గవియంగన్. 22

ఆ. అనలశిఖలువోని యమ్ములగమి వాని, రూపు మాపి యన్నరుండు వాఁడి
లేనిదొడ్డతూపులేనింటఁ దొడిగి రాచ, కొడుకు నేసెఁ దూలి పుడమిఁ గూల 23

క. కూలియు నీడంబోవక, బాలుఁడు రయ మార దంతిపైకిం జని దో
ర్లీల మెఱయ నరుఁ బటుశర, జాలంబులఁ బొదివె గగనచరు లగ్గింపన్. 24

చ. అతఁడును దీవ్రబాణముల నాభగదత్తతనూజుదంతి నా
వృతముగఁ జేసె నట్లు పృథివీవరనందన యేమి సెప్పుదున్
శతమఖపుత్త్రుతోడ [1]దివసత్రయ ముగ్రరణం బొనర్చె న
ద్భుత మెసఁగం జతుర్థదినముం దెగనంతకుఁ బోరె ధీరతన్. 25

వ. [2](తెగియెడుసమయంబున.) 26

ఆ. అక్కుమారుఁ జేచి యర్జున యర్జున, యేను గలుగ నీకు నెందుఁ బోవ
వచ్చు వృద్ధుఁ డైనవాఁడు గావునఁ దండ్రి, నడఁచె నట్లు నన్ను[3]సమతె బేల.

వ. అని యదల్చి. 28

క. పెనుసెలయేఱులు వాఱఁగఁ, దనరుగిరియుఁబోలె బహుమదంబుల దొరఁగం
గనుపట్టుకంజరము సింహాసిభుం డగుపార్థుమీఁద నడరం జేసెన్. 29

క. అది [4]ఫూత్కారము సేసిన, నొదవినకరశీకరముల నుర్వీవర యం
బుదముక్తసలిలధారలు, వొదివినగిరివోలె నింద్రపుత్త్రుం డొప్పెన్. 30

చ. కరి యిటు లేపునం గవియఁగా భగదత్తసుతుండు దీప్తని
ష్ఠురశరపంక్తి నాహవపటుత్వము సూపిన నల్పకోపసుం
దరుఁ డగుచున్ నరుండు శతధారనిభం బగునారసంబు భీ
కరగతి నేయఁ గూలె నది కౌరవనాయక పర్వతాకృతిన్. 31

క. కూలిన నేలకు వచ్చిన, బాలుం గని నాకలోకపతిసుతుఁడు దయా
లోలుం డై మార్దవమృ, ద్వ్యాలాపము లొప్ప నిట్టు లను నాతనితోన్. 32

వ. ధర్మతనయుం డశ్వమేధదీక్షితుం డయి యత్తురంగంబుపజ్జ నన్నుం బుత్తెంచు నప్పుడు. 33

క. చంపకమిత్రరాజుల నను, కంపాతిశయంబు మెఱయఁగా నడపుము నీ
పెం పనుకుసుమమునకు నాపం బొనరించుటయ సౌరభముగ నెఱుఁగుమీ. 34

క. అనిమెం గావున నీపైఁ, గినుక వొడమ దలుక విడువు గీతయశుం డా
జనపతియాగంబునకుం, జను దేరఁగ వలయు బంధుజనములు నీవున్. 35

ఆ. అధిపతనయ నిన్ను నామంత్రితునిఁ జేసి, పోవుచున్నవాఁడ నీవు హాస్తి
పురికి భావిచైత్రమునఁ బున్నమకు ముద, మొదవ నరుగుదెంచుటొప్పుఁ జేయు.

---

1. క.చ.ట. దివసద్వయ...దృతీయదినముం. 2. ఇది పెక్కిటలేదు. 3. గ. సనితె. 4. చ. ఘీంకారము.

క. అనిన నతఁ డట్లకాకని, వినతుం డగుటయును బ్రీతి ౹ విజయుం డభినం
దన మాచరించి యశ్వము, వెనుకఁ జనియెఁ బూరుకులపవిత్ర చరిత్రా. 37

అర్జునుఁడు సింధుదేశాధీశులతోడ యుద్ధంబు సేయుట.

వ. అది సింధుదేశవర్తియగుటయు భారతరణహతు లయినసైంధవయోధులపుత్త్రపౌత్త్రులు పూర్వవైరంబు వాటించి యాటోపంబున ననేకసహస్రసంఖ్యలరథికులు రాజనందనులుం గూడుకొని క్రీడిపై నడచి రట్టియెడ. 38

సీ. అరుణాంబుదంబులు ౹ వరఁగి పెన్నుత్తురుఁ, గండలుఁ గురిసె మార్తాండబింబ
మసితారుణచ్ఛాయ ౹ మయ్యె నుల్కాతతు, లెల్లదిక్కులఁ బెల్లు ౹ డుల్లె నశ్వ
సహితంబుగా సవ్యసాచిఁ జుట్టును ముట్టి, యతనిపైనయ్యోధవితతి యొక్క
పెట్ట శస్త్రాస్త్రముల్ ౹ బెట్టుగాఁ గురిసిన, నప్పాండవుఁడు పెనుడప్పి సోలె
తే. నేమి సెప్పుదు నీకు నుద్దామవిక్ర
మాభిరాముండు నాఁ జనునక్కిరీటి
కరము కరము బెం డగుటయు ౹ గాండివంబు
వడియెఁ బుడమిపైఁ గురునరపతివరేణ్య. 39

చ. అనిమిషులున్ మునీశ్వరులు ౹ నప్పుడు శోకమునన్ మునింగి య
ర్జునజయకాంక్షు లై నియతి ౹ శుద్ధి [1]వహించి సవీర్యమంత్రసా
ధనపరు లైరి తెప్పిలి యతండు ధనుర్ధరుఁడున్ సముల్లస
త్తనువిభవోజ్జ్వలుండు సముదగ్రమనస్కుఁడు నయ్యె భూవరా. 40

వ. ఇట్లు తెలివొంది విజృంభించి. 41

శా. నారాచప్రముఖాస్త్రజాలపటువిన్యాసంబు తీవ్రత్వరా
ఘోరం బై విలసిల్లఁ జేయ సమరక్షోణీతలం బంతయున్
వైరివ్రాతశవావృతం బగుడు గీర్వాణుల్ మునుల్ సిద్ధుల
వ్వీరుం బ్రస్తుతి సేయుచుం బొదలి రుద్వేలప్రమోదంబునన్. 42

వ. హతశేషం బైనయాసింధురాజకుమారసైన్యంబు దైన్యంబు నొంది నలుదిక్కుల విచ్చియు నొచ్చియు వివ్వచ్చుండు రణధరణిం బొలిచి నిలుచుటఁ జూచి మాత్సర్యధుర్యం బై మగుడం బోరికిం బూని యడరిన నప్పురందరనందనుం డందలి రథికముఖ్యులతోడం దమయన్న సెప్పినవాక్యంబు లుపన్యసించి మీ రేల జాలిం బడియెదరు ప్రాణంబులు మీ కింతసేఁ దయ్యెనే యని పలికినను నిలువక పైపయి వా రురవణించిన. 43

క. నవ్వుచు నానాశరముల, నవ్వీరులఁ బొలియఁ జేయ ౹ నంతయు విని తా
నెవ్వగతో దుశ్శల యా, కవ్వడిఁ బౌత్త్రాన్వితముగఁ ౹ గానఁగ వచ్చెన్. 44

సీ. వచ్చి కన్నీళ్ళు ౹ వదనంబుపై వెల్లి,గొన రోదనంబు సేసిన నతండు

---

1. గ. వహించినవీర్యమంత్ర.

దయు నిలనిడి యోఁ గోదండ మప్పుడఁతుక, పౌత్త్రునిఁ జూపి యబ్బాలుఁ గావు
మితఁడు మీయల్లునీసుతుఁ డన్న నప్పార్థుఁ, డిప్పుడు నాయల్లుఁ డెచట నున్న
వాఁ డని యడిగిన వనిత వెక్కుచు నతం, డాత్మీయజనకుఁ దుగ్రాహవమున
తే. ననఘునీచేతఁ దెగుట దా విని నితాంత, శోకమగ్నుఁడై యుండి నీరాక బిట్టు
వినుట వెగ్గలి ప్రాణముల్ విడిచె ననుచు, నెలుఁగు గడలుకొనంగఁ [1]బెల్లేడ్చె నధిప.
వ. అప్పుడు శోకాక్రాంతుం డయి గాండీవి వదనంబు వాంచి యుండ నయ్యుగ్మలి
యతని నుద్దేశించి. 46
సీ. ధార్తరాష్ట్రులకీడు దలఁపక సైంధవు, కొఱగాము తెల్లను మఱచి తండ్రి
లేనియీశిశువుపై మానితం బైననీ, యక్కటికంపుఁజూ పసరఁ జేయు
మాశ్రితవత్సల యనుచు నబ్బాలునిఁ, జరణానతునిఁ జేసి శరణు శరణు
కృప నన్ను రక్షింపు కీర్తియు ధర్మంబుఁ, జేకొను మనవుడుఁ జిత్త [2]మడల
తే. రాచకొల మిదిగాల్పనే కార్యమూల, మని తలంచుచు నాతఁ డయ్యతివతోడ
నధమవృత్తిసుయోధనుం డంతకంటె, నేముఁ గొఱగాము మాచేత నింతవుట్టె.
క. అనుపలుకు వలికి బహుసాం, త్వనముల నూరార్చి యాసుదతిమస్తకముం
దనయక్కునఁ జేర్చి యబల, చనుము వగవు దక్కి యని ప్రసాదభరితుఁడై. 48
వ. వీడ్కొలిపిన దుశ్శల దనమనుమనిం దమబలంబులం గొని ప్రియంబునం జనియె
నయ్యనిమిషపతిసుతుండును గ్రతువిషయంబు లయి వలయు ననుష్ఠానంబులు విధి
వంతంబులుగాఁ జలుపుచుఁ దురంగంబు వెనుకం దారా మృగానుసారి యయిన
పినాకపాణియుం బోలెఁ బోవు చుండ నదియును నిజేచ్ఛ నఖిలదేశంబుల సుఖ
సంచారంబునం బ్రవర్తిల్లుచుఁ గ్రమంబున [3]మణిపూరపురంబు నుపాంతంబున కరి
గిన నన్నగరంబుపతి యైనబభ్రువాహనుండు నిజజనకుం డయిన యర్జును రాక యా
కర్ణించి. 49
ఆ. వినయ మొసఁగ నార్య జనసమేతంబుగా, నరుగుదెంచి యతనిచరణములకుఁ
బ్రీతి నెఱఁగ నక్కిరీటి యన్నరపతి, నాదరింప కుండె మేదినీశ. 50
వ. అట్లుండి తనయు నాదరంబునకుం గారణంబెఱుంగక సవిచారుం డై యూరకున్న
యక్కుమారునితో ధనంజయుం డిట్లనియె. 51
ఉ. యాగవిముక్తమై చనుహయంబున కడ్డము వచ్చి పట్టి కా
కీగతి మొత్తఁబాటు దగునే నృపధర్మవిహీనత క్రణో
ద్యోగము లేక తక్కి భయముల్లముఁ జేరఁగ నిచ్చు రాజురా
జే గుణహీన పొమ్మనిన నేమియుఁ బల్కక తండు గ్రమ్మఱన్. 52
సీ. అరిగి పట్టనవీథి నల్లన చనుచుండ, నర్జునుం డతనితో నాడినట్టి

1. గ. క. చ. బెట్టేడ్చె. 2. ట. మురిలి. మరియ 3. మూలమునను దెనుఁగునను 'మణలూరపుర' మనియు 'మణిపూరపుర' మనియు రెండుపాఠము లున్నవి.

తెలిఁ గెల్లఁ దన దగుదివ్యబోధంబునఁ, గని భుజంగోత్తమతనయ సదయ
వృత్తిఁ బాతాళంబు వెలువడి యన్నరా, ధిపునిపాలికిఁ జనుదెంచి యేను
మీతల్లి నాగేంద్రసూతి నులూపి నా, పేరు హితంబు సెప్పెదు మనీష
తే. నరుగుదెంచితి వినుము మీయయ్యపసుపు
దలకొనుము రాజులకు స్వధర్మమైన
యని యొనర్పుము దనతోడఁ బెనఁగు టధిక
సమ్మదము సేయు నక్కురుసత్తమునకు. 53
క. అనిన సభక్తికముగ న, వ్వనితకుఁ బ్రణమిల్లి యాహవము జనకునితోఁ
జనునె యొనర్పఁగ నని య, ప్పనికిఁ జొరక వచ్చితిని శుభప్రదమూర్తీ. 54
క. నీ వింత దెలిపి పలికెద, వావిభుఁడును మున్న నన్ననుమతుఁ జేసెం
గావునఁ దల్లీ మీకుం, గావించెద నిద్దఱకు నఖండప్రియమున్. 55

బభ్రువాహనుం డర్జునునితో యుద్ధంబు సేయుట.

చ. అని నిజమందిరంబునకు నయ్యెలనాగఁ దగంగఁ బుచ్చి య
మ్మనుజవరుండు సాధనసమంచితమైనరథం బుదాత్తరే
ఖ నెఱయ నెక్కి యస్త్రపరికల్పితభూషణలేపనాంబరం
బును సమరోత్సవోద్ధతవిభూతియునై తనమే నెలర్పఁగన్. 56
ఆ. ఎక్కి హంసకేతు వేడ్తెఱఁ గ్రాలంగ, నరిగి యశ్వమునకు నడ్డపడఁగఁ
జూచి మెచ్చి సవ్యసాచి మార్కొనుటయుఁ, గురిసెనతఁడు నిశితశరచయంబు.
శా. వానిం దా నవలీలమైఁ దునిమి దుర్వారోద్యముం డద్రిభి
త్సూనుం డొక్కటనాత్మసూను నొడలం దూపుల్ నిగిడ్చెం బవా
జానిశ్శంకుఁడు బాహుసారమద మేపారంగ నవ్వీరు మేన్
వే నారాచము లైదునాలుగులు పృథ్వీనాథ నాటించినన్. 58
చ. మదిఁ గొనియాడి యారిపువిమర్దనుఁ డంచసిడంబు ద్రుంచియే
పొదవఁగ మేను నొంప నచలోద్ధతి నాతనిజత్రు వేసె బె
ట్టిద మగునారసంబునఁ గడిందిమగం డగుబభ్రువాహనుం
డది వడిపేర్మి శోణితజలార్ద్రిత నొందక యుచ్చి పోయినన్. 59
క. అమ్మేటిమగఁడు దనచా, పమ్మూఁతగ నిల్చి సోలి పదపడి తెలివు
ల్లమ్మిన నొలసిన నారా, యిమ్మడి యని పొగడెఁ గొడుకు నెంతయుఁ బ్రీతిన్. 60
తే. పొగడి యేఁ దీవ్రశరములు నిగుడఁజేయు
నుద్ధతికి మంచిబంట వై యోర్వ వలయుఁ
జుమ్ము రా యని పలికి వాలమ్ము లధిక
రయము మెఱయంగ బరఁగించె రాజముఖ్య.
ఆ. మొనసివాని నతఁడు మొత్తునియలుగాఁగఁ, జేయు మత్సరంబు చిత్తవృత్తిఁ

దనికి సత్వరముగఁఽ దద్గాత్రమున నించె నరుఁడు పెక్కుమెఱుఁగుఁఽనారసములు.

ఉ. దానికి నీడఁబోవక యుఽదగ్రపరాక్రమ మొప్ప వజ్రకీ
లానిభతీక్ష్ణ మెఱుంగులవిఽలాసము నింగి వెలుంగ నుద్భటుం
డై సిగిడించెఁ బార్థుహృదఽయస్థలి నారస మస్త్రశస్త్రవి
ద్యానిపుణత్వశాలి యగుఽనన్నరపాలసుతుండు భూవరా. 63

—అర్జునుఁడు బభ్రువాహనునిశరంబుచేతఁ బుడమిఁ ద్రెళ్లుట.—

క. వడి నది వీపున వెడలినఁ, బడియెఁ బుడమి నర్జునుండుఽ పదపడి త్రెళ్లెం
గొడుకును మున్నతఁ జేసిన, బెడిదపుఁ బోటులయలంతఁఽ బృథ్వీనాథా. 64

వ. అట్లు దనపతియును సుతుండును భండనంబునం బడుట విని శోకాక్రాంత యగు
చుఁ జిత్రాంగద యులూపియుం దోడన చనుదేర నచ్చటికి వచ్చె నట్లు వచ్చి
యచ్చెలువయిద్దఱుపురంగనుంగొని యుల్లంబుజల్లనఁ దల్లడిల్ల మూర్ఛమునింగి
మేదినిం బడి కొంతవడికిం దెలిసి యులూపి నాలోకించి. 65

సీ. నీకతంబునఁ బతిఽ నాకుమారునిచేత, ననిఁ బడి యున్నవాఁఽ డతివ కంటె
నీవు పతివ్రత గావె ధర్మజ్ఞవు, గానిదానవె యేమిఽకారణమున
నిది కార్యముగఁ జెప్పిఽ తీపిన్నవానికిఁ, గొడుకుదిక్కున నాకుఽ నడలు లేదు
వరుఁ జూచి పొక్కెదఽ వామాతి నీదెసఁ, దప్పు సేసినను నీఽతనిఁ గృపార్ద్రి

తే. చిత్తవై యెల్లభంగి సంఽజీవితుఁడుగఁ, జేయవమ్మ యక్కట నాథుఽనేయుఁబనిచి
నావు సూచియు వగవవుఽ సాహసమున, గొలఁదిలేదు నిన్నేమందుఁఽగులవరేణ్య.

వ. అని పలికి పార్థుం జేరం బోయి, 67

ఆ. మహితకీర్తిలోలఽ మత్ప్రాణవల్లభ, యన్యజనుల ప్రాణఽ మరసి కావఁ
జాలునట్టినీకుఽ నేల ప్రాణంబుల, నిట్లు వదలి పోవఽ నిచ్చియుండ. 68

సీ. నాథ నీ వెప్పుడుఽ నన్ను మన్నింతువు, కను విచ్చి చూడకఽ యునికి దగునె
హాయమున కెవ్వరుఽ నడ్డంబు రా కుండ, [1]నాఁగితి వగ్రజుఽనధ్వరంబు
వమ్మయి పోకుండఽ లెమ్మ తురంగంబు, వెనుకొన వలవదేఽ యనఘ నీకు
నని యార్తిఁ బలవించిఽయుహావుత్త్రి దెసఁ జూచి,సుతుఁడెట్టులుండినఁఽబతికి నిమ్ము

తే. జీవ మాంద్రుఁ బెక్కండ్రఁఽ జేసికొనుట
పురుషులకుఁ దప్ప భార్యలిఽత్తెరువునందు
[2]నడవరే యోర్చి నీదుమఽనమున నింత
యొఱఁగి కలిగింపు వరు వేయుఽ నేల తల్లి. 69

వ. అని యంత నిలువక. 70

ఆ. కొడుకుచేతఁ జచ్చిఽ పడి యున్న యిక్కఱు,కులవరేణ్యుఁ గరుణఽ గూరి నీవు
బ్రదుకఁ జేయ కున్నఁఽబ్రాయోపవేశన, మాచరింతు నహికుఽలాగ్రగణ్య. 71

1. క. నాఁగి నీయగ్రజునధ్వరంబు. 2 గ. నడతురే.

వ. అని పలికి పతిచరణంబులు శిరంబుసోఁకం బ్రణమిల్లి యాసీన యై యూరకుండె నట్టియెడ బభ్రువాహనుండు దెప్పిఱి లేచి యప్పొలంతిం జూచి. 72

చ. ఇంచుక యేనియుఁ గావనట నెన్నఁడుఁ బొందనితల్లి నేఁడు నా
మంచితనంబునం బిలుకుమూలిననాథుని నుగ్రశత్రులన్
మంచు నినుండు వోలెఁ బరిమార్చుమహాబలుఁ జూచి యిట్లు దుః
ఖించుచు నుండఁ జూచితి సకిల్బిషచిత్తున కింత పెద్దయే 73

క. గాదిలితనయుఁడ నగునే, గా దన కిక్కురుకులాగ్రగణ్యుని నిమ్మై
మేదినిఁ గూల్చితి మణికిరణోదాత్తం బైనమకుట మూర్ధ్నిం బొందన్. 74

వ. అని విలాపంబు సేసి విష్వక్చ్యుతోడం గూడ యజ్ఞతురంగానుసారులై వచ్చిన యాజ్ఞవల్క్యశిష్యప్రభృతిబ్రాహ్మణజనంబులు నయనపథప్రాప్తు లగుటయు. 75

సీ. అధ్వరహయవిషయంబుగా వీ రేమి, పని సేయువారొక్కొ పార్థుఁ డిట్లు
పడియున్నవాఁ డని పలవించి జనకుని, నిట్లు సేసినపాపుఁ డెవ్విధమున
నాచరించునొకో ప్రాయశ్చిత్తమని పల్కి, పండ్రెండువర్షముల్ భైక్షవృత్తి
నిమ్మహాత్మునికపాలమ్మున నడపంగ, వలయుఁ గా కొండెద్ది గలుగ నేర్చు

ఆ. నని యులూపిదిక్కుఁ గనుఁగొని నీవు పన్నంగఁ దండ్రి నిట్లు భండనమున
విగతజీవితుండుగఁ దెగఁ జేసితిని నింక, నెలమిఁ బొందు భరతకులపవిత్ర. 76

వ. అని వెండియు. 77

క. జనకునిఁ దెగటార్చినపాపునకుం బ్రాణంబుతోడి కి[1]పొత్తు మనంగా
మనమునఁ దాలిమి గలుగునె, చనుఁగాక యతండు సనినసద్గతిక తగన్. 78

వ. అని యుగ్గడించి స్థావరంబులు జంగమంబులు నగుభూతంబులు విన భుజంగపుత్రియు నాకర్ణింపఁ జెప్పి [2]వ్రతంబు నిష్ఠం బూనెద మాతండ్రి లేకునికి నిజం బగునేనిఁ బ్రాయోపవేశంబ యుత్తమకృత్యంబు వీరవధంబు పాపం బంతకంటెను రాజవధం బెక్కుడంతకంటెఁ గడునగ్గలంబు ధార్మికవధంబు జనకవధపాతకం బింతయని కొలంది యిడ రాదిట్లుండ వీరుండును రాజును ధార్మికుండును జనకుండు నైన యిమ్మహితాత్ముని వధియించినమహాపాతకుని కేతద్వ్రతానుష్ఠానంబు దక్క నొండుమెయి నిష్కృతి గల్గునే దీని నడపెద నని పలికి యప్పురమునియతుం డుపస్పర్శనం బాచరించి పలుకు లుడిగి కూర్చుండె నప్పుడు. 79

—✿ ఉలూపి సంజీవనమణిచేత నర్జునుం బ్రతికించుట. ✿—

ఆ. అట్లు దెంపు సేసి యాసీనులైనయా, తల్లిఁ గొడుకు నవనిఁ ద్రెళ్ళి యున్న
విజయుఁ జూచి పాఁపవెలఁది సంజీవన, మణిఁ దలంచెఁ గురుసమాజముఖ్య. 80

వ. తలంచిన భుజంగమంబులకుం బరాయణం బైనయమ్మణి యమ్మహాభాగహస్త

1. 'పొత్తున మనఁగా' అని కొన్ని ప్రతులు. 2. గ. వ్రతం బనుష్ఠింపం.

తలంబునకు వచ్చిన నాభామిని బభ్రువాహనునాననం బాలోకించి. 81

సీ. విజయుండు సచ్చునే వేఁదుఱులార యింద్రునిచేత నైన నీతనికి నొక్క-
ప్రియము సేయంగఁ గోరియునునీకొఁదియా, రయుబుద్ధినీతండు రణ మొనర్పఁ
దలఁచిన నిర్వీరుతలఁపు సిద్ధింపంగఁ, జేయుటయును నింత సేయ వలసె
నాకుఁ గావున మోహనం బగుమాయాప్ర, యోగంబు నడపితి నుజ్జ్వలాత్మ
తే. నరుఁడు నారాయణుఁడు మహాత్తరము సువ్వె, యితని తేజ మెవ్వరికి నెట్లు దాని
నార్పవచ్చుమీవగ పెల్లఁ దీర్పు నిపుడ, యుత్థితుం డగునీకౌరవోత్తముండు. 82

వ. మాయాప్రయోగంబ వేఱొండు గాదు నీకు నీతండ్రితోడ భండనంబు సేయ బుద్ధి పుట్టించితి నింతమాత్ర యని తత్ప్రదేశంబున నున్నయెల్లజనంబులు నుల్లంబుల నానందంబు నొందఁ బలికి యమ్మణిపూరపురపతికరతలంబున నమ్మణి యిడి దీని నిమ్మహాత్మునిహృదయదేశంబున మోపు మనవుఁడు నతం డట్ల చేయుటయుం బార్థుండు ప్రత్యుజ్జీవితుం డై. 83

తే. లేచి కూర్చుండి కలయంగఁ జూచి యెల్ల
సెరలకాంతియు దంతరుచియును బెరయ
నతిమనోహరముగఁ దనసుతునితోడ
మనుజనాయక కుశలమే యనుడు నతఁడు. 84

సీ. వినయ మారంగ నాతనిచరణంబుల, కెఱఁగి భవత్పుణ్యవీక్షణమున
నఖిలంబుఁ గుశలంబ యనిన నిజ్జనముల, మొగములయం దెల్ల వగవు దోఁచి
యచ్చెరువాటును హర్షంబుఁ గదిరెడు, నిది యేమి సెప్పవే యెఱుఁగుదేని
నాచెప్పినట్ల రణంబున కేతెంచి, తీవు చిత్రాంగద యేల వచ్చె
ఆ. నిచ్చటికి నులూపి [1]యేమిటి కివుడు స
న్దెంచె ననుడు భక్తినిర్భరముగ
నతఁడు సాఁగి మ్రొక్కి హస్తముల్ మోఁగిచి య
య్యహితనూజఁ జూపి యతనితోడ. 85

వ. అంతయు నిమ్మహానుభావ నడుగుం డనిన గాండీవి యాయింతివదనం బాలోకించి కురువంశనిస్తారకా నీరాకకుం గారణం బేమి యిమ్మణిపూరపురనాథుని దెస నావలన భవదీయచిత్తంబు ప్రసన్నం బయి యున్నయదియె యిన్నరపతియును నేనును జిత్రాంగదయును నీ కేమియు నపరాధంబు సేయము గదా యనుటయును. 86

—✿ ఉలూపి యర్జునునితో వసువులశాపప్రసాదంబుల నెఱింగించుట. ✿—

సీ. అల్లన నవ్వుచు నయ్యింతి యతనితో, నాథ నీయం దొకనాఁడు నెగ్గు
గలదె నాపుత్త్రునివలనఁ గీ డెక్కడి, యది వినీతాత్మ చిత్రాంగదయును

1. గ. యేటికిఁ జనుదెంచె, ననుడు నచలభక్తివినయగతుల.

గినియుక విను మేను ÷ వినతోత్తమాంగ నై, చెప్పెద నీసుతుఁచేత నీకు
నావహిల్లె సమిథ ÷ మాహవంబున నీవు, గంగాతనూజు శిఖండి నెపము
తే. గాఁగఁ దెగటార్చి తది పాతకంబు దాని, కనఘ నిష్కృతి సేయక ÷ తనువు విడిచి
తేని నరకవాసమునకుఁ ÷ బోన వలయుఁ, గాన నిష్కృతి సేసితిఁ ÷ గడఁగి వచ్చి. 87

వ. అది యెట్లంటేని నాకర్ణింపు మే నొక్కనాఁడు సఖీసమేతంబుగా సురనదీస్నానంబునకు వచ్చి యుండ వసువు లక్కడ కేతెంచి యింత నంత నొక్కరేవున నం దోఁచి కృతస్నాను లై నిజరూపంబున సన్నిహిత యైనగంగాదేవితోడ గాండీవధరుండు శిఖండిం బురస్కరించుకొని గాంగేయుం డేయ కుండం బరమసాయకంబుల నతనిం గూల్చె నట్లు కుత్సితజయార్జనం బొనర్చినయయ్యర్జును నేము శాపసంతాపితుం జేయుదు మని చెప్పిన నప్పరమానుభావయు దానికొడంబడినపలుకు వలికె నంతయు విని తత్క్షణంబ. 88

సీ. అరిగి యేఁ దండ్రికి ÷ నత్తెఱం గంతయు, నెఱిఁగించుటయు నతం÷డెసక మెసఁగ
భయమున రయమునఁ ÷ బఱతెంచి వసువులఁ, బెక్కువిధంబులఁ ÷ బ్రియము పుట్టఁ
దెలిచి ప్రార్థించిన ÷ నలుక వో విడిచి వా, రతనితో విను సమ÷యం బొకండు
సేసెద మనిలోన ÷ వాసవిఁ దత్సూనుఁ, డగుబభ్రువాహనుం ÷ డస్త్రవితతిఁ
ఆ. బఱపి కూల్చెనేనిఁ ÷ బాయు నక్కిల్బిష, మనిన మగిడి వచ్చి ÷ యాభుజంగ
నాథుఁ డెల్లఁ జెప్పె ÷ నాకు నిప్పని దగ, నిట్లు దీర్చితిని సమిద్ధతేజ. 89

వ. తీర్చినతెఱంగు నెఱింగించెద నని పలికి బభ్రువాహను నుపలక్షించి యిక్కుమారుండు నీతో సమరంబు సేయ నొల్లక నీకు నమస్కరించి మరలి మందిరమునకుం బోవు చున్కి బుద్ధిం గని సమయకార్యంబునకు నిది యవసరం బని యూహించి రయంబున నితనికడకు వచ్చి రణంబు మీతండ్రికిఁ బ్రియంబును ధర్మంబు నని చెప్పి యితనిం బోరికిం బురికొల్పి యివ్వీరునియందు వసువులు సెప్పినవిధంబు గలుగునట్లుగా విక్రమవిశేషం బావహించితి. 90

క. అనినఁ బ్రియ మంది దేవీ, యనఘం బగునీచరిత్ర ÷ మస్మత్కులవ
ర్ధనకారి యగుట యెప్పుడు, గనినది గాదె యని పలికె ÷ గాండీవి నృపా. 91

ఆ. పలికి సాదరముగ ÷ బభ్రువాహనుఁ జూచి, మానితాగమిష్యమాణచైత్ర
మాసపౌర్ణమాసి ÷ మహితాశ్వమేధకా, లంబు దానిదెసఁ దగలంపు గలిగి. 92

క. నీవును దల్లులు బంధుజ,నావళియుం బరిజనములు ÷ హాస్తినగరికిన్
రావలయు ధర్మజునిసం,భావనముం బడయు టొనఁగుఁ ÷ బరమశుభంబున్. 93

చ. అనవుడు నట్ల సేసెద నుదాత్తచరిత్ర పురంబు సొచ్చి యి
వ్వనితలు నీవు నావలనివత్సలతన్ గొనియాడు చియ్యెడన్
మన మలరంగ నిల్చి జనసమాన్యునిఁ గా నను జేసి ప్రీతి నే
ననుపఁగ వచ్చి చేయు మనుయానము యజ్ఞతురంగరక్షకై. 94

వ. అనుచుం బ్రణతుం డై బభ్రువాహనుండు ప్రార్థించినం బార్థుం డప్పార్థివుతో నేను దీక్షితుండ నగుట యెఱుంగవే నాకుం బురప్రవేశంబు సేయం జనదు పోయి వచ్చెద మీరును సుఖుల రయి యుండుం డనిన నట్ల కాక యని యతం డుచితప్రకారంబునం బూజించి యామంత్రణంబు సేయ నబ్భామలచేత ననుజ్ఞాతుం డై యమ్మహాత్ముం డా యజ్ఞాశ్వంబు ననుసరించె నదియు నిజేచ్ఛ నఖిల దేశంబులం బ్రవర్తిల్లె నట్టియెడ. 95

క. రాజగృహపురముకడ న,వ్వాజి యఱుగు టెఱిఁగి యాహవమునకుఁ బిలిచెన్
రాజత్కీర్తిధనుం డగు,నాజిష్ణుని మేఘసంధి యనురా జధిపా. 96

వ. అట్టు లప్పురంబుపతి యగుజరాసంధపౌత్రుండు బాల్యంబునం దన్ను నెదిరి నెఱుంగమిం గవ్వడిం గయ్యంబునకుం బిలిచి పుచ్చి తోడన కల్పితరథారూఢుం డై వెడలి యవ్వాసవికి నడ్డపడి. 97

సీ. వనితలలోపలఁ జనియెడుచాడ్పున, నివ్వాజిఁ గొని యించుకకేని శంక
లేక పోయెదవు పోనీక యేఁ బట్టెద, దీని గయ్యము సేసెదేనిఁ జేయు
మనుడు నవ్వుచు నతం డమ్మగధేశుతో, విఘ్నకర్తల నేను వెరవుతోడ
మాన్పింతు వినుము నాసమనమునఁ గిన్క లే, దది యెట్టు లనిన మదగ్రజుండు
తే. [1]సామమునన కర్జము నీవు సక్కఁబెట్టి, కొండుగాని యెవ్వరియెడఁ గ్రూరవృత్తి
వలవ దని నాకుఁ జెప్పిన వాఁడు గాన, యట్లు సేయుదు నీయిష్ట మాచరింపు.

—✿ అర్జునుఁడు జరాసంధపౌత్రునితో యుద్ధంబు సేసి యోడించుట. ✿—

చ. అనవుడు నేమియుం బలుక కానృపపుత్రుఁడు నిర్జరేంద్రపు
త్రునిపయి నుజ్జ్వలంబు లగుతూపుగముల్ వరఁగింప వాని నె
ల్ల నతఁడు శాతభల్లతతులం దునుమాడియు నొల్లఁడయ్యెఁ ద
త్తను వొకబాణ మేనియును దాఁకఁగ నేయ నరేశ్వరోత్తమా. 99

వ. అగ్గాండీవికృప యే మని చెప్పుదు. 100

క. తనమీఁద మగధుఁ డేయఁగ, జననాయక రథ్యములను సారథి నైనన్
గొనకొని నొప్పింపక య,ల్లన శరనికరంబు పైఁ గలయ నిగిడించెన్. 101

క. అది బలహీనతగాఁ గొని, మద మేపారంగ నక్కుమారుఁడు లీలం
గదిసి బలునారసంబులు, తదంగమున గ్రుచ్చె నతఁడు దాన నలిగియున్. 102

వ. ఆసహదేవపుత్రుగాత్రంబు దాఁక కుండునట్లుగా శరంబులు నిగిడించి. 103

ఉ. సారథిఁ గూల్చి యశ్వములఁ జంపి రథంబుఁ బగిల్చి కేతువుం
జీరి శరాసనంబుఁ బొడి చేసిన నమ్మగధుండు ధీరతో
దారగతిన్ సముజ్జ్వలగదాభ్రమణంబున బాహు వొప్ప న
వ్వీరవరేణ్యుపైఁ గవిసె విక్రమ మాకృతి దాల్చి పొల్చె నాన్. 104

1. క.చ. జ. 'సామమునఁ గర్జమున నీవు'.

వ. అట్లు గవియుటయు. 105

తే. అప్పుడును మత్సరంబున కలఁడు భాజ
నంబు గా కుండెఁ గాన యన్నకుఁడు వెడఁద
వాతియమ్ముల గద పలుప్రయ్యులై మ
హీతలంబునఁ దొరఁగంగ నేసెనధిప. 106

వ. అట్లేసిన. 107

సీ. నిర్వ్యాజపడినయాన్నృపనందనునితోడ, నయ్యతిబలుఁడు మూర్ఛయన్న యొకని
ప్రాణంబునకును దప్పుకు మయ్య యని [1]యాన,తిచ్చినకతన నేయ కున్న
నీ వింతపడి పోర నిలువఁ జాలితి విను, మది యట్లు లుండె రాజార్హ మైన
ధర్మంబు వాటించి తాఁకితి నన్ను నిం,తియ చాలు నింక శాంతియ నరేంద్ర

తే. తగినయది యని పల్కె నక్కేతుండు నిజము, నట్ల కా కని యూహించి యమ్మహాత్ము
పాదపరిసరమున భక్తిఁ బ్రణతుఁ డైన,గ్రుచ్చికౌఁగిటఁ జేర్చెయక్కురువిభుండు.

వ. వచ్చుచైత్రమాసంబునం బున్నమనాఁడు పాండవాగ్రజునశ్వమేధం బనుసంధిం
చుటకై బంధులు నీవును రావలయు ననిన నవ్వసుమతీపతి యట్ల చేసెద నని
యత్యంతవినయంబున నవ్విజయుం బ్రియపూర్వకంబుగాఁ బూజించి యామంత్రి
తుం జేసిన నాతండు ప్రీతుం డయి యభినందించి యమ్మగధపతిం బురంబునకుం
బోవం బనిచి యశ్వరత్నంబు ననుసరించె నదియును వంగ పుండ్ర మ్లేచ్ఛదేశం
బులం జరియింప నయ్యెరాజులు సెనకినం దేజోధనుం డగునాధనంజయుండు
జయించుచుఁ జన నత్తురంగంబు. 109

సీ. చేదిదేశంబు సొచ్చిన శిశుపాలుని,తనయుండు శరభుండు దనదుశుక్తి
పురము వెల్వడి యుద్ధపూర్వకంబుగఁ జేరి, యమ్మహావీరున కర్చ లిచ్చె
నతని వీడ్కొల్పియయ్యతుల తేజుఁడు ఘోట,కము వెన్కఁ జనుచుఁ డేంకణకిరాత
ముఖదేశనృపతులు ముట్టినఁ దగ గెల్చి, గొనుచుఁ గ్రమంబునఁ గోసలులను

ఆ. గాశులను జయించెఁ గ్రమ్మఱి యత్తురం,గము దశార్ణదేశగామి యయ్యె
జిష్ణుఁ డనుసరింపఁ జిత్రాంగదుం డని, సేసి యోడి పూజ సేసె నధిప. 110

వ. ఇట్లు దశార్ణపతి పార్థునిం బూజించి యాతనియాదరణంబు వడసి పోయెఁ బదంపడి
తురంగంబునిషాదాధీశదేశంబునకుం జనిన నేకలవ్యనందనుండు పాకశాసననందను
మీఁద నై పాదసేనాసమేతుం డై తోఁ తెంచిన. 111

చ. అతనిబలంబుఁ గ్రూరవిశిఖార్చుల నేర్చిన బాహుసారగ
ర్వితుఁ డగునన్నిషాదపతి వీఁక నెదుర్కొనినం గిరీటి యా
తతపటుబాణదీధితులఁ దన్మదసంతమసం బడంచె వాఁ
డతివినయంబునన్ వినతుఁ డై తగ నర్చితుఁ జేసె నాతనిన్. 112

1. గ. యప్పు, గించినకతన నేఁ ● గినియకున్న.

వ. ఆ యేకలవ్యనందనుం దనవశంబు సేసికొని ధనంజయుండు హయంబు ననుగమించి
నది మరలి మఱియును దక్షిణాభిముఖం బయి చని తిరుగఁ జౌండ్రాంధ్రద్రవిళ
కేరళకర్ణాట దేశాధిపుల ననాయాసంబున వశగతులం గావించికొని యోఁ గ్రమంబున
సౌరాష్ట్రంబు సొచ్చి గోకర్ణసమీపంబునం బ్రవర్తించి పదంపడి. 113

సీ. ద్వారకానగరంబుఁ జేరువ ఘోటక, మరుగంగఁ బ్రీతులై యదుకుమారు
లాలపుటాలంబుఁ ననువున నయ్యింద్ర, నందనుఁ గని పూజనం బొనర్చ
నభినందనము సేసె నవ్వీరుఁ డపరాబ్ధి, తీరదేశంబులఁ దిరిగి పంచ
నదములపైఁ జని మాన్య నరనాథ గాంధార, దేశంబు సొచ్చి వర్తింప శకుని

తే. నందనుఁడు బాల్యకలితదుర్నయము పేర్మిఁ
దనదు సేనలఁ గూర్చి యుద్ధామగతిఁ గి
రీటిఁ దాఁకిన నతఁడు వారించి పాండ
వాగ్రజుని యాజ్ఞ దెలుపంగ నంతఁ జోక. 114

క. పొదివినఁ గనుఁగవ వెడకెం, పొదవఁగఁ జతురంగముల శరోత్కరములఁ దాఁ
బొదివె విజయుఁ డవి వడియుం, జెదరియు సన్నంబులైనఁ జిత్తములోనన్. 115

ఉ. మత్సర మెక్కుఁగా సుబలుమన్మఁడు దుర్దమలీలఁ గిట్టి బీ
భత్సునిపై నిశాతశరపంక్తి నిగుడ్చఁ దదీయబాహుసం
పత్సముదీర్ణతం దనదుభావమునం గొనియాడి యెంతయున్
వత్సలుఁడైనయన్నరుఁడు వానికి నిట్లనుఁ గౌరవోత్తమా. 116

క. రాజులఁ జంపకు మని మా, రాజానతి యిచ్చె నుద్ధురత నే నని న
వ్యాజ విడిచిన నైనఁ బ, రాజితుఁగా నన్ను నద్ధరాపతి దలఁచున్. 117

—అర్జునుఁడు గాంధారదేశాధీశుతో యుద్ధంబు సేసి జయించుట.—

ఉ. కావున నేఁ గడంగ విను కయ్యము నీ కిది యేల తమ్ముఁడా
నా వినియున్ వడిన్ శకునినందనుఁ డయ్యమరేంద్రనందనుం
దా విశిఖంబులం బొదివె దానికి [2]నవ్వుచు వానిశీర్షకం
బా విజయుండు బల్విడఁ దయమ్మున నేలఁ బడంగ నేసినన్. 118

వ. అచ్చిత్రము సూచి యచ్చోటం గలయట్టి. 119

క. ఎల్లజనులు నివ్వీరుం, డొల్లఁడు గా కుత్తమాంగ ముర్వి నిటుల వే
డ్రొల్లఁగ నేయుఁడె వలసినఁ, జెల్లం బో యితనికరుణ చెలువి ట్లున్నే. 120

వ. అనుచు నక్కుమారుం జేరి యతనితేరు మరల్చికొని పోవంబోవ. 121

తే. దురభిమానము పేర్మి నన్నరవరుండు
మరలి నరుమీఁద నడవ మున్ దెరలి చనిన

1. జ. మాన్య నరనాథ. 2. జ. నప్పుడు తచ్ఛిరస్త్రకం.

బలము గ్రమ్మఱి యయ్యైంద్రపట్టిఁ జుట్టు
బలసి శస్త్రాస్త్రచయములు పరఁగఁ జేయు. 122

చ. అవి నిశితాస్త్రపంక్తిఁ దునుమాడి రయం బెసఁగంగఁ గప్పె నా
హవతల మంతయుం దలర నప్పటువిక్రమశాలి యమ్మహో
గ్రవిహరణంబునం గలఁగి కన్కనిఁ బాఱె బలంబు లక్కుమా
రవరునిఁ గాచికొంటకు ధరావర మంత్రులు వానితల్లియున్. 123

వ. అర్ఘ్యంబు గొని రయంబున శరణు శరణనుచు వచ్చిన నవ్వివ్యాచ్చ్యుండును నవ్వె
లంది నభినందించి మంత్రులకు మాననీయవచనంబులం బ్రియం బొనర్చి [1]య
బ్బాలునితో సాంత్వనస్వరంబున నిట్లనియె. 124

ఉ. నీ విటు వచ్చి నాపయి నహంకృపరాక్రము రాక నూచి మ
ద్భావము ఖేద మొందుటయు ధర్మజుపం పిది రాజకోటి నే
నేవిధి నైనఁ జంప నని యెల్లజనంబు వినంగఁ జెప్పనే
కావున నీబలంబులన కాని నినుం దెగటార్ప కుంటితిన్. 125

వ. విశేషించి గాంధారీధృతరాష్ట్రులం దలంచి నాకు నీడెస నిట్లు గావలసి యుండె.

ఆ. అట్టు లగుటఁ జేసి యవనీశనందన, యింత ప్రొద్దుఁ బోరి యింక శాంతిఁ
బొందు టొప్పు ధర్మపుత్త్రునితోడిపొం, దొప్పదయ్యె నీకు నుదితశౌర్య. 127

వ. అని చెప్పి యాగామి యయిన చైత్రంబుపున్నమనాఁ డన్నరేంద్రచంద్రు నశ్వమే
ధయాగంబున కనురాగం బెసంగ రమ్మా యనియును బలికి యప్పాండవమధ్య
ముండు మేధ్యాశ్వంబు ననుసరింప నది కరిపురంబుదిక్కు మొగం బయి యరుగం
జొచ్చె నట్టియెడ నతండు వివిధదేశంబులం దిరిగిన తెఱం గెల్లనుం జారులచేత విని
యజాతశత్రుం డప్పురుహూతపుత్త్రుం డశ్వరక్షణం బట్టి ధర్మప్రకారంబున
నిర్వహించుటకుం బ్రీతి వహించె నద్దివసంబు. 128

ఆ. మాఘమాసపౌర్ణమాసి యై యుండె నా, ధర్మనందనుండు పేర్మి వెలయ
నెలమి మిగులఁ బెద్దకొలువున నంచి తమ్ముల సగౌరవముగఁ బిలువఁ బనిచి. 129

వ. అనిలనందనునాననం బాలోకించి. 130

క. నీతమ్ముఁడు తురగముఁ గొని, యేతెంచుట వింటిఁ జైత్ర మింకఁ దడవు లే
దీతఱి మునులను నృపసంఘాతంబును బిలువఁ బంపఁగా వలయుఁ దగన్. 131

వ. యాగశాలయు శిల్పిజనులం గొని కల్పింపుము తగువారలకు విడియం దగియెడు
వివిధగృహంబుల నొనరింపు మని పనిచిన నతండు. 132

ఆ. యజ్ఞవాటమును జనాధిపులకు మునివ్రాతములకు విడియ వలయునట్టి
మందిరములుఁ గనకమణిమయంబులుగా నొనర్చెఁ దజ్జ్ఞమగుజనంబు వొగడ.

1. గ. యబ్బాలుని సాంత్వవచనంబుల.

క. ధరణీసురులను బనిచెను, ధర నెందును దిరిగి మునుల ధాత్రీశుల న
ధ్వరమునకుఁ బిలువుఁ డని య,మ్మరుత్సుతుఁడు వారుఁ జని సమంచితభక్తిన్.

చ. పిలిచిన రాజులున్ మునులుఁ బ్రీతి యెలర్ప బలోత్కరంబు శి
ష్యులుఁ దమతోడ రా మనము లువ్విళు లూరఁగ యజ్ఞవర్తనం
బులు గనుఁగొంటకై సకలభూవలయంబునఁ గల్గునట్టివా
రలు సనుదెంచినం గురుధరాపతి చిత్తము వేడ్క నూనఁగన్. 135

క. ఎదురుకొని వీడుఁబట్లకు, ముద మారఁగఁ దాన యనిచి మొక్కలములు నిం
పొదవించునట్టివియుఁ గాఁ, బదార్థములు [1] ప్రజదలమునఁ బాటించితగన్. 136

క. భోజనశయనాసనములు, రాజిల్లెడునట్లు గాఁగ రాజుల కెల్లం
దేజోధనుఁ డాధర్మత,నూజుం డిడఁ బనుచు జనవినుతసుచరిత్రా. 137

చ. మునులకు నెల్లఁ గందములు మూలములున్ ఫలకోట్లునుం బ్రియం
బొనరఁగఁ దాన పోయి మధురోక్తులతోడ సమర్పణంబు సే
యు నిటుల సంవిధానము లసూనము లై విలసిల్లఁ జేయు న
య్యనిమిషనాథవైభవుఁ డహంకృతివర్జనసంస్తుతంబుగన్. 138

తే. యజ్ఞవాటంబుఁ దక్కటిసాలయములు
లలితభంగి రమ్యములు సలక్షణములుఁ
గా నొనర్చినశిల్పినికాయమునకుఁ
బసదనం బిచ్చె సంతసం బెసక మెసఁగ. 139

సీ. పాండవాగ్రజుఁ డట్లు పవననందనుఁ బంచి, యజ్ఞశాలాకరణాదు లైన
కృత్యముల్ నడపుటకృష్ణుండు గనుఁగొని, కడుఁ బ్రీతిఁ బొందె నాగతనృపాలు
రచ్చెరు వొంది రయ్యమృతాంశువంశని,స్తారకుం డర్థిమైఁ దేర బనుప
ననవద్యపశువుల నఖిలజాతులవానిఁ, గొని వచ్చి రత్యంతకుశలపరిజ

ఆ. నంబు లన్నపర్వతంబులు నాజ్యవా,హినులుఁ గల్గి విప్రజనపరంప
రలు భుజించు పేర్మియొలసి యాగారంభ,సమయమద్భుతప్రజనకమయ్యె. 140

క. విను లక్షభూసురులు గుడిచిన నొకమరి మ్రోయుభేరి సెలఁగుచు నుండున్
జననాయక యెప్పుడు నే, మని చెప్పుదు నశ్వమేధయజ్ఞవిభూతిన్. 141

చ. శరధిపరీతభూమిఁ గలసర్వజనంబును దోఁచె నమ్మహా
ధ్వరమున భూపతుల్ మకుటపంక్తులు భూషణరాజిఁ జక్కఁగాఁ
బోరిఁబోరిఁ ద్రోచికొంచు మదిఁ బొంపిరి వోయెడు వేడుకం బనుల్
వెరవులు లావులున్ మెఱయ వేయువిధంబులఁ జేయు టొప్పఁగన్. 142

సీ. కలయంగ రాజులఁ గనుగొని ధర్మనం,దనుఁడు భీమునిఁ బిల్చి మనుజపతుల
కెల్లను వే పూజ లిమ్మన్న నమ్మరు,త్తనయుండు దగఁ దనతమ్ముఁదోయి

1. అ. పసదనములఁ.

నెలమిఁ గూర్చికొని మహీశుల సబహుమా,నంబుగఁ బూజించె * నలిననాభుఁ
డప్పుడ సీరిసాత్యకిముఖయాదవ,సహితంబు గాఁగఁ బ్రసన్నవదన
తే. కమల మొప్పంగఁ బాండవాగ్రజునికడకు
వచ్చుడును బ్రియ మలర న*వ్వసుమతీశుఁ
డాబలుండును నతఁడును * నాదిగా న
మస్తయాదవులకు నర్ఘ్యార్చ లిచ్చె. 143

వ. నారాయణుండు నరునిం బ్రసంగించి పాండవాగ్రజుముఖంబు గనుంగొని
ద్వారవతినుండి యాప్తుండును విచక్షణుండును నగువాఁ డొక్కరుండు వచ్చి
వివ్వచ్చుం డప్పురంబుపరిసరంబునఁ బోవం జూచితి ననియు వివిధసంగరంబులం
దదంగంబు కృశం బై యున్నయది యనియుం జెప్పె నప్పార్థుండు నేరువకు
నరుగుదెంచెం గాలోచితక్రియాకలాపంబునకుం దొడంగు మనవుడు నప్పుడమి
ఱేఁ డప్పురుషోత్తమునితోడ. 144

క. నీవంపునఁ బోవుట నుద్దీపితబలశౌర్య*ధైర్యతేజోయుతుఁ డై
యాపార్థుఁడు యోగక్షే,మోపేతుం డయ్యె నడపు * మచితంపుఁబనుల్. 145

— కృష్ణుఁడు ధర్మజునితో నర్జునసందేశంబు సెప్పుట. —

వ. అనిన నవ్వారిజనాభుండు ద్వారకనుండి వచ్చినవాఁ డగ్గాండీవి దనతోడం
జెప్పె నని చెప్పినమాటల తెఱం గాకర్ణింపుము. 146

ఆ. నాదువిన్నపముగ * నరనాథునకు విన్న,వింపు రాజు లెల్ల * వేడ్కతోడ
జన్నమునకు వచ్చు*చున్నారు మున్నట్టి,వారలైనఁ బూజ * వలయు ననుము. 147

వ. విశేషించి మదీయపుత్త్రుండు. 148

క. మణిపూరపురాధీశుఁడు, గుణగణవిభ్రాజితుండు * గురుహితుఁడు విచ
క్షణవరుఁడు బభ్రువాహనుఁ, డణుమాత్రముఁ గీడు లేని*యట్టిం డెందున్. 149

క. మీచరణసరసిజంబులు, జూచుటకై రాక దనకు * సువ్రతముగ ము
న్వేచి యునికి వచ్చుఁ గృపా,గోచర మగుచేతకుం ద*గును మీ కనుమీ. 150

వ. అని చెప్పె ననిన విని యవ్వాక్యంబు లభినందించి ధర్మనందనుండు గోవిందుని
తోడ. 151

సీ. ఏ వింటి విజయుఁ డ*నేక యుద్ధంబుల, నలజడి వడుట య*ట్లతఁడు నాఁడు
నక్కట ద్రోణభీ*ష్మాదులతోడియె,క్కుడుఁబోర నిడుమలఁ * బడియె నేఁడు
నిత్తెఱంగునఁ బడి*యెడు నాకుఁగా నిన్ని,పాటులు వడునె య*త్యపరమసౌఖ్య
యోగ్యదేహుండు ని*న్నొక్కటి నడిగెద, నతనిమేను సులక్ష*ణాన్వితంబు
తే. నామదికి నెక్క నీవు గ*న్యాఱిపి కన్న,యట్టికీడు తదీయంబు * లైనయవయ
వముల నెం దేనిఁ గలిగెనే * యమితదుఃఖ,భాగి యగుటకు మూలమై*పద్మనాభ.

క. తెలుపఁ దగునేనిఁ గరుణం, దెలుపుము నా కనుడు వాసు*దేవుఁడు నీకుం

జలుపుటయుఁ గృత్యమే విను, తెలిపెదఁ గఁమాత్ర వసుమతీవరముఖ్యా. 153

తే. సర్వగాత్రంబులందును సవ్యసాచి
కధికశుభలక్షణంబు లతిశయిల్లుఁ
దనువుమాత్రకు నించుక ధరణినాథ
యెక్కుడై యుండుఁ జిఱుదోడ లిదియ కొఱఁత. 154

క. అలజడ్లు దీనివలనం, గలిగెడునో కాని తక్కు గలుగ దరిష్టం
బలఘుశుభలక్షణాన్విత, విలసితతనుఁ డైన గాండివికి నెయ్యెడలన్. 155

వ. అట్లు నన్నరూపు సెప్పిన వెన్నునివచనంబులు విని యవ్వసుంధరావల్లభుం డతని యాననం బాలోకించి యది యట్ల కాక యని పలికె నప్పుడు పాంచాలి పద్మనాభుం బ్రీతిస్మితం బగుచూడ్కి నాలోకించిన నాలోకనాథుం డది యర్జునవిషయం[1]బైన ప్రీణనంబు తెఱంగగుట యెఱింగికొనియె నట్టియెడ భీమాదులును యాదవకుమారులును నక్కిరీటిగుణంబు లగ్గించుచు నాప్రొద్దున కదియ గోష్ఠిగ సల్లాపంబు సేయుచుండ నగ్గాండీవిపాలనుండి కాలరి సనుదెంచి. 156

సీ. పాండవాగ్రజునకుఁ బ్రణతి యొనర్చి వి,ప్రవ్యుచ్చుఁ డిప్పురి సేర వచ్చె నెల్లి
వచ్చు మీ శ్రీపాదవనజంబులకు మ్రొక్క,ననవుడు హర్షాశ్రు లడరఁ బులకి
తాంగుఁ డై వానికి నన్నరేంద్రుఁడు పస,దన మాభరణవస్త్రకనకములు స
మగ్రంబుగా నిచ్చె నందఱు నానంద,రసమునఁ దేలి యారాత్రి పార్థుఁ
ఆ. జూచువేడ్క నూనుచును వేగు టెప్పుడో
యనుచు నుండ నుదయ మయ్యె నిన్నఁడు
క్రీడి సమయవిహితకృత్యముల్ సలిపి హ
యంబు మున్న గాఁగ నరుగుదెంచె. 157

వ. అప్పుడు. 158

అర్జునుఁడు యజ్ఞాశ్వంబుతోడ హస్తిపురంబునకు వచ్చుట.

క. విను మింద్రతురగసమక్షేళనమున నవ్వాజి జనములకు నెల్లను లో
చనపర్వ మయ్యె వారివ,దనముల సంతోషమధురతరభాషణముల్. 159

సీ. కలయంగ నిట్లని చెలఁగె నిగ్గాండీవి, దక్క నిమ్మాడ్కి నొండొక్కరునకు
నశ్వంబు దనయిచ్చ నఖిలదేశములకు, నరుగంగ ధరణీశు లచట నచట
బలములతో వచ్చి బలసి తదీయరో,ధం బాచరింపఁ దృణంబు గాఁగఁ
గొని లీలమై గెల్చు గొనుచోట్ల నుగ్రత, వాటింప కగ్రజువలుక యెట్టి
తే. దశల నైనను బాటించి తా నొకండ, ననుతలం పెప్డు నుల్లంబునందు లేక
తనువు గవుసెనఁ బెట్టి పుచ్చినవిధమున, [2]నరుగుదేవచ్చునే యిది యక్కజంబు.

క. సగరాదులఁ జెప్ప వినమె, మగఁటిమియును బలము నిట్లు సమానుషభంగిన్

1. గ. బైన ప్రణయంబు తెఱం, 2 చ. నరుగుదెంచు నె యిది గడు నక్క.

నెగడని యింకను బుట్టఁడు, జగతిని [1]గాండీవితోడ ‡ సరివచ్చుమగల్. 161

క. మానుషము దైవమును సరి, నే నేనని కార్యసిద్ధి ‡ నెలయింపఁగ ని
త్యానందుఁ డయ్యె ధర్మజుఁ, డీనిర్మలభాగ్యమహిమ ‡ యేరికిఁ గలదే. 162

క. విను మట్లు సెలంగఁగ ఘూర్ణన మొందినయర్ణవం బగుచుఁ బొంగారెన్
జననికురుంబం బావెం, పనఘా చూడ వినఁ బడయు ‡ మఖిలజగములన్. 163

వ. మఱియును. 164

సీ. నృపు లోహటింప యంత్రపుమీను నేసి చేకొనియెఁ బాంచాలునికూఁతు నితఁడె
సురసేనతోఁ బురందరు గెల్చి భుజగర్వ, మేపార ఖాండవం ‡ బేర్చె నితఁడె
యొక్కటిబవరాన ‡ నీశాను మెప్పించి, పాశుపతాస్త్రంబుఁ ‡ బడసె నితఁడె
యొంటిమై భీష్మాదియోధుల కురుపతి, ధృతిఁ బాపి గోవులఁ ‡ [2]దెచ్చె నితఁడె

తే. ప్రతిన సేసి విషమసమరమునఁ బ్రొద్దు
గ్రుంక నీ కాఁగి సైంధవుఁ ‡ గూల్చె నితఁడె
యనుచు సందడిగాఁ గ్రమ్మి ‡ యుబ్బు లెత్తి
చూచె జనలోక మాసవ్యసాచిఁ బ్రీతి. 165

క. ఆవాక్యము లెల్ల వినుచు, భావము లలర నర్జునుండు ‡ భాసుర మగున
మ్మావ నగ్రేసరముగ యజ్ఞావాసంబునకు వచ్చె ‡ నంచితలీలన్. 166

వ. అట్టియెడ ధర్మనందనుండును భీమాదులును గృష్ణుండును బలదేవ ప్రభృతులును
ధృతరాష్ట్రుం బురస్కరించికొనుచు నప్పార్థు నెదుర్కొని రతండు వారల నెల్ల
సముచితాచారసంప్రీతులం గావించి గాంధారిని గుంతినిం గాంచి యీఁతకాఁడు
తీరంబు గనినచందంబు నొంది యందఱు నభినందించుచుం బొదివికొని యుండ
నొక్కరమ్యప్రదేశంబున నుండె నాసమయంబున. 167

సీ. బభ్రువాహనుఁడు వైభవ మొప్పఁ జిత్రాంగ
దయు నులూపియుఁ బ్రమదంబుతోడఁ
దోడ రా ధర్మపుత్త్రునిమందిరమునకు
నరుగుదెంచుటయు నక్కురువరేణ్యుఁ
డును దమ్ములును గృష్ణుఁడును బలభద్రాది
యాదవులును బ్రీతు ‡ లై తదీయ
సందర్శనము సర్వసత్కారచరితార్థ
ముగఁ జేసి రతఁడును ‡ దగినవిధుల

తే. నందఱకుఁ బ్రియ మొనరించి ‡ యాంబికేయు
సతనిభార్యను గని నమస్కృతు లొనర్చి
గొంతిఁ గాంచి యామమయుగులకు నెఱఁగి

---

1. క. సరివచ్చుమగలు ◆ శతమఖసూనున్, 2. గ. దెచ్చె.

[1]పలుదెఱఁగుదీవనలును గొంకగిలియఁ బడసి. 168

వ. ధర్మపుత్త్రుం గొలిచి కూర్చుండ నతని కతంబున ననుజులును వేర్వేఱ సర్వరత్న రాజివిరాజితంబు లగుభూషణంబులను బహుమూల్యాంబరంబులును నొసంగిరి సీరపాణి శౌరి ప్రభృతులు ప్రభూతాభరణంబులను భాసురవాసోవిశేషంబులను నతని నర్పించి రయ్యవసరంబున. 169

సీ. చిత్రాంగదయు నాగకన్యపుత్త్రియుఁ దొలితొలి, గాంధారిఁ గనిగొంతిఁ గాంచి చెలిమి దీపించి గాఢసంభావనఁ గౌఁగిటఁ, జేర్చి యద్దేవి రత్నాన్విత్రు లెసఁగు తొడవుల నర్పించె ద్రోవదియును సుభ, ద్రయు వారుఁ ద మ్ముచితప్రకార మునఁ గన్న నమ్మెయి వినుతపూజనముల, నతులసమ్మోదము నావహించి

ఆ. యోగ్యకేళములను నునిచి తత్సల్లాప, సౌఖ్య మొంది రట్లు సకలవర్త నముల నశ్వమేధసముపక్రమం బుదా, త్తాభిరామ మయ్యె నధిపముఖ్య. 170

వ. పదంపడి యర్హదివసంబు సంప్రాప్తం బగుటయు సాత్యవతేయమునిపతి కురుపతి పాలికిం జనుదెంచి నేఁడు యజనంబునకుం దొడంగుము యాజ్ఞికులు శుభము హూర్తం బాసన్నం బయ్యె నను చున్నవారు నీమఖంబు మహనీయంబు నీవు మహాధనవంతుండ వైతి దక్షిణలు ముమ్మడుంగులుగా నిడి మూఁడుమఖంబుల ఫలంబు నొందు మశ్వమేధావబృథంబు పరమపావనంబు సమస్తదురితపరిహరణ నిపుణంబు నీకు భారతరణకృతజ్ఞాతివధంబు పాతకం బనుమెరమెర మనంబునం గలిగి యుండు నట్టివి యెల్లను దీన నిస్తుషంబు లగు సమస్తశుభంబులు నావహిల్లు నని యాజ్ఞాపనంబు సేయుటయుఁ బ్రాజ్ఞప్రవరుం డైనయాభూవరుండు. 171

—❀ ధర్మరా జశ్వమేధయాగంబు నుప్రయోగంబుగాఁ జేయుట. ❀—

క. ప్రయతుం డై హయమేధ, క్రియాకలాపంబునకుఁ బ్రకీర్త్యముగాఁ జొ చ్చి యుదాత్తభంగి జనమే, జయభూవర నడపె గాఢసంప్రీతిమెయిన్. 172

క. క్రమయుక్తము యుక్తముఁగా, నమరగురుప్రతిము లైనయాజ్ఞికులు క్రియా సముదయము నడపఁగా స్థలి,తము లేకపహుశము సారకతత్క్రతువొప్పెన్.

చ. అవహితు లై ప్రవర్గ్యము యథాభిమతంబుగఁ జేసి ఋత్విజుల్ సవనము లుక్తమార్గము ప్రశంసకు నెక్క నయించి వేదవా క్యవిహితవృత్తిమై నభినవాభ్యుదయం బొనరించి రర్థి మా ధవుఁ గొనియాటలం దమకృతంబులకుం మెఱుఁగిడ్డయట్లుగన్. 174

వ. అట్టియెడ. 175

సీ. [2]వివిధభోజ్యపదార్థవిభవంబువలనను, సంతృప్తిఁ బొందక చనునరుండు ధనధాన్యవస్త్రసంతతిలబ్ధి దారిద్ర్య, ముపనయింపక యేఁగునట్టివాఁడు గోరి యెయ్యది యైన గారవ మొసగంగఁ, బడయక రిత్తపోయెడుమనుష్యుఁ

1. గ. పలుదెఱఁగుదీవనయును 2. గ. సారాన్నముల మనోహారిపానములను.

డెద్దియేనియు దుఃఖ మొలసినఁ జనుదెంచి, యది నిస్తరింపక యరుగునతఁడు
తే. మందునకు [1] వెదకినను లేఁడు దంద మొంద, నరసి కుడువఁడు కట్టఁ డిచ్ఛానురూప
వస్తువులు గైకొనఁడు దురవస్థ దెలిపి, పాపికొనఁ డని భీముఁ డంతవలుకుచునికి.
ఉ. ఆయతులాధ్వరంబున వ్రతాభిరతత్వము లేనివాఁ డుపా
ధ్యాయుఁడు గానివాఁడు నిగ్రహాంగకపట్కము లేనివాఁడు లేఁ
డేయెడఁ జూచినన్ సభ నరేశ్వర యట్టిసదస్యు లమ్మఖు
న్నాయకుకొల్వుదివ్యమునినాథులు దక్కఁగఁ గల్గ రెచ్చటన్. 177
వ. అట్లుం గాక. 178
సీ. కనుఁగొను కౌతుకంబునఁ గూడి చనుదెంచి, దివ్యమునీంద్రు లక్కడ ప్రియమున
నభినందనము సేయ నఖిలగంధర్వులు, నానందనము లగు గానములను
నప్సరఃస్త్రీలు హృద్యము లైన నృత్యవి, శేషంబులను సల్లలిల్లుచుండ
సిద్ధవిప్రజనంబు సేసలు సల్లుచు, బహువిధాశీర్వాదపరతఁ బరఁగ
తే. నాద్యులై పేరు గలుగుపూర్వదార్వు రవని
వరులయాగంబులకు సరివచ్చు మిగులుఁ
గాని యిది వత్రపడ దనఁగా వెలుంగు
ధర్మతనయునియశ్వమేధము నరేంద్ర. 179
వ. పసిఁడియిటికలం జతుశ్చిత్యంబు నష్టాదశకరాత్మకంబును గరుడాకృతియును గా
యజనం బొనర్చి మహనీయం బై యొప్పుచుండ యూపక్రియాసమయంబున
ఖాదిరంబు లాఱును బైల్వంబు లాఱును బాలాశంబు లాఱును దేవదారు
మయంబులు రెండును శ్లేష్మాతకతరుకల్పితం బొకండును గా నిరువదియొక్క
యూపంబులును దక్కను శోభనార్థంబుగా ననేకకాంచనయూపసంచయంబును
శాస్త్రోక్తప్రకారంబున యాజకులు నిలిపి వానియందు. 180
క. నలుగాలివానిఁ బక్షుల, జలచరముల విధియుతముగ సంయోజింపం
బొలిచెం బశువులు మున్నూ, ఱలఘుయశోమహిత యమ్మహాయజనమునన్. 181
క. వరయూపనియోజిత మగు, తురంగమముచుట్టఁ బశుతతుల నిల్పినసుం
దరభావము దక్షమఖ,స్ఫురణం బిట్టి దని చూపునపోలిక మెఱసెన్. 182
తే. ఆగమోక్తంబు దర్శనీయంబు నైన, యాసుతంత్రంబు నొనరించు యాజకోత్త
మావలికిఁ దా నలంకారమై పరాశ, రాత్మజునిశిష్యకోటి యొప్పారె నధిప 183

ధర్మరాజు వ్యాసునకు యజ్ఞదక్షిణగాఁ దనరాజ్యం బంతయు నిచ్చుట.

వ. సర్వపశు [2] శ్రపణంబు లాచరించి ఋత్విగ్జనంబు లశ్వాలంభనసమయంబున
యాజ్ఞసేని సన్నిహితం జేసి యశ్వంబునవయవంబులమాంసంబు లయ్యైదేవత
లకు నాహుతు లిడునప్పు డమ్మహాదేవి నిజహస్తంబునం జేయం దగియెడు

1. క. వెదకిన లేఁడు ♦ నంద. 2. గ. విశసనంబు లాచరించి.

హుతంబులు సేయించిరి తదనంతరంబ యశ్వవపాహోమంబునం బరఁగు గంధం బాఘ్రాణించి ధర్మనందనుండు దమ్ములుం దానును బరమానందంబునం బొందె శేషించినయశ్వావయవంబు లర్హప్రకారంబున యాజకులు వేల్చి రిట్లు సాత్వవతేయుండు యుధిష్ఠిరునశ్వమేధం బఖిలలోకహితంబుగా నిర్వహించి యాతనిగుఱించి యుదాత్తనాదం బెసంగ నాశీర్వాదంబు సేసె సమస్తదేవ మునులును దీవన లిచ్చి రప్పుడు కౌరవవంశపావనుం డగుభూవరుండు. 184

తే. అలఘుభక్తినదస్యులకు కాలమి యొసక, మెసఁగఁగోటిపేల్ నిష్కములు లిచ్చి తనదు
వసుధ యంతయునొసఁగె దిగ్వ్యప్రబోధ, ఘనత నొప్పు వేదవ్యాసకము నివరునకు.

క. విను బుత్విగాద్యుఁ డగున, మ్మునిపతి యట్లు కురువంశముఖ్యుఁ డొసఁగ మే
దిని సంప్రమోదమునఁ గై, కొని యిట్లను నానరేంద్రకుంజరుతోడన్. 186

ఆ. జగతి బుత్విగర్థముగ నిచ్చి తేము వి, ప్రస్వభావకలనఁ బసిఁడి గొనఁగఁ
గోరెదము కరంబు గారవంబున బ్రాహ్మ, ణాభిలషితదాయి వగుట మేలు. 187

వ. అని వెండియు. 188

క. ఇలకు వెలగా హిరణ్యం, బలఘుమతీ మాకు నొసఁగు మనుటయు ధరణీ
శులు వినఁగా నప్పారవ, కులపతి యా వేదరత్నకున కి ట్లనియెన్. 189

ఆ. అశ్వమేధమునకు నార్యులు దక్షిణ, ధరణి యండ్రు గాన నరునిచేత
విజిత యైనధరణి ప్రజనితప్రీతిమై, బుత్విగర్చనముగ నిచ్చినాఁడ. 190

వ. అని మఱియును. 191

చ. వనమున కేఁగి యందు సుఖవాసత నుండఁగలాఁడఁ గాక యే
ననఘవిచార బ్రహ్మధన మక్కట కొందునె యన్నఁ బ్రీతిమై
ననుజులు యాజ్ఞసేనియును నట్టిద యావని యొండు సెప్ప కుం
డనుటయు హర్షబాష్పపులకాంకురముల్ ధరియించి రందఱున్. 192

వ. అప్పుడు. 193

తే. దివ్యవాణి కీర్తించెఁ గౌరవ్యవరుని
నఖిలజనములుఁ బ్రస్తుతిముఖరు లైరి
తానుఁ బొగడి వేదవ్యాసుఁ డానరేంద్ర
చంద్రునకు నిట్టు లను విప్రచయము వినఁగ. 194

క. ఏ మమ్మెద మునినఁ బృథివి, యోమనుజాధీశ కొనుట యొప్పదు తెరు విం
దేమియును నెగ్గు లే దీ, భూమిసురులకోర్కి దీర్చి పుచ్చుము ప్రీతిన్. 195

క. అని పలికినఁ గృష్ణుం డి, మ్మునినాయకుపనుపు సేయుము నరేశ్వర నీ
వని చెప్పిన నొడఁబడి తన, యనుజులతో నట్ల కాక యని యతఁ డర్థిన్. 196

తే. కోటికోటులుమాడలు గుప్పవోసి, ధరణివెల యని చెప్పి యప్పరమసంయ
మాధిపతికి సమర్పించె నతఁడు బుత్వి, గాళులకిఁ బంచి పెట్టెనయ్యతులధనము

